సరస్వత్యనుబంధము. ౩౧ రు.



# కువలయాశ్వచరిత్రము.

సవరము చిననారాయణశాస్త్రులచే ప్రణీతము.

(సరస్వతీపత్రికనుండి పునర్ముద్రితము)

మొదటికూర్పు.

కాకినాడ:

శ్రీబాలసరస్వతీముద్రాక్షరశాల.

1903

వెల 8 అణాలు.

# పీఠిక.

ఈకువలయాశ్వచరిత్రము సవరము చిననారాయణనాయకునిచే రచియింపఁబడి నారాయణభూపాలున కంకితమీయఁబడినది. కృతికర్తకీకృతిపతి పెంపుడుతండ్రి. ఇతఁడు తనవంశమునకుఁ గూటస్థునిగా సూర్యుని వర్ణించుటచేత క్షత్రియుఁడనియే తోఁచుచున్నది. కాని, నాయకపదమేలవచ్చెనో తెలియకున్నది. మనదేశమందీనాయకపదము క్షత్రియ శూద్రులయందుఁ గలదు. మఱియును మనదేశమున నచ్చటచ్చట బొబ్బిలి[illegible] పాటలలో తిమ్మరాజుపాటలో "సవరము నారప్ప" యనువాని చరిత్ర కొంతగలదు. ఆనారప్పయే యీకృతిపతి యేమోయని శంకపొడముచున్నది. ఈకృతిపతితండ్రిపేరు తిమ్మరాజు. ఈతిమ్మరాజు మిక్కిలి ప్రసిద్ధుఁడు. ఎంతవఱకునిజమో తెలియదు. మఱియు నీకవి కాశ్యపగోత్రజుఁడౌటఁగూడ నాయకపదపక్షమునే రూఢిపఱచుచున్నది. ఏదియెట్లున్నను గ్రంథోక్తముగా క్షత్రియుల క్రింద వర్ణించుకొనినప్పుడు మనమును క్షత్రియులనక తీరదు. ఈకవి తనపూర్వులను వర్ణించినపద్యములు చూడఁగా వీరనేకయుద్ధములలోఁ దురుష్కరాజుల నోడించినట్లును పిఠాపురదేశము పరిపాలించినట్లును గనఁబడుచున్నది. తనకన్నతండ్రికి సవతితమ్ముఁడును తనకుఁ బెంపుడుతండ్రియునగు కృతిపతినివర్ణించునప్పుడొకచో "శ్రీరంగరాజకుమార, వీరవేంకటరాయ భుజాబలసహాయ వివిధోపాయధురీణుం" డను నొకవిశేషణము కలదు. దానింబట్టి చూడ నీయిరువురును మిత్రులనితోఁచినను "కర్ణాటాధీశ్వరవరమాసాంద్రమందహాసు నారాయణేంద్రుం" డనియు "వీరవేంకటరాయ భూవిభునికరుణ నెలమిఁ బాలించె నిలనారసేశ్వరుండు" అనియుఁ జెప్పుటచే నావీరవేంకటరాయనికీకృతికర్త సామంతరాజని విస్పష్టమగుచున్నది. ఈవీరవేంకటరాయలు కర్ణాటరాజగుటచేతను రంగరాజకుమారుఁడగుటచేతను కృష్ణదేవరాయల యల్లుఁడగు అళియరామరాజు తమ్ముఁడనియే యూహింపవలయును. వసుచరిత్రకృతిపతియగు తిరుమలదేవరాయని తండ్రి రంగరాజనియు నన్న రామరాజనియు వసుచరిత్రమే చెప్పుచున్నది. కావున నీవీరవేంకటరాయలు తిరుమలదేవరాయలకును దమ్ముఁడే. ఈవీరవేంకటరాయలు (1580 సం॥ న) చంద్రగిరిలోఁ బట్టాభిషిక్తుఁడగుటవలన మనకృతిపతియును నాతనికి సమకాలికుఁడు. కావున నితఁడును 16 శతాబ్దము చివరనున్నవాఁడు. కాఁబట్టి యాతనికి దత్తకుమారుఁడగు కృతికర్త 17 వ శతాబ్దము మొదటివాఁడని నిశ్చయింపవలయును. 'తనదానగుణము గోదావరీతీరభూనిర్జరేశ్వరులు వర్ణించుకొనఁగ' ననుటవలన నీకృతిపతి కృతికర్తలు గోదావరిమండలమేలినవారేమోయని భ్రమకల్గుచున్నది. కృతికర్త రాయభూపాలకుమారుఁడని కవులచరిత్ర చెప్పుచున్నది గాని రంగరాజకుమారుఁడుగాని రాయభూపాలకుమారుఁడు కాఁడు. కృతిపతితాతయగు తిమ్మరాజునకు తిరుమలాంబ మాణిక్యమాంబ రంగమాంబ లక్ష్మమాంబ కొండమాంబ గురవమాంబ యను నార్గురు జీవత్కళత్రములు కలవనియు నందుఁ దిరుమలాంబకు

మారుఁడు రంగరాజునియు మాతృకామాంబకుమారుఁడు నారాయణరాజునియు రంగరాజ కుమారుఁడగు కృతికర్తను రంగరాజు సోదరునికుమారుఁడగు వేంకటరాజును మాతృకామాంబ కుమారుఁడగు కృతిపతి నారాయణరాజు పెంచుకొనెనని పీఠిక చెప్పుచున్నది.

ఇతని కవిత్వమతిప్రౌఢమై సలక్షణమై నవరసభరితమై వినువారిచెవులకుఁ జవులు గొల్పుచున్నయది. ఇతనికిఁ గలయపూర్వవస్తుకల్పనాచాతుర్యము మనకవికుటుంబములో నలుగురైదుగురికిఁ దప్ప నెవ్వరికిని లేదని నొక్కి చెప్పవచ్చును. ఒక్కొకచో నితఁడు వర్ణించిన విషయముం జూచిన నితనికి సముఁడగు కవి లేఁడనియే తోఁపించుచుండును. ఇందుఁ గావ్యలక్షణములగు సమస్తవర్ణనలు వర్ణింపఁ బడినవి. ఇంచుమించు పింగళిసూరనార్యుని కళాపూర్ణోదయమువలె నాటకశైలిగా నున్నది. దీనిమూలకథ మార్కండేయపురాణములోనున్నది. దానికిని దీనికినిఁ గొన్నివిషయములలో వ్యత్యాసము కలదు. అందు మదాలస చచ్చిపోయిన పిదప నశ్వతరుఁడను నాగరాజు తపముచేసి మదాలసవంటి కన్యకను తనమధ్యఫణమునుండి పుట్టించి మరలఁ గువలయాశ్వునకిచ్చినట్లున్నది. చచ్చిపోయినదానిని మరలఁబుట్టించునాయను సందేహముచేఁ గాఁబోలు నీకవియట్లు చెప్పక మఱియొకవిధముగా మార్చినాఁడు. ఇత్యాదిభేదములు కొన్ని కలవు. ఈకథ విచిత్రరామాయణములోఁ గూడనున్నది. ఎందెట్లున్నను నీకవికథాకల్పనయందద్భుతశక్తి కలవాఁడు. ఈకథనే నాటకముగా వ్రాయఁబూనినచో వేఱయితివృత్తముగల్పింప నవసరమే లేదు. తినఁబోవువారికి రుచిఁ జూపింపనేలయని యిందలి యత్యుత్తమవర్ణనలు కలపద్యముల నిందుదాహరింపమైతిమి.

ఈగ్రంథమును దంజాపూరు సరస్వతీభాండాగారమునుండి యక్కడి యాజమావారిచే వ్రాయించి తెచ్చుటచేతఁ గొన్ని వ్రాఁతతప్పులును గొన్ని గ్రంథమందలి లుప్తభాగములును గల యొక్కప్రతియే మాకుదొరకుటచే దానిననుసరించి యథామతి లుప్తభాగములను వ్రాఁతతప్పులను శతావధానులు తిరుపతివేంకటేశ్వరకవుల సహాయమున బరిష్కరించి మాసరస్వతీ పత్రికయందుఁ బ్రచురించితిమి. పూర్తిగా సవరించుటకు వీలులేనివి సవరించినఁ గవియభిప్రాయమునకు భిన్నమగునేమోయని విడిచితిమి. ఎవ్వరియొద్దఁగాని మఱియొకప్రతియున్నచో దయయుంచి మాకుఁ బంపినయెడల భేదములు సరస్వతిలోనుండి పునర్ముద్రితములగు ప్రతులలోఁ జేర్చెదము.

ఇది సవరించుటలో నిజముగాఁ గ్రొత్త గ్రంథము వ్రాయఁదగినంత పరిశ్రమపడితి మనుటకు సందేహములేదు. అట్టిదైనను నెచ్చటనోయున్న దతికష్టముచే సంపాదించినదైనను నుత్కృష్టమగు రసవత్ప్రబంధమైనను నావ్యయప్రయాసలు మేమేభరించి పాఠకులకుఁ దక్కువవెలకే యిచ్చుచున్నాము.

ఇట్లు, ఆంధ్రభాషాభిమాని,
శ్రీ కొ. రా. వెం. కృష్ణరావు.
సరస్వతీపత్రికాధిపతి.

శ్రీ ర స్తు.

# కువలయాశ్వచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

---

శా. శ్రీరాధాధరబింబసంభృత సుధాబృందాతిమాధుర్యగా
ధారీతు ల్ప్రకటించు లీల మురళీధారేయుఁడై గీతసం
చారంబు ల్వెలయించుకృష్ణుఁడు దయాసర్వస్వతాగౌరవం
బూర న్నారమునారనాధిపుఁ జిరాయుశ్శ్రీయుతుం జేయుతన్. 1

సీ. తనమందహాసనూతనకాంతి కాంతకీర్తికలాపములను సంధించుకొనఁగఁ
దనయాస్యపద్మంబు ధవరాగరసఝరీ పటిమతోడుత మాటపలుకులాడఁ
దనతనూదీప్తిసంతతులు నాయకమహస్తోంబునకును విందులు ఘటింపఁ
దనయురోజాచలత్వంబు మనోనాథకఠినధైర్యముతోడఁ గలసిమెలఁగ
రాజులఁ దిరస్కరించుచు రమణుఁ డున్న, యరదమెక్కిన రుక్మిణీసరసిజాయ
తాక్షి సవరమునారాయణాధిపేంద్రు, శుభదయాపూర్ణవీక్షచేఁ జూచుఁగాత. 2

చ. నెలకొనుజూటసౌరతటినీనవకైరవిణీవధూటితో
లలితసుధాంశుఁ గూర్చినతలంబునఁ బార్వతిఁ గూడి యద్రికిం
గలయికకుం దెన ల్నడుపఁగాఁ బనిపూనిన యాశపాలకుం
డలశివుఁ డిచ్చుఁగావుతఁ జిరాయువు నారనభూపమౌళికిన్. 3

చ. తనతనుకాంతి కాంతజలదప్రతిమానగళాగ్రనీలిమం
బెనక వరాంగరోచి నిజచిత్రసుధాస్మితపాండిమంబుఁ జి
క్కనితమి ముద్దుఁబెట్టుకొనఁగాఁ బతికౌఁగిట నున్నయద్రినం
దన సవరంబు నారనజనప్రభు నెప్పుడుఁ బ్రోచుఁ గావుతన్. 4

సీ. నుడుగులపూఁబోఁడి యడుగులబెడఁగు వీక్షించుచోఁ బదము పఠించుకొనుచుఁ
బలుకుటొయ్యారి గుబ్బకవ గందపుఁబూఁత నెంచుచోఁ జర్చ వర్ణించుకొనుచు
మాటమిటారి సయ్యాటంపునడ నిరీక్షించుచోఁ గ్రమము గుణించుకొనుచు
మినుకుఁబ్రోయాలి కింపునఁగీలుజడయల్లఁ జెనువుచోఁ నలజటఁ జెప్పుకొనుచు
వాణిశారీరరుచివైభవంబుఁ జూచు, వేళ వర్ణక్రమంబు భావించుకొనుచు
నెమ్మి నగుతమ్మిచూలి మాతిమ్మనృపతి, పుత్రునారాయణాధిపుఁ బ్రోచుఁగాత. 5

శా. వీణాదండచల త్కరోజ్జ్వలవిభ ల్వెల్లన్నఖోద్యద్రుచి

క్ష్మేణుల్మించుగ గానకర్త్ర జిగిరించెం బూచెనంచున్మదిం
గాణ మెచ్చఁ గఁజాటపాడి పతికి న్నంతోపముంగూర్చనా
వాణీనీరజనేత్ర నారసధరావగ్రజింగ్రుపం బ్రోవుతన్. 6

మ. కలుగున్లాయపు తేజికిం భయము మైఁ గాన్పించు నీశానుసా
మ్ములకుం డమ్మని కత్తలానము రయంబు ల్మీర రావించి నూ
రెలకుం బర్వునఁ బోవువానిఁగని గౌరీకాంతసారెం గిలా
కిలనవ్వ న్మద మొందు దంతిముఖునిం గీతిఁ—ంచిరతిఁ—ంచెదన్. 7

సీ. అలకురుత్రజనాథు నడఁగఁద్రొక్కు నటంచు నలకురుత్రజనాథు నడఁగఁద్రొక్కె
సైంధవాక్రమణ నైశ్చల్యమొందు నటంచు సైంధవాక్రమణ నైశ్చల్య మొందె
మించి యక్షుబలంబడంచి పేర్చు నటంచు మించియక్షుబలం బడంచి పేర్చె
ద్రోణగురుత్వంబు తొడరితాల్చునటంచు ద్రోణగురుత్వంబు తొడరితాల్చె
భావిసోదరభీమసంభావ్యకార్య, మెల్ల నీరీతినెతీఁగించె నెవ్వఁ డట్టి
రామపాదారవిందమరందబృంద, చంచరీకాత్ము హనుమంతు సన్నుతింతు. 8

సీ. ప్రతివాదిమన్మనిర్మథనకర్మఠ మైన బాణసౌశీల్యంబుఁ బ్రస్తుతించి
ఘనశబ్దసాంగత్యజనితాత్యధికమోదగరిమఁ గన్న మయూరసరణి నెన్ని
మాలతీమాధవమహిమఁ బూజితమైన భవభూతి మార్గంబుఁ బరిగణించి
సారసవార్థపోషణధురీణంబైన భారవి యుదితవిభ్రమముఁ బొగడి
వెండియును గాళిదాసాది విబుధవరులఁ, దలఁచి యుష్మత్కవిత్వ సంపద్భ గౌర
వార్థ్యహుంభులు దాతుమస్తాథ యటంచు, వాదకృపఁగాంతుఁ గవితాదివైభవంబు.

క. నన్నయభట్టన్నను నె, ఱ్ఱన్నను దిక్కన్నసోమయాజిని శ్రీనా
థున్నాచనసోమునిమది, నెన్నుదు నాంధ్రప్రబంధ హేలానిధులన్. 10

శా. విగ్రిసగ్రిన్నవగంధ మంధకపురోవీథీవధూక్రీడ పం
గుగ్రామణ్యతిమారసంస్థితసురక్షోణీధరేంద్రంబు వృ
ద్ధాగ్రశ్యామ గదా మదాచరితకావ్యం బొర దుర్దైవదుష్
వ్యగ్రాసత్కవికోటి యెన్న నది యూహాల్సోయఁగా నేర్చునే. 11

మ. ఒకచో శబ్దగుంభనంబు లొకచో యుక్తికిత్రియా గౌరవం
బొకచో నవ్యతెజాతివాతిఁ లొకచో నుజ్జృంభి తత్ప్రస
ప్రకటంబుం గనిపించిన న్మదికిసంభావింప నన్యాంబుగా
కికటూ యేమియుఁ గేని కన్న నది యూహాల్సంబు గావింపునే. 12

వ. అని యిష్టదేవతా నమస్కారంబును సుకవిపురస్కారంబును గుకవితిరస్కారంబునుం గావించి బహువిధకథావిచిత్రంబగు కువలయాశ్వచరిత్రంబను కావ్యంబు సరసజనసేవ్యంబుగా రచియింప నూహించి యేతత్కృతినాయకత్వంబునకుం దగువాఁ డెవ్వఁడో యని విచారించి. 13

క. అలనారాయణధరణీ, తలనాయకమణికి నిచ్చెదఁ బ్రబంధంబున్
గలదే మేదిని భేదము, తలఁపంగా నీతఁడనఁగ దైవమనంగన్. 14

వ. అని నిశ్చయించియున్న సమయంబున. 15

సీ. ఏనవ్యగుణహారి దానవారియవక్రచక్రసౌఖ్యకరప్రసక్తిఁ గాంచు
నేవైరిహరహేతి భావరీతి యమూల్యకళ్యాణధరధర్మగరిమఁ గాంచు
నేజగన్నుతిశాలి యాజికేళిఁ బ్రచండపరదండమహాతి యక్ప్రౌఢిఁ గాంచు
నేరమ్యతరకీర్తి మారమూర్తి యవేలకమలాంబికామోహఘటనఁ గాంచు
నతఁడు వయిఖుందుఖానసప్తాంగహరణ, కరణకారణరణరణఘుంటికాని
కాయవేదండముఖసైన్యకలితవిజయ, శాలి నారాయణక్షమాపాలమౌళి. 16

వ. వెండియుఁ దాండవఖేలనోద్దండ ఖండపరశుజటామండలాగ్రహిండమాన పుండరీకగంగాడిండీరపాండరాఖండరుచికాండకీర్తినిష్యందచంద్రికాచక్రీకృతదుర్వక్రవిక్రమపరిపంధిరాజన్యసైన్యుండును సర్వసర్వంసహాధూర్వహతానిరాకృతకమఠపరిబృఢకాకోదరలోకాధిప దిశాస్తంబేరమమూర్ధన్యుండును కరుణారవిందచరణామణీపరిణీత పరీరంభణోజ్జృంభణాలోకుండును ప్రచండమండలాగ్రవిదార్యమాణరిపుమండలాఖండలకరణీయభావిరంభాసంభోగాంతరాయభయావిలనలకూబరాసీతనవనిధిబోధవిధాయకనానావస్తువిస్తారనిస్తులస్తవనీయమణీరమణీయమందిరాలిందుండును రాజకార్యవిరోధిరిపు రాజశిరోధిఖండనోద్దండ తదీయదుర్గగ్రహణ విచక్షణనిజనియుక్తసేనాభిరాముండును సింఘుగోవిందధవళాంగభీముండును ప్రతిక్షణప్రకల్పితదానధారాధునీమానావనోదనసాంత్వవాదనప్రవీణతదీయవేణికాసమాహతపారావారవిగళితనిజాశ్రయపరాయణతద్గాంభీర్యధుర్యుండును హేమకరగండాంకవర్యుండును శ్రీరంగరాజకుమారవీరవేంకట(పతి)రాయ భుజాబలసహాయబహువిధోపాయధురీణుండును జంచలలోచనామనోవంచనాపంచబాణుండును గాశ్యపగోత్రపవిత్రుండును జిత్రచరిత్రుండును దిమ్మనరపాలగర్భరత్నాకరరాకాచంద్రుండునునగు నారాయణధరాదేవుం డొకానొకశుభవాసరంబున సుధాకరశిలావేదికాసరోవంబులకుఁ జెందొగలపొందుఁ గలయ నొందించు నమందకుడ్యభాగపద్మరాగప్రతిబింబంబులకుఁ

గాఁటుత్రేఁటి బోఁటులనేటు బాటించు వలభికాన్తిలజాలంబుల నివలకుం దోడుపడు సాంబ్రాణిధూపపుంజంబు లనుచీఁకటికై యుపయించు మంచురాయని రేకలపో కలంపగు మరకతాతిబోదియలం జెలంగి ముంగల నాడు కీలుబొమ్మలకోలాటంబు రొదలకును గినకివాపంగాయు కోయిలలయారజంబులకును నొండొరుల మొగంబు లు చూచికొను నూడిగంపుఁ జేడియల మందహాసరుచికందంబులకు విందులు గావిం చు ముక్తామయస్తంభంబులందగు తమయాకారంబులం గనుంగొని తోడినియోగుల ని రాజకార్యంబు లడుగునానాదిగంతరానేకవజీరామాత్యులం బిలుచు సౌవిదల్ల సాహసినాదంబులకుఁ బ్రోదిగావించు వందిజనంబుల కైవారంబుల నడుమ వినంబ డు నంగనాంగీకృతసంగీతంబులగు నానందబాష్పబిందుసందోహంబుఁ జిందించుచం దంబునఁ దొరఁగు వితానీకృత వివిధప్రసవవిసరరసప్రసారంబునం బొసంగు నా స్థానంబున మణిమయాసనంబున సుఖాసీనుండై నిండోలగం బుండుసమయంబున.

క. వినయమున నేనుగదియం, జని యేతత్కువలయాశ్వచరితంబు ముదం
బున మీకు నంకితముగా, నొనరించెద ననిన హర్షయుక్తుం డగుచున్. 18

వ. ప్రసాదమందస్మితకటాక్షంబుల నిరీక్షించినఁ దదీయాంగీకారం బెఱింగి ప్రబంధని బంధనోత్సాహబంధురుండనై తన్ముఖాలంకారంబుగాఁ గృతిపతివంశావతారం బ భివర్ణించెద. 19

సీ. నెలఁతల నెఱముద్దు నెమ్మోవినీటు దార్కొన్నవానికి జోడుకాఁడె యనుచు
జవరాండ్ర జిగిగుబ్బజగపోల్కిఁ జనుపిట్టకవల కెల్లను జెల్మికాఁ డటంచు
లేమగుంపుల లివలివలాడు లేఁగౌనువంటిచోటికి నెలవరి యటంచుఁ
గలికిమిన్నలకల్కికంటిఠీవి పెనయు మెచ్చులకొప్పివ్వారికి మేలిచుట్టమనుచు
నెంచి ఛాయాశుభాంగి యేయినుని మౌళి, నిండువేడుకఁ దలఁబ్రాలు నించి వలసె
నతఁడు కనకాద్రివలనాప్రియాణనిపుణ, సైంధవుం డెన్నఁదగు లోకబాంధవుండు.

క. ఆతనికులమున దశరథ, నేత దగు న్యరధిపరిధినిఖిలమహీంద్ర
జ్ఞాతత్పరుఁ డాతనికి, స్సీతాశాతోదరీమణీపతివొడమెన్. 21

శా. ఆరామాధిపమౌళికిం దశముఖాఖ్యుగ్రావదంభోళికిన్
బారావారపటీసమావృతకటీ భారోజ్జ్వలద్ధాత్రిణీ
ధౌరంధర్యసకృత్ప్రపార్శ్వసమదోస్స్తంభప్రతాపప్రభా
శ్రీరాజద్దిశుఁ డౌకుశుండు జనియించెం బ్రాభవోపేతుఁడై. 22

గీ. అకుశుని యన్వయమున బాహాసహాయ, శౌర్యగాంగేయు వైరిరాజన్యగేయు

బలులు పెక్కండ్రు నృపతులు వెలసిరంచు, వినుతివహియించె గోవిందజనవిభుండు

క. వెలయుం దత్సుతుఁడై యతి, బలధృతిగ్నై తిమ్మధరణిపతి వైరిసతీ
కలితాంజనబాష్పఝరీ, హలహలికాంజనధరీకృతాఖిలగిరియై. 24

సీ. విడు పైఁటచెఱఁగు నేవెఱతు గాయము మాసనిమ్మని ఛాయ యెంతేఁ వేఁడ
నశ్వినుల్మందులకై ద్రోణగిరికి నిచ్చలుఁ బోవుకతన వేసరుకొనంగ
నిరుపద్రవముగామి నిలువరాదని రమాపతి వేఱపాలెంపుఁ బట్టు వెదక
నాయయ్యకిదియపాటాయంచు నలసింహికాతనూభవుఁ డౌడుకఱచికొనఁగఁ
జెలఁగి తొగకొమ్మమెఱుఁగ మింత చేసికొనఁ గఁ, దిమ్మనృపశౌరి దినదినోద్భిన్నవైరి
వారబహువారభేదనవర్ధమాన, మైనరవిమేనిపెనుగండి మానదయ్యె. 25

క. ఆరసికవశాళి మద్దుఁగు, మారుఁడు శరజాతవృత్తి మనియె న్ఘనియెం
దారకగర్వనివారక, సారకనత్కీర్తిఁ లక్కజనపతిధరణిన్. 26

సీ. అర్కవంశమువారమని దుర్ణివారులై గుడిసెకై జిల్లెడు గొట్టఁబోరు
హరిభక్తిగలవారమనుచు సన్నద్ధులై వేఁటకై సింగంబు వేఁటఁబోరు
కడువిరక్తులమంచుఁ దడవిండ్లు గైకొని యేచి పుల్గులమీఁద నేయఁబోరు
భార్గవగోత్రసంభవులమంచుఁ దలంచి గట్టులపైఁదరల్ మెట్టఁబోరు
సంగరాంగణసంగతశౌర్యధైర్య, ధుర్యులక్కమహీపాలవర్యధాటి
కాపలాయితమత్తప్రతీపభూపు, లడవిలోఁ బాతకాఁపులై యలరునపుడు. 27

గీ. అమ్మహైశ్వర్యసంపన్నుఁ డంబకాగ్ర, చంచలీకృతదుర్మనోజాతుఁ డగుచుఁ
గలితమైన సదానందకారి గరిమఁ, దనరు తిరుమలదేవి నుద్వాహమయ్యె. 28

గీ. ఆ తిరుమలాంబయందు లక్కావనీశుఁ, డతులరవితేజుఁ దిప్పభూపతి బిడౌజు
లక్కనృపవర్యుఁ దిమ్మవిలాసధుర్యుఁ, గృష్ణనృపచంద్రు నారాయణేంద్రుఁ గనియె.

క. వారలలోపలఁ దిప్పధ, రారమణుఁడు వెలయు రాజరాజనగఁ గృపా
దారుండు లబ్ధకవచ, స్ఫారగుణాపార్థవైరిబాణక్షతియై. 30

సీ. పద్మము లైమ్మనిండఁ బర్వనుస్ఫురమంచుఁ దలయూఁపఁదొడఁగె వేదండపాళి
కమలముల్రెక్కవలఁ గదియ వెల్వెలవాఱి కాలూఁదలేఁ దయ్యె వ్యాళభర్త
యబ్జరేఖాప్తిపై నమర నిద్దురమాని నిలిచినచోనిల్చెఁ గులధరాళి
వనజాతములచాయ దనరికంపనమొంద రోమోద్గమముఁ జెందెఁ గోత్రవనాళి
తమ్ముఁ బెడవాసి వసుధాసుధాకరాస్య, కొత్తవలపంటి ననవంటి కొమరువంటి
నీటుకాఁడైన యలతిప్పనృపతిఁ జేర, వినహాగరిమంబు తమయందు వీలుకొనఁగ. 31

చ. అతఁ డనుజన్ముఁ డైన సుగుణాఢ్యుఁడు లక్కవిభుండు తోడుగా
నతులితహిందుఖానుని బలావళి ద్రుంప నిలింపు లింపున
న్వ్రతత లతాంతవర్ష మొదవించుట మించు వరించ నెంచి స
న్మ్రతి జయలక్ష్మి నించు నవమౌక్తికపుం దలఁబ్రాలు కైవడిన్. 32

సీ. నలుపుఁ గస్తురిగీఱు నామంబుఁ దుడిచి యేతెంచినఁగాని సంధించమనుచు
నిడుపము తైపుటాంట్లు సహించుకొని చెవులూనవైచినఁగాని చూడమనుచుఁ
గమనీయమణికిరీటము డించి పైతాణిపాగ చుట్టినఁగాని పలుకమనుచు
దంభోళివిడిచి క్రొంపళుకు సింగిణివిండ్లు చేకొన్నఁగాని హర్షింపమనుచు
జిష్ణుతోమాటలాడ హేజీబు ననుతు, రౌర తిప్పనృపాలబాహాసినిహతు
లైనయలహిందుఖానసేనాధిపతులు, నిండి సురపట్టనముచెంత దండు విడిసి. 33

గీ. తిప్పనరపాలకరవాల దీక్ష యనన, ముష్టిహతి రంభ నెడసి సమ్ముఖముం జేను
తనయుఁ గని రాజరాజు సంతసముఁ జెందుఁ, దురక గ్రుద్దును బనికివచ్చెర యటంచు.

క. బిసరుహనయనావిసర, ప్రసవకలంబకుఁ డతండు పరితోషితవి
ప్రసతీకదంబ నానన, హసితైందవబింబఁ గోనమాంబ వరించెన్. 35

క. ఆ తిప్పనృపతి కోనాం, బాతామరసాక్షియందు బాంధవరక్షా
ఖ్యాతుని దిమ్మధరాధిపు, నాతతగుణకలితు వేంకటాధిపుఁ గనియెన్. 36

ఉ. వారలలో శతారిన్రపవారకతోరక్షుతారధారణో
దారమహామహీతల విధాయకకుంభుమసత్కురంగనా
భీరసరేఖికాకృతి గభీరభుజంగమ భోగబాహువు
ర్వారుని దిమ్మభూవరునిఁ బ్రస్తుతిసేయవశంబె యేరికిన్. 37

సీ. పరకాంతసంగతిఁ బరఁగుకూర్మస్వామి యబ్రమే బహుళ జడాళి యగుట
రాజభామావ్యాప్తిఁ బ్రబలు భూధరపాళి యరుదె గతశ్రవణాగ్రమగుట
సద్విజవనితల సక్తిగాంచినపోత్రి వింతయే వెలివేయు విధులఁగనుట
కుండలీశ్వరసువృత్తులఁ బొందుకరిరాజపటలి భారమె యధఃపాతియగుట
యనుచు భూదేవి తిమ్మభూపాగ్రగణ్య, బాహువందుండి యొసపరిబాగుమీఱ
గరువమునఁ బల్కు నిఖిలలోకప్రతాన, కార్యపరిశంకితత్కీర్తికాంతతోడ. 38

సీ. చనవు తానని వచ్చినను లేవ కలమంజుఘోషమోచేకొద్దిఁ గొట్టువడియెఁ
గొనగోటఁ జెక్కిలిఁ జెనకి ఘృతాచికాదేవి దేశీయంపుఁ దిట్టువడియెఁ
బుక్కిటి విడెమీయఁ బోయి తిలోత్తమావనజలోచన ముచ్చవాట్లుపడియెఁ

బోలయల్కఁ జూటుకునఁ జూపులఁ జూచి యూర్వశీబిబ్బోకవతి చొకువేల్పుపడియెఁ
దిమ్మనరపాలు చికిలిదోదుమ్మిదారి, బలిమిఁ దెగటారి సురపురప్రాంగణమున
నరలెడు కటారిరాహుత్తవరులచేతఁ, గీడుచేయదె మడియలతోడిచెలిమి. 39

సీ. అమనాయకుమీఁది యాసయటుండఁగా బాదుషాపై యాసపల్లవించెఁ
బొసఁగినఘనవినంబులవా రటుండఁగా దురువరంబులవారి మురువుహెచ్చె
లలితంపుసప్రవీణలవా రటుండఁగా మజిరఖాయులవారిమాటహెచ్చె
హృద్యోత్సవంబు లనేకంబులుండఁగాఁ గానిపనులదండుగలు సెలఁగె
నజ్జహీతుపేరు లవియెన్నియైనఁనుండఁ, బ్రౌఢకర్తాకుశబ్దంబు రూఢికెక్కెఁ
దిమ్మనృపఖడ్గధారావిదీర్ణమత్త, ఖానపుంగవసాంగత్యగరిమ దివిని. 40

సీ. నికరంబుఁ పాపోసులకుమ్రొక్కుమనుచు దేవేంద్రనందను బట్టి యీడ్చిరనుచుఁ
జేస్తలుమాని దేశీయము ల్వింపించు మంచుఁ దుంబురు నడ్డగించి రనుచు
సారాయికొపెర గంజాపొడు ల్దెమ్మంచు నంగడుల్వాడిఁ గొల్లలాడిరనుచు
లాయంబులోఁ బసుల్గావింప రమ్మంచు హారిణితోఁ గడునెగ్గులాడి రనుచు
దిమ్మనృపహతయవను లొందించులూటి, నమరపురిఁ జేరవెఱచు దిశాధిపతుల
కెఱుఁగఁజేయంగ నచ్చటి కిచ్చటికిని, నారదుం డానుఁ గ్రోవిచందమునఁ దిరుగు.

గీ. అతఁడు తిర్మలదేవి మూర్త్యంబ రంగ, మాంబ లక్ష్మాంబ కొండమాహరిణనయన
గురవమాంబను నిజబంధుకోటులెంచ, వరలువేడుకతోడ నుద్వాహమయ్యె. 42

సీ. భర్తవినాయకప్రౌఢసంగతిఁ జెందఁ దాఁ గల్కివగలసంతసముఁ జెందుఁ
బతిద్విజరాజాగ్రపాద మౌపలఁ దాల్పఁ దామహీభృత్సానతతి భజించు
విభుఁడు సుధర్మాభివృద్ధిఁ బెంపువహింప, దాసురామోదసంధాన మొందు
వరుఁడు ప్రాభాకరవ్యాలోలరతిఁ గాంచఁ దాను జంద్రాలోక మూని చెలఁగు
ననుచు హరిజాయ హరురామ నమరనాథు, కొమ్మనంబుజభవుముద్దుగుమ్మఁ దెగడి
కాంతునకు నానుకూల్యసంఘటన యొసఁగు, ధీరసద్గుణనికురుంబతిర్మలాంబ. 43

సీ. వరుని సదా గదాకరుని జేయుటె కాని యిందిరాజలజాక్షి కేదికొదవ
చెలువుచే మరుమాట చెల్లించుటయె కాని హిమశైలతనుజాత కేమికొదవ
నాథునిజాడ్యమొందఁగఁ జేయుటే కాని యిలజహ్నునందన కేమికొదవ
కాంతునిగోత్రారిఁగాఁ జేయుటే కాని యింద్రుపట్టపురాణి కేమికొదవ
తరము గావింపరాదె యీతరలనయన, తోడ వాంచలననుచు బంధువులు పలుక
విభున కల్యాంతభాగ్యంబు వెలయఁ జేయు, కీర్తిగుణావళంబ యామూర్తమాంబ.

వ. అనుంధరవీర్యుండగు తిమ్మనృపకంఠీరవుండు తిరుమలాంబయందు గంభీరభేరీమహా
రావనిర్దలితకకుప్పుటలవిశాలుం డగు తిప్పనృపాలుని రణరంగసంగతజయరమాధు
ర్యుం డగురంగరాయనృపవర్యుని సుష్ణకరతేజుం డగుకృష్ణధరాబిడౌజుసిం గనియె
మాతిణామాంబయందుఁ గర్ణాటకాధీశ్వరదయాసాంద్రుం డగు నారాయణవసుంధ
రాదేవేంద్రునిం జెవరంగమాంబయందు నమంపవితరణశాలియగు రఘునాథనరనా
థమౌళిని లక్ష్మాంబయందు నౌదార్యనిస్తంద్రుండగు రామప్రభుచంద్రుని గొండమాం
బయందు ధర్మచర్యాదిలీపుండగు గోవిందభూపుని గురవమాంబయందు శౌర్యహార్య
క్షుండగు తిమ్మధరాధ్యక్షునిం గాంచె వారలలోఁ దిప్పనృపాలు శౌర్యం బెట్టిదనిన.

సీ. తనయిల్లు విడివసేయఁటంచుఁ జలపట్టు కొడుకు చేతులు పట్టుకొనఁగవలసె
తనరంభ వారికీయనటంచు వాదించు కౌబేరికుడుగర గప్పవలసె
నలుపకై యీగిమ్రాకులచెంతఁ దాసె చని యిప్పు డాను కొండవఁగవలసె
డెల్లయేసిక నన్నుఁ దెమ్మందురో వార లని మూలదెసదాఁచుకొనఁగవలసె
నౌర తిప్పనృపాలబాహాసిధార, నవనివిడనాడి ఱొమ్మగాయముల వచ్చు
కడిదిపగఱకు నుచితము ల్నడపుహరికిఁ, జాలునసిపించె నమరరాజత్యాగరిమ. 46

క. అలతిప్పధరాపాలున, కలఘుకృపాళునకు ననుజుఁడై కాహళికా
కలితధ్వనిహాలహలికా, చలపరి శ్రీరంగరాయజనపతి వెలయున్ 47

క. మానకథానిధి యా ధర, ణీనాయకమౌళి యరుల నిద్దురవుచ్చున్
మానక మృడకరడమరుస, మానకభటపటలపటుపటాహ్పటిపటిమన్. 48

సీ. తన్నకుఁ గూఁతు నొసంగి తనరిన పత్తుఁ డిష్టార్థభంగముఁ జెందియవలఁ దిరుగఁ
దనకునవంతపద్యార్యాఢి యొసఁగిన చతురాస్యుఁ డెపుడు విచార మందఁ
దనపైఁ బదం బమర్చిన పురుషోత్తముం డెందు నిరాకృతిఁ జెంది నిలువఁ
దనకు సత్కృతిపతిత్వం బిడిన బుధేంద్రుఁ డాశానువృత్తి నిత్యంబు మెలఁగ
వెలయు టిది యెల్ల యేదానవిధమటంచుఁ, జంద్రనీరదశిబికర్ణసరణిఁ గేరి
సుకవివర్యుల కఖిలార్థనికర మిచ్చుఁ, బ్రకటగుణుఁడైన శీరంగ రాయనృపతి. 49

క. ఆతనితమ్ముఁడుకృష్ణధ, రాతలనాయకుఁడు వెలయురంభావైరి
వ్రాతమకరాంకకేళీ, దూతీకృతహేతిలలితదోర్దర్గళుఁడై. 50

క. మూర్తిమాంబాతనూజసత్కీర్తినీయ, భవ్యరవితేజనిబిడవైభవబిడౌజు
నతులరేఖాతిచంద్రునారాయణేంద్రుఁ, బ్రకటగుణసాంద్రునన్నలింపఁగఁ దరంబె.

సీ. బహువర్షములుగన్న పాథోధిస్వామి నవ్యలావణ్యవర్ణనముఁ గనియె

సగరనృపత్రి నెసంగుజహ్నుమానితనూజ యమృతప్రవాహవిఖ్యాతిఁ గనియె
నరవదిగ్గజములాస్య మరయనికావేరి రంగస్థలాభినర్తనముఁ గనియె
గడు నుగ్రగతి యెఱుంగనినర్మదానది సోమోద్భవాదివిశ్రుతులు గనియె
నేకుమారుని పట్టాభిషేకసమయ, మందు నిజవారి యొసఁగుభాగ్యముఁ నట్టి
వీరవేంకటరాయభూవిభునికరుణ, నెలమిఁ బాలించె నిల నారణేశ్వరుండు. 52

సీ. అఖిలంబునకుఁ బ్రపంచాంగంబుఁ దెలిపి సత్రములపాలకపోత్రిరాజుఁ దెగడి
కలభారతస్ఫూర్తిఁ దెలియంగఁజేసి దానములు చేకొను నాగసమితిఁ దెగడి
పండ్లు గన్పట్టంగఁ బనసఁ జూపుచు ముష్టిఁ గైకొను కులధరాగ్రణులఁ దెగడి
కౌముదీరుచిఁ దెల్పి కడునాదిభిక్షుకాభరణాఖ్యుఁ గనుఫణిప్రభునిఁ దెగడి
వచ్చి చేరిన ధారుణీవనజముఖికి, నీరదులఁ జేరి వెలిజరీచీర లిచ్చి
నెనరుతో గంధ మొసఁగి మన్నించునాతఁ, డధిపమాత్రుఁడె నారాయణాధినేత. 53

గీ. అట్లు పెదరంగమాంబాన్నృగాయతాక్షి, తనయుఁ డైనట్టిరఘునాథధరణివిభుఁడు
తరణినిభుఁడు పరితాపసంతతులవలన, నంచు బుధలోకమెల్ల వర్ణించ మించు. 54

గీ. అల్ల శ్రీరంగరాయ ధరాధినేత, దేవతాభక్తినికురుంబఁ దిమ్మమాంబ
వరసరోవరకాదంబఁ దిరుమలాంబఁ, దనకు దేవేరులై మునం బెనయ వెలసె. 55

మ. అతఁ డాతిమ్మమయందు వేంకటనృపాన్యత్మున్ రిపుక్ష్మేశభో
ద్ధతు రంగాధిపుఁ దిర్మలాంబవలనన్ ధర్మాత్ము గోపాలు స
న్నుతకీర్తిం జిననారనాఖ్యుఁడగు నన్నుం గస్తురీందుప్రసమం
చితకీర్తి న్రఘునాథుఁ దిమ్మవిభుఁ గాంచె న్సజ్జనాధారులన్. 56

గీ. అతని యనుజన్ముఁ డైనకృష్ణావనీంద్రుఁ, డెలమి రుక్మాంబ వలన నహీనగుణుల
రంగనృపు సాంద్రతరదయారామచంద్రు, వేంకటపతీంద్రు వేంగళవిభుఁ గనియె.

మ. అలతిమ్మాధిపు నారనేంద్రుఁడు దయాధారుండు నన్నుం జయో
జ్జ్వలుఁ గృష్ణాధిపుపుత్రు వేంకటపతిక్ష్మాకాంతచంద్రున్ గుమా
రులుగాఁ గైకొని ప్రోచెఁ గాన నతఁడే రూపింపఁగాఁ దల్లిదం
డ్రులు దైవంబును నయ్యె నిద్దఱకు నెంచు న్నందియుం జేటికిన్. 58

సీ. చలపట్టెనా వైరిజనపాలకుల నెక్కు-ముక్కా-డనీయక యుక్కడంచుఁ
బూనెనా యరిధరాభుజుల నంతఃకలహంబు గల్పించి పాయఁగఁ జేయు
నెంచెనా పరిపంథిపృథ్వీపతుల దాడివెడలించి తనవెంటవెంటఁ ద్రిప్పుఁ
గలఁచెనా రిపురాజిఁ బనహజాలంబునఁ బడిగాపులై తపింబడఁ గఁజేయు

నితనితోఁడుత వైర మీడేటి దనుచు, సకలధరణీశు లెపుడు నిచ్చక మొనర్ప
వీరవేంకటరాయభూభుజనికరుణఁ, బరఁగు నారాయణక్ష్మాపాలవరుఁడు. 59

సీ. తనమాటకాంచికా తంజాపురీమధురాధినాథులకు నెయ్యంబు నెఱపఁ
దనచీటి గోలకొండనరేంద్రముఖధరాధవపద్మబంధు లౌదల ధరింపఁ
దనకీర్తి మట్లనంతనృపాలముఖ్య గోత్రామరేంద్రులు గొనియాడికొనఁగఁ
దనదానగుణము గోదావరీతీరభూనిర్జరేశ్వరులు వర్ణించుకొనఁగ
వెలయు వేదండగండనిర్గళదనర్గ, ళమదధారాధునీసాధకముదబంధు
కార్యకృద్డిండిమారావధుర్యసైన్యుఁ, డతఁడు ప్రభుమాత్రుఁడే నారనాధినేత. 60


షష్ఠ్యంతములు.

క. ఏవంవిధవసుధాసం, భావిత బహుధాకథాతిభానీరధికిన్
గ్లావధికశిశిరనిజవీ, క్షావధికార్పణ్యబుధమహా సేవధికిన్. 61

క. స్ఫుటధాటీభటకోటీ, చటులాటీకనహతారిజనపతికి శచీ
విటగోత్రోత్కటమిత్రో, ద్భటచిత్రోజ్జృంభితప్రభావద్యుతికిన్. 62

క. మణినాగనగరకాంతున, కణుమధ్యాజనమనోజయంతునకుఁ గుభృ
ద్గణగణితరామణీయక, మణిఘృణిఘణితాతిమంజిమనిశాంతునకున్. 63

క. విస్ఫురదబహువిధవైభవ, హసితేంద్రున కసితకేతనాలోకనమా
త్రోసముత్త్రస్తారిధరా, పసమూహావనచలత్కృపాసాంద్రునకున్. 64

క. వీరారివారవారణ, వారణసృణికింగవీంద్రవర్ణితవిద్యా
పారగతాదిమఫణికి, న్నారాయణధరణియువతినాయకమణికిన్. 65

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కువలయాశ్వచరిత్రంబునకుం
గథాక్రమం బెట్టిదనిన. 66

ఉ. శ్రీమహితంబు భారతవిశేషకథావిధము న్విహంగమ
గ్రామణు లేర్పడం బలుకఁగా విని భావనిరూఢహర్షుఁడై
జైమిని యాబుతుధ్వజుని చందము లందము లయ్యెఁ దెల్పర
య్యామతి యాతఁడే కువలయాశ్వుఁ డనంగఁ బ్రసిద్ధిగాంచుటల్. 67

క. అనినన్వాని జైమినిమునిఁ, గనుఁగొని విహగంబు లతనికత యిట్లనుచు
న్వినిపించె సుధారసగుం, భన గంభీరాతిజృంభమాణమృదూక్తిన్. 68

క. శ్రీకరమై నానావిధ, వాకరమై యుగ్రిచుంబితాంబరబహుర
థ్యాకేతనాతిసుందరమై, సాకేతపురీవరంబు సన్నుతికెక్కున్. 69

సీ. ప్రాకారశశికాంతపఙ్క్తికాంతులు చుట్టు నూలిపోగులచాలు లీలఁ గాంచ
విడికెంపుగుంపుఁ జెక్కడపుఁ జొక్కపుఁ గోటకొమ్మలు జోతులయెమ్మెఁ దాల్ప
నవరత్నమయనూత్న వివిధవీథీరాజి యమరికఁ బ్రోలుసోయగము చెంపఁ
బైఁడికుండల నేరుపడినముత్తెపుమేడ లై రేనికడవలయంద మొంప
జయరమాసతి తత్పురీశ్వరవివాహ, గరిమ నాలవనాఁడునాకబలి చల్లఁ
దమఃసుహిమ మింటినంటు ఖస్తంబులనఁగ, సొగసుఁగనఁ జాలుఁ గడురేలుచుక్కచాలు.

చ. పళ్ళములచాలు మిద్దియలతండము మేలు విచిత్రపత్రము
ల్చెలఁగెడి తీఱు నీరములు చెందినసౌరును గాక రాజురా
కల విలసిల్లునంచుఁ బురకంజముఁ జేరె రమావధూటి త
జ్జలజగృహంబులం దలిమిషంబున లక్కను ముద్రివెట్టుచున్. 71

ఉ. కోటకు నస్థిభార మొనఁగూర్చు తఱింబలియిచ్చు నేమపుం
జీటులు కొమ్మ దీర్చునెడ శిల్పకు లంతికవర్తి సత్యలో
కాటనతత్పితామహుని హస్తముఁ జేర్పదు రాతఁ డాత్మ నై
శాటవిరోధిఁ గన్నఁ గొదవంచుఁ గటారి యొఱం దగుల్పఁగన్. 72

చ. కలిగిననేమి జాణలు జగంబున నంబుధినాథువంటిజా
ణలు గలరే యచెట్టులనినం దనలోని మణులెల్లఁ బౌరరా
జులు జవరాండ్రకుం జికిలిసొమ్ములు సేయ నగడ్తపేర వా
రలజలఖేలనత్రుటితరత్నములం గిలుబాడు నిచ్చలున్. 73

ఉ. అంబుధి మేదినీవసనమై కనుపట్టుటఁ గట్టిపెట్టి ని
క్కంబుగఁ గోటచుట్టుఁ బరిఘాకృతి నుండుట యేమి యంచు నెం
చం బనిలేదు మందరరసాధ్రిసమాంబు విహారితత్పురీ
శంబరలోచనాజనకుచక్షతి సారదిపృత్తునై సుమీ. 74

చ. అగణితకేళిఁ బ్రోలిజవరాలిగము ల్వనపాళి నాడఁగా
నగడితఁ దేలి యోలినురగాళికచాళి తదీయవేణి సో
యగములు చాళి మ్రుచ్చిలి వయాళిగ నెమ్మిగయాళి జాడమై
డిగు ననుజాలిఁ గ్రమ్మఱి వడిం జను గూఢపదత్వసంపదన్. 75

చ. పురిఁ బరిఘోరగీనికరము ల్జలనూత్రిము వెంట సౌధమం
దిరములఁ జొచ్చి యందుఁ దరుణీతనుగంధము కాలిసంకలై
నెరయఁగ నిల్చి కేకిరమణీవిహృతు ల్మెడవట్టి ద్రొబ్బఁగా

నరిగి తపసియఘోతిఁ గొనియాడు నిజాప్తులు మూఁగి యుఁగొనన్. 76

మ. తళుకు న్మేడలమీఁది చేడియల చేఁతత్తేటమిన్నేటిలోఁ
గలయం గానఁబడం దదంబువిహరద్గంధర్వు లీక్షింపఁ ద
ద్గలన గ్గగ్గొని యద్దపున్మడుపు లేలాచూడఁగా నంచు వా
రలచూపుల్మరలింతు రల్లన మిటారంపున్నునుంబల్కులన్. 77

సీ. కార్యత్వరాగతాగతసౌరకులవారకాంతలు చేదివ్వె సంతరింపఁ
బూర్వాభిసారసంభోగానురాగతారావధూమణి చంద్రురాకఁ గోరఁ
గేలిలాలసమరుద్బాలికాపాలిక ల్కడఁగి చీఁకటిమొట్టి కాయలాడ
మనునదాజ్ఞాలంఘనఘనజాంఘికభటోత్కరములు కాణాచిగా రమింపఁ
దనరువనరుహనాభనూతనరుచిప్ర, చండపురనీలజాలక సౌధయూధ
కాంతిసంతానమంతరధ్వాంతరోహ, వీథిసురపట్టనాధ్వాంతరోధి యగుచు. 78

శా. ఈశానీలపుమేడల న్శుభవిధాయిస్వర్ణపాంచాలికా
కేళుల్మేలగు పాండురాజభవభక్తిన్మించియు న్సారభా
వాలోద్వేలశిలీముఖప్రభల భాస్వన్నందనాలింగనే
చ్ఛాలబ్ధిం దగి యక్షయాంశుకతతి స్సంధించుచుం దత్పురిన్. 79

గీ. రవికరక్షతుసంగములు నిబ్బరముగ వచ్చి, హర్మ్యముల నిల్చి వేసవి నచటిముద్దు
గుమ్మ లచ్చపుఁ జిమ్మనగ్రోవినీట, నురుఁగుఁ గడుగఁ బఖిశ్రాంతి దొఱఁగి యరుగు

సీ. సకలాగమస్ఫూర్తిఁ జరియించుభూసురు ల్వనసలు కొన్ని యేర్పఱచు టరుదె
యనుపమధైర్యశౌర్యాద్యుపాధి గలనృపుల్ ఘనచక్రవైభవం బెనయు టరుదె
రాజరాజపౌత్రిక్షిరహింగల్గు కోమటు ల్వరవైభవంబున వరలు టరుదె
కువలయప్రఖ్యాతిఁ గొమరొందు శూద్రులు ద్విజరాజభక్తి భావించు టరుదె
యనఁగ సుమనఃపరివృత్తిచే నతిశయిల్లి, యచ్యుతస్థితిఁ జెంది కర్ణాతిసహ్య
సరణి గణనకు నెక్కుచు సరసులందు, వెలసి సన్నుతిగాంతు రప్పీటియందు. 81

సీ. పట్టపుటేనుంగు పజ్జలబికుపక్షకాకారావమాలించి యట్టె తూఱు
దాని నవ్వాలఁ దీయఁ దళకుగోడల మచ్చుఁ దమనీడఁ జూచి యుద్ధతిని గ్రుమ్ము
నాచెంత గరిడీలనమరు సాదనప్రోఁతె విని యచ్చటికి గిరుక్కున మరలు
దనిచూచి యదలించు నాదికట్టికవారిఁ బైనెత్తు బంధముల్తోనె తునియ
చెక్కులన గంటలమరు సారించి చాఁచుఁ, గరము పిలిచినవారలఁ గదియనిగుడ
దరలు ననిమావటీంద్రు కొంచలపడంగఁ, గదలు వీధులఁ దత్పురిగంధకరులు. 82

చ. అనిలునిఁ జేసె లేడి భువనాంచితపావనమూర్తిఁ జైనత్తే
యుని విధమంటిమేనిఁ బురుషోత్తముసెందునసామధేయుఁగా
నొనరిచె నంచు నచ్చటిహయోత్కరమూల్బహుమంజులప్రవ
ర్తనము జగత్ప్రసిద్ధగుణధారలుఁ జూపు నిజేశ్వరాళికిన్. 83

చ. ఉరగకులోద్వహుండు పగయొప్ప చటంబున దార్క్ష్యసంగతిం
బరఁగఁ దలంచి వజ్రసుషమాతిరమాపరమానుషక్తిచే
నరదములయ్యెఁగావలయు నష్పురరాజమునందుఁ గాకచో
హరిపదమందు మేల్పడగలంచునె చక్రివిధంబుఁ జెందునే. 84

చ చలువలు గట్టి చన్నులపూసారుగ గంధ మలంది కప్పురం
బలరెడి ముత్తెపుం బరణు లంది తనర్తుల్ గట్టి వాల్చెలుంయు
తెలియఁగ నాత్మకాంతిధవళీకృతపద్మభవాండమ్ముంగరా
మలకముఁ జేసి నిల్చు పురమానవకీర్తిలతాంగులోయనన్. 85

సీ. నవవింటివాని సానాకత్తిపరుఁజు టెక్కుల చొక్కటపు సాముకొండెలలర
మురువుదీర్చిన చన్ను మొలకయద్దములకు గవిసెనల్వలెఁ జనుకట్టులమరఁ
దీవలపైఁ బూవుఁదేనెసోనలలీల మేనుల సంపెంగనూనె తనర
బటువు గద్దియలపైఁ బట్టుగద్దిగ రీతి జఘనదేశముల హిజారులమరఁ
గడగి మీఁదటికన్నెఁకంబుఁ జెఱప, నొకనికొకఁడు వితాళొలారకములనుపఁ
జలుపుఁ గాంతురు వింతసాదనలఁదీఱి, గుడివెడలి వచ్చుబోగంపుఁ బడుచు లచట.

క. కాదంబరి స్వాదించియు, మోదంబునఁ గౌముదీసముస్నేహముసం
పాదించియుఁ దబ్బిబ్బగ, వాదింతురు రేలు వారవనితలు వీటన్. 87

చ. తొలఁకెడుతావిగంధవహొడి తూరుపువాటఁగఁబట్టి మల్లెపూ
వలపులు కొల్లలాడి హిమవారిఁ గలంచి మెఱుంగుఁబోండ్లగు
బ్బలపయిచంద్రకావిజిగిపయ్యెదకొంగు లెడల్చి యెందు మై
జలియక తూలుకొంచు వలిదెమ్మెరలాహిరికాఁడు త్రిమ్మరున్. 88

క. ఆనగరంబు ఋతుధ్వజ, భూనగవరవైరి యేలు భూమహిమధరా
ధీనధరాహీనధురా, హీనకరాంరచితకీర్తి మృదుకంచుకుఁడై. 89

క. చకచకితనఖరముఖర, ప్రకరముఖచ్ఛాయఁ దొంటిభంగి గనుటనో
వికటమహిపాళితత్వవ, నికటంబున వ్రాలి లేవనేరకయుండుక్. 90

సీ. అనిలబాణము శత్రుజనులకు సెలవిచ్చు జోగులై భోగులై సుక్కఁజేయ

వారిజాస్త్రము లైరిపీసలఁ జాలించుఁ గర్మందులై గాలిఁ గమిచిమిర్రింగ
నంధకారాంబకం బరుల కప్పన యిచ్చు నిహతులై కమలినీసేతఁ బొదువ
నహికరం బహితరాజాళి కానతియిచ్చు శబరులై కీకసనమితిఁ బొదువ
నౌర యీరాజవరుఁ జేరి యసమజన్మ, మందు నివియెల్ల స్వామికార్యస్వకార్య
ములను వంచనలేక వర్తిలఁ దొడంగె, గాఢమతిశాలిమంత్రిపుంగవు లనంగ. 91

శా. ఆలీలాజలజాస్యుఁ డశ్వతరుఁడన్ వ్యాఘ్రేంద్రుపుత్రు ల్నయ
శ్రీలాసిస్వచరిత్రు లిద్దఱు నిజస్నేహాతిరేఖాజహ
త్కేళీలోలతఁ దన్నుఁ గొల్వ మది నుద్దీపించు ప్రేమంబునం
గాలక్షేప మొనర్చె దుష్టజనశిక్షాశిష్టరక్షావ్రతిన్. 92

సీ. ఒకవేళ దండనాయకులు పౌజులుదీర్చి పాడఁగానఁగా స్వారిపోయి మరలు
నొకవేళ వెనువెంట నూడిగాల్గొనుచు ఘోట్టాణంబునెక్కి జోడనలు చూపు
నొకవేళ మంత్రిగాయకముఖ్యు ల్గొలువఁగా సుముఖుఁడై నిండోలగమున నుండు
నొకవేళ మాఱువాలకముతో నసిసహాయంబుగాఁ బురశోధనం బొనర్చు
నొక్కవేళను భరతశాస్త్రోక్తరీతి, జాణలునటించు నాటకశాలఁ జూచు
నిట్లు వారాశివేలాపరీతభూమి, పాలనశ్రీల నారాజు బరఁగునంత. 93

మ. బిలనిశ్చేష్టజరద్భుజంగము తదాభీలాతిఫూత్కారగా
రళఘోరానలభావదాయకదవవ్రాతంబుఁ దచ్చాంతివీ
త్క్యులలచ్చైచ్ఛవలినీభవిష్ణుమృగతృష్ణాలీలమై యుర్వరం
గలయం బర్వె నిదాఘకాలము సమగ్రక్లాంతదిగ్జాలమై. 94

సీ. జలవిహంగములు శుష్యజ్జలాశయముల కితరపక్షులఁ జేరనీక తఱిమె
వనకరుద్దవవహ్ని యనుజుంజములు సోఁకఁ గరము లెత్తుచుఁ గొంచపరువువాఱెఁ
జిలువచాల్కలుగులోపల స్రుక్కి యన్యోన్య ఫూత్కారపవనాప్తిఁ బొట్ట నించెఁ
బులులాఁకట నలఁగి బొరియలడాఁచిన పలలంబులకుఁ బోను బాలుమాలెఁ
దమకుఁ బాన్పైనతరణికాంతములు పొదల, యాకుసందులఁ బొడరొండలంటిప్రక్క
చుఱుచుఱుకుమన్న మెకములు గెరలిబెదరి, గొరిజదాఁటుగఁ బరుగెత్తి తిరిగిచూచె. 95

సీ. యతిజను ల్చక్రవాళాద్రియవ్వలిమునీంద్రులతోడ మాలిమి గలదటంచు
ఫణివరు ల్పాతాళపతియైన యారగేశ్వరుఁడుమాకేలినవాఁడటంచు
నదులు పంకజభవాండము చుట్టికొన్నట్టి యుదధిరాజున్నాఁడు గద యటంచు
నంచలు సత్యలోకాధీశుఁడగువాని సొగసుతత్తడి మాకుఁజుట్ట మనుచు

నక్కడక్కడి కరుగ నుపాయ మెంచఁ, గాసెబీ డెంద మార్తాండకరగృహీత
సలిలసింధువినిర్గతజంతుకబల, నాగ్రహవ్యగ్రబాడబాత్యుగ్రమగుచు. 96

చ. మిటమిటయెండ వేఁడిబలిమిం డెలిపమ్ముల తేకుసందులం
జిటుకుమటంగ నోడి నివసించి తదగ్రమరంద మప్పట
ప్పటికిని మూతిమూటైపైఁ బైఁ బడి చల్లఁబడంగఁ బ్రొద్దుక్రుం
కుటఁగని యంతటన్వేడలుఁ గోడెమిటారపుఁ తేఁటు లత్తఱిన్. 97

సీ. కావళ్ళు గలిగెఁ జొక్కపుఁ గప్పురపుఁ బల్కు లవరించు సేడాకుటనఁటులకును
సుంకంబులుడిగె మెచ్చులురా గుబాళించు చేవయెక్కు పలాకచెక్కలకును
హెచ్చుకట్టడి గల్గె నింపుగారనమాడ వళిమద్దుచాయలవారలకును
మన్ననల్గలిగె మేల్పన్నీరు చెంబు లేర్పఱచి తెచ్చినయపరాధులకును
హుజూరుకొలువులు గలిగె సొంపాలుకు తేట, నీటికొలఁకులలో దెండు నిండువగల
దెప్పపై బొండుమల్లెల చప్పరములు, నెరయఁజేసినవారికి దొరలచేత. 98

మ. కొలఁకుందామరతావితెమ్మెరలసోఁకుల్దెచ్చు ముత్యాలత
ల్పులబలొన్సరణగండ్లచాయఁ గపురంపుంగుంపు సొంపూను మే
ల్మలకాగంపవుతేటతోడి జిలుగుంబన్నీటిధూమ్రంపుఁది
త్తులచేఁ బొద్దులుపుత్తు రత్తఱినిఁ గాంతుల్కాంతలు స్మేరలన్. 99

చ. అలసిన మమ్ము మింటికెగయం ఘటియించి భరంబువాపు వా
త్యలఁ గనుఁగొన్నఁ గాని తనకబ్బదు హర్షమటంచు శేషుఁడ
ర్మిలిఁ దలలెత్తిచూచు బిలరేఖలనన్మడుగుల్చెలంగె ని
ర్జలలసితాబ్జకోరకపరంపర తత్క్షణమండలంబుగన్. 190

క. పరుసైన యెండమెండుస, నరవరులై హాయిలేక యలజడి పడఁగా
సురగాలి యేఁచెఁ బ్రజలం, గఱవుకుఁ దోడావపంట గలిగిన కరణిన్. 101

క. అవరెడు నదీజలంబుల, నెదవాయఁగలేక యవిమహిం గ్రుంకినచో
నడుగంటి నిలిచి తెలిపిన, స్ఫుడులనఁగాఁ జెలమలింపుఁ జూపెం బ్రజకున్ 102

గీ. కూపములమీఁదఁ గలలోభగుణముకతనఁ, దూఁచికైకొనుకైవడిఁ దోఁచెనపుడు
హాలికజనములుపరికల్పితాంబయంత్ర, ములజలంబుల గ్రహియించు చెలువు మెఱయ

క. జడజవనబంధువేఁడిమి, నుడికెడు పుడమికి నొకింత యూరటసేయ
న్నడుమనెలకొన్న వెన్నెల, నడుమున శాల్మలుల తూలవారము నెఱసెన్. 104

గీ. ఆట్టిగ్రీష్మర్తువందు నయ్యధిపవాళి, యతులతరభోగభాగ్యంబు లనుభవించె
ననిన జైమినిమునియావిహంగములన, నంతరకథావిధం బెట్టి దని యడిగిన. 105

## ఆశ్వాసాంతము.

మ. మృదువాణీసుమచాప చాపలపలాయిద్వేషిరాజన్యకా
స్వదితాశాంచలభాగ భాగవతసంపన్నైత్య పూజాలస
త్సదనాధిష్ఠితవిత్తవిత్తమ నుతస్వచ్ఛస్వకీర్తిచ్ఛవి
చ్ఛిదురేందుద్యుతికాండఖండపతి నాసీరైకభేరీరవా. 106

క. గాంధర్వరసిక యౌవన, గంధర్వవిపత్సఖర్వగర్వవిదళనా
సంధానధురంధర బల, సంధానవపరశురామ సంగరభీమా. 107

మత్తకోకిల. నందనందనపాదనత్యభినందిమానససింధుగో
విందసన్మణినాగపట్టన విశ్రుతప్రభుతోజ్జ్వలా
చందనైందవసుందరీహారిచందనద్రునవప్రతి
చ్ఛందనూతనకీర్తికందలచంద్రికాంకదిగంకణా.

## గద్య.

ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమ న్వయాభరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజితచైత్ర కాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధా యక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రం బనుమహాప్ర బంధంబునం బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీరమణీనందన రే, ఖారాజద్రూప వైరికైరవపల్లీ
సూరప్రతాప సవరము, నారాయణభూప కీర్తి నవ్యకలాపా!

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
నంత నాసర్వసర్వంసహాధినాథ, జంభసంభేది యత్యంతసంభ్రమమున.

గీ. ఒక్కనాఁ డంతిపురమున నుదుట బిగువు, గబ్బిగుబ్బెతగము లూడిగములు సలుప
రాజవర్య పరాకజారమున దొరలు, గాచినా రని హెగ్గడికత్తె తెలుప. 3

సీ. పచ్చకప్పురము సాఁబాలు గూర్చి కురంగమదమున గీఱునామంబు దిద్ది
యలరుఁబొత్తులరూపు వెలిసూపు వలిపెంపు జాళువాసరిగరుమాలు చుట్టి
మొలకవెన్నెలలఠావులు దీరు కట్టాణితెలిపాలకాయయొంటులు ధరించి
క్రొత్తముత్యపుమేలుకట్టుఁ జీనాపట్టుఁ దళుకుబంగరుపూలపట్టెఁ బూని
పికిలిపూబంతి దంతపుఁ బిడి కటారి, పోఁతయొఱ నంకమొలపంకి పొంకపఱచి
తమ్మిదోయిమ్మిజోడుసావనలహారువు, బ్రాఁతపనిదుప్పటీవలివాటు వైచి. 4

చ. ఉడిగపుటింతి కట్టెదుట నుంచినపానలు రాజసంబునం
దొడిగి మెఱుంగుటుంగరపుఁ దోరపుహీరపుమించుమంచుపైఁ
బడఁ దులకించు కల్వవిరిబంతులమించు మదాళిమాలిక
ల్బడి నిరువంకనైచు తెలిపానపచోపుల వీఁగిపోవఁగన్. 5

చ. చెలువలు వీచు పూసురటిఁ జిందిన తెమ్మెరల న్రమాలుచుం
గులు గదలంగ వాఁడికొనగోరులసోఁకుల గబ్బిగుబ్బచా
యల గరుదాల్చు నిద్దపు లతాంగులు మూఁపులఁ జేతులూఁదిరాఁ
జిలుకపటాని తేరివారచెన్నున నంతిపురంబు వెల్వడెన్. 6

క. సకియలు సాహో యనఁగా, సకలంకశశాంకమణిగణాంతః ప్రతిబిం
బకలాకలనాద్విగుణిత, సకలానుగవారమా హజారముఁ జేరెన్. 7

గీ. చేరి జగజోతిమగరాతి చెక్కడంపుఁ, గలికినీలంపుమెట్ల సింగంపుగద్దె
నుమితకాల్పట్టుజిగి యద్దయొఱగుతోడి, సొగసు నిద్దంపుఁ బట్టుగద్దిగ వసించె. 8

సీ. చెవిదండఁ జేరి నిల్చినన్యాయసమువారి ముసలకమ్మల కొప్పములు లిఖించి

దిక్కులనుండి యేతెంచు మన్నీలమంత్రులతోడ నుచితంపుఁబలుకు పలికి
సమయోచితముగ హాస్యము లొనర్చు విదూషకులదిక్కు మొలకనవ్వొలుకఁ జూచి
యవసరంబులవారి లవధారనుచుఁ దెల్పఁ బోషకగని నారికింపులు వెలార్చి
సత్కవీంద్రులు రచియించి చదువుపద్య, సమితియందు దోసపాటలు చక్కదిద్ది
ప్రౌఢి గనిపింపఁజేయు భూపాలుకొలువు, ప్రజలకెవ్వేళఁ గన్నులపండువయ్యె. 9

చ. ఇటువలె నున్నవేళ ధరణీంద్రునిప్రోలికి వేలసీల సం
ఘటితఖలీనలీనసుఖచ్యుతఫేనవిరాజి తేజి యొ
క్కటి తుదివాగె పూని వెనకంగొనిరా మునిరాజువచ్చె న
చ్చటికిని గాలవుండు పరిపుత్ప్రకపక్త మహోచ్ఛ్రితంబుగన్. 10

మ. జలజాప్తోపమతేజ మంజలిపుటీసంధానము న్సంభ్రమా
కలితోత్థానము భక్తిపూర్వకనమస్కారంబు నామ్రేడితో
ద్గళితాంతస్తుతివారముం జలుపశిత్తపత్తుమై సభ్యన
ర్ఘ్యులకు న్నెయ్యము నింప సంయమివరేణ్యుం డొయ్యనం జేరెనన్. 11

క. ఎదురేగి శిరోగ్రమున, త్పదయుగళము సోఁక నృపతి ప్రణమిల్లి క్రియం
బొదవఁగ నర్ఘ్యాదికవిధి, నెద రంజిలఁ జేసి వినయ మెనయఁగ ననియెన్. 12

క. క్షేమమె కద భవదాశ్రమ, భూమి న్నీవారవారిపూతేక్ష్యానిషస్సం
ద్రామారంధపృగేంద్ర, స్తోమంబులకెల్ల నోవిశుద్ధచరిత్రా! 13

శా. స్వామీ మీసుముఖత్వమే కుశలవాచాకీర్తిఁ గన్పించు నే
నామీరాకకు నన్యకారణము గాన న్నన్నుధన్యాత్మునిం
గామోదంబునఁ జేయనిప్పటికి తక్క న్వేరొకానాత్మ మీ
క్షేమేమున్న నుపేక్ష సేయకయ పూని యానతీవే దయన్. 14

సీ. ఐశ్వర్యగతిమీఁద నరుచి పుట్టినఁగాని బలహంత మీఁదెంత నిలువవెఱచుఁ
జక్కఁదనంబుపైఁ జౌకదోఁచినఁగాని సురభామ మీసీమ చేరఁగ వెఱచుఁ
దనకైదువమాత్రంబు కరువేసినఁగాని హరిపట్టి మిము గిట్ట యరుగ వెఱచు
విబుధధామముమీఁద వెగటు గల్గినఁగాని వనజారి మిముఁ జేరి చెనక వెఱచుఁ
గానఁ దానకనియమవిఘ్నంబు నడుమ, నలికెనను గాని యోపని యట్టిలేని
ఘోరమామకతూణీరగుప్తశాత, శరమునకు నొక్క చేసలాట సవరింపు? 15

లయగ్రాహి. అంగజమదాపహశిరోంగణగటత్సరిద్భంగురతరంగఘనరంగపరిధారా
సంగతి మహీంద్ర మందిరము నెరకె మీఋనికె యంగొనుదేని మెరయంగలిగి యోవన్

రంగు మెయి సంపద మెఱుంగు మొగమందము చెలంగను నుసంపము పాసంగనిదిగో విూ
చెంగటనె నిల్చెను సురంగము వచ్చిన తెఱంగు నెఱుఁగంగఁ బలుకంగదవె పూని. 16

ఉ. నాపుడు మోమున న్మొలకనవ్వొలుకం దమవారిఁ జూచి యా
హావిజయంబు గంటిరిగదా యనుచుం బలయూఁచి యాగదీ
క్షావిధు నిల్చి మిన్నుమిత కక్షణకర్కశమైన కేల నా
భూవిభు మేను తట్టి మునిపుంగవుఁ డిట్లనియెం బ్రియంబునన్. 17

ఉ. అంపితిమోడ వౌదువె కదయ్య తలంపఁగ శత్రుజిన్మహీ
కాంతునిపట్టివే యఁట యఖండమదారివిదారణక్రియా
కాంతపరాక్రమంబు లడుగన్వలెనే మఱి యీదిగంతవి
శ్రాంతసుకీర్తివిధేయగుణసంగతినీకె తగుం గుమారకా. 18

చ. చలపరితాపకారిభుజశౌర్యము పెట్టనికోటయై మఖం
బలవడ సంగ యాగహవిరాహరణార్థనిమంత్రణక్రియన్
బిలిచినఁగాని రాఁడు బలభేదియు నేఁటిదినంబుదాఁక నో
కులవనధీర యీనడుమఁ గొన్నివిశేషము లెన్నశక్యమే. 19

క. పాతాళకేతుఁడనియెడి, ఘాతుకుఁ డొకరక్కసుండు గలఁ డంబుధర
వ్రాతాటవనీతాహవ, భీతానవధానసకలబృందారకుఁడై. 20

క. ఫలకుసుమబిసాదులు గం, పలకొలఁదులు దెచ్చికతన మాలిమికాఁడై
నిలుకడఁగ మాతపోవని, మెలఁగు మవాఁడుండియుండి మెల్లనఁ బిదపన్. 21

గీ. మామకానూనజపహోమమౌనసంవి, ధానముఖమైన నియమసంతాన మవెడి
పద్మవనసైరికరి మాటుపడస నేఁడు, రాహువై నాఁడు వాఁడు ధరాతలేంద్ర! 22

సీ. ఒకఁడైనఁ గని యెఱుంగకయుండ విదళించు సారనీవారకేదారసమితి
వెనుకవేళలు గాచి కని కానమిగ దాఁచునటవిఁ దాపసుల మృగాజినమ్ము
లాపిమ్మటను గొంద అదియేమి యనఁద్రొంచుఁ బర్ణశాలాసమీపద్రుమాళిఁ
బిదప నంపఱుఁ జూడఁ గదిసి కైకొనసాగు యాగకల్పితహవిర్భాగతతులు
రచ్చసేయఁగఁ దొరకొనురాత్రులందు, మునికుమారుల బెదరించి కొనఁగ దొడఁగుఁ
గామినీమార! వాఁడు నిక్కముగఁ జేసె, నిందరమ్మన్నచోట నిల్లెల్లఁ గొనుట. 23

సీ. పొడగన్న సాష్టాంగముగ వ్రాలి చనువాఁడె యెదురుగా రారంచుఁ బదరసాగెఁ
బిలిచిపెట్టిన వన్యభిక్షకైకొనువాఁడె కోరి పెట్టరటంచుఁ గొణఁగసాగె
నిలుచుండి చంకచేతులు కట్టుకొనువాఁడె కొలువరా రేమంచుఁ గెలయసాగె

వినయంబుతోఁ జేరి పనియేమి యనువాఁడె యరయ కడ్డాదిడ్డు లనఁప సాగెఁ
వనవచోదోషము క్షమింపుమనెడువాఁడె, యేమనిన లేని వాతప్పు లెంచసాగె
వినుము మహికాంత కొంతంతపనికినైనఁ, బలుకులేటికిఁ గిల్లాకుపనుపసాగె. 24

చ. ఇటు లతఁ డున్నయంత ధరణీంద్ర యొక కానొకనాఁడు నాకురం
గట నవయాడు నొక్కమృగకాంతకుఁ బ్రొద్దులవేళ చాలఁజే
రుటకతనం దపోధనసరోరుహలోచనలందఱు న్సము
త్కటగతి ముచ్చటల్నిగుడఁగాఁ గడగానని సంభ్రమంబునన్. 25

సీ. ఎన్నినేఁడది తానిన్నటిమొటికగా యాకొమ్మఁ గడకుఁ బొమ్మనఁగదమ్మ
పడుచుమూఁడల చేతఁ బనియౌ నెవీరేల యననూయఁ దోతేఁ బనుపరమ్మ
యీప్రొద్దునక్షత్రమేమిలగ్నము మంచిదేయంచుఁ దగువారిఁ దెలియరమ్మ
శుద్ధవేళ సుఖప్రసూతిగావలెనంచు నిలువేల్పులకుమీఁదులెత్తరమ్మ

గీ. అనుచు గుమిగూడి మృగి నొక్క యలరుఁదోటఁ
బూవుఁబొదరింటఁ దార్చియింపులు జనింప
నున్నతఱి మాయనైకొని యట్టెపడిన
సరణిఁ జెట్టునఁ దెగిపడ్డ కరణివాఁడు. 26

సీ. తళుకుటద్దపురంగు గల చెక్కుల బెడంగు మేలికమ్మల డాలు పాలుచేసి
తొగరుఁగెంపులపెంపు నగు మోవి నెఱసొంపు పసని ముక్కఱనిగ్గు పాలుచేసి
సింగంపుగతిఁ బూను చిన్నారి కేఁగౌను బంగారుమొలనూలు పాలుచేసి
వలిజక్కవలఁ గేరు వలువగుబ్బల తీరు పసిఁడి పైఁటచెఱంగు పాలుచేసి
తనరెఁ గనుఁగొంటిరమ్మ యివ్వనితయనఁగ, దగినకాంతావిలాసంబుఁ దాల్చినచ్చె
గిలుకుమట్టెలురవలుపావలుసుజిటులు, విడెముమడమలఁబడుకీలుజడయు మెఱయ.

చ. చెలువగు ముద్దుటుంగరపుఁ జే నెఱికుచ్చులఁ బట్టి యుబ్బగు
బ్బల జిగి జాలువాఱవికె పక్కన ప్రీలఁగఁ బైఁటవాటుగా
నలవడఁ గొంకుఁజూపులు నిజాంఘ్రినఖాళికిఁ గల్వవండఁగాఁ
జెలువల చెంతకుంజనియె సిగ్గులపెండ్లికొమార్తయుం బలెన్. 28

సీ. కూర్చున్నవారు లోఁగుచు లేచి చేఁజూపి యిందురమ్మని ప్రియం బెనయఁబలుక
నిలుచున్న వారు చెంతలఁ జేరి స్వస్తిభవత్వ యటంచు దీవనలొసంగ
వనల మాటాడువా రపరిపాటున మర్లి యొఱపు వీక్షించి నివ్వెఱపడంగ
నపుడు వచ్చిన వార లా చెలి యెవతె యీకొమ్మ యంచును గుసగుసలు వోవ

ధీరలగు వారల యూహను జేరు నడుగ, నెంచి యేమంచ మని విచారించికొనఁగ
నిలిచె జిలిబిలి జడదారి చెలులఁ జేరి, మచ్చికప్పెఁడుదారి నమ్మాయదారి. 29

సీ. పనిలేనిపని గిఱుకున్న మోముద్రిప్పుచోఁ జెక్కుపైఁ గమ్మ తళుక్కు మనఁగ
సిగ్గునఁ దలవంచి చిఱునవ్వు నవ్వుచోఁ గెలకులఁ జికిలివెన్నెలలు గాయఁ
గెంగేలఁ బైఁటచెఱంగు బిగించుచోఁ నిద్దంపుఁ జనుఁదోయి నిక్కుదోఁపఁ
బలికించువారి మోములు దేలఁజూచుచోఁ వాలుఁజూపులు పూలవాన గురియ
నిలుచు నొఱపును గరువంబుఁ దెలియనీక, పలుకుబెళుకును మొగమునఁ దొలఁకుసెలిమి
యొడలియఁడకువనడలోన బెడఁగువారి, కన్నుఁ బ్రామఁగ మ్రగియున్న కడకునరిగె.

క. వడినరిగి రవికి రుచినే, ర్పడి మిడిగ్రుడ్డులను జిక్కరించిన చెవులు
న్నొంచవున నెత్తినవాలము, నడరఁగ నొక సింగమై మృపాంగన నిలువన్.

చ. కనుఁగొని యానికాంతలు కకాపికలై మది నమ్మ చెల్లఁగా
యనుచు మిళన్మభీకృతభయంబు గళత్కబరీచయంబున
త్వనుపదధావనావిలమృగాంగనమున్ ముహురుచ్చలద్గురు
స్తనమునుగా రయంబున యదాయవలై పఱతెంచి తెల్పినన్. 31

క, కటకటఁబడి మఱినే న, క్కుటిలకరిముగతులు గురియ గుఱి యెవ్వఁడోయం
చటునిటునారసి పీఁచని, పటుయోగజ్ఞానగరిమ భావించుటయున్. 32.

సీ. చిరదయాగాంభీర్య పరిఖకు తాఁ బేలు నవధైర్యవప్రంబునకు సురంగ
ఖలజాతిగుణాలతావళికిఁ బ్రాఁకుడుచెట్టు నిష్ఠురత్వంబను నిమ్మకెరువు
క్రూరవాచాకాలకూటంబునకువారి దాక్షిణ్యవన్యకుద్దామదవము
ప్రకటితాత్మజ్ఞానరవికి దుర్దినవేళ మూర్ఖతాస్థితికిసామ్ముఖ్యకరము
కోపమిటు లౌనొ కాదొయో భూపవర్య, యదియపుడు వచ్చి నామీఁద నావహించి
కటములదరించె మొగమెఱ్ఱఁగానొనర్చె, బొమలుముడివెట్టె ముకుపుటంబులుగదల్చె.

వ. అంత.

సీ. తాపసవటులకుఁ దరవాయిఁ జదివించు భాష్యమల్లంతటఁ బాఱవైచి
హోమ్యునంగంబుఁ గోకిచెంగట మేఁతలడుగు జింకనుదుల్కిపడనదల్చి
హారపూజ కంబుపర్ణాదులుగొనితెచ్చు నెదుటిశిష్యులను నేమేమొతిట్టి
యాగమవాదమాధ్యస్థ్యంబుగోరు ప్రవీణనూరిశ్రేణి వెక్కిరించి
కళవసంబూడ జలకమండలువువీడ, జడలుమహిఁ జీరఁ జేజపసరముజాఱ
దర్భముడిఁ ద్రేల ధ్యానతత్త్వంబుసోలఁ, గడిగి నిలుచుండి యాగ్రహాగ్రహముఁ జెంది.

కని మహాప్రసన్నమస్మితసుముఖంబున సారెకుసారెకు స్సల్లా
పొసగుచు దీసెఁ గైకొని జయోన్నతిఁ జెందుము రాజనందనా 43

ఉ. అనిన మహాప్రసాద మిది దానతి యిచ్చితిరేక దా యికం
గనఁబడఁ జెల్ల నేమిటికిఁ గార్యముఖంబున స్వామిచిత్తమే
ననుచు నదేల కావలసినం దనుజు న్వధియింపఁ జాలరే
ననుఁ గరుణావలోకనముచే ఘనుఁ జేయఁగఁగాక వచ్చటన్. 44

సీ. చాయలొందినపంచ సంతరించిన వాలుచూరకత్తి పకీరు చూపఁగలిగె
తరతరంబులనుండి దాఁచిన దనివిన్న కఱకునైజాములు గాంచఁగలిగె
ననిలోనఁ దనుఁగాచు ననిచెంచులక్ష్మింద కేడెంబువాడి వీక్షింపఁ గలిగె
పందెమొగ్గినఁ గూడఁ బగఱ గెల్చుకటారి యుడిపిని వగనశ్చయింపఁగలిగె
స్వామి మీకతమున నిక్కి చౌకపసకి, నీదు వేంచేయవలయు నే మీగృహమున
కరుగుదెంచితి దండులకనుట కాదు, పదములెక్కుడ బడలెనోకద మసింద్ర. 45

చ. అనియతిహజాని యీలాడిగపుత్రులఁ గన్గొని దండు చాటఁగాఁ
బనుపుఁడటంచుఁ బల్కి మునిపాలకమౌళికిఁ గేలుమోడ్చి స
ద్వినయవినమ్రుఁడై నిలిచె వెంబడిగా నరుదెంచు మున్నుగాఁ
జనుఁడని వీడుకొల్పి హరి సాహిణి నీవశమంచుఁ బల్కెమున్. 46

చ. గడెలు పదాఱు చెల్లె ననఁగా విని కట్టికవారు ప్రోలి గ
స్పృశ నవధారు దేవ జతినాయన గద్దియుడిగ్గి యంపతి
న్వడిపలుకంపి మాళిసజణిన్ హరిగల్గు గుడంగ జెట్లు వెం
బడి కయిలా నొసంగఁ దెలిపావలు మెట్టి యొయార మేర్పడన్. 47

శా. కోణేవాకిట వారి నిల్పి కులుకుంగుత్తంపుఁ జన్గుబ్బలే
జాణల్కాంపచు కుంచెరొండి యహపా ల్నాగింప వాణీరణ
ద్వీణాపాణులు కొందఱాదతిగ ముల్డి స్ఫంగఁ గత్యంతర
శ్రేణుల్గాఁటి నృపాలుఁ డంతిపురముం జేరెం బ్రమోదంబునన్. 48

వ. అంత. 49

క. దనుజాతఖండనోద్ధతిఁ, జనుమనుజాధిపుప్రతాపజాతము మునుముం
గనిపించె ననుచు జనము, ల్గనుఁగొనమార్తాండమండలం బుదయించెన్. 50

క. ఇటువలె వేఁగ నరపతి, పుటభేదనమునఁ బ్రయాణభోగనక ఛేరి
పటహధ్వమాదిపోకాహార్, నటుదవములు నిప్రలేపి పయనము దెలుపన్. 51

సీ. పటుచక్రగతి నేలపాఁతు పెల్లగిలంగ విమలమణిస్యందనములు దనర
మావటీలకు మింటిదేవతల్ మంత్రాక్షతములీయ గజయూథపములు వెలయ
ఘారాసమున్నమద్ధవళచామరలు అక్కళిభంగిఁ దగఁ దురంగములు సెలఁగ
జయలక్ష్ములవరింపఁ జను పెండ్లికొడుకుల గుంపులై భటరాజకోటియొనర
నడచి **తమగపు** బైట సన్నాహమెల్ల, నమరఁ బౌజులు దీర్చి నిజాప్తమంత్రి
వరముఖాంతరమున సరివారితోడ, మాటలాడించుకొనుచు సామంతనృపులు. 52

చ. గొనబుపసిండి కీలరిగె గుంపులనీడ వసింప నంతలో
జనపతి మేలుకాంచి హరిచందనగంధిలమైనవారిఁ గుం
దనపుమెఱుంగుగిండ్ల వనితల్గొని తన్ముఖమజ్జనంబు సిం
షానరఁగఁ దీర్ప సష్టమొక యుగ్మలి పూనఁగ నామతీర్థమై. 53

చ. మినుకుఁ గడానితాయెతుసమేళపుఁ గ్రొవ్విరిదిండుదండ డా
ల్పొదవ లెవాటు చల్వవలిపంపురుమాలువు గట్టి దట్టిఁ జె
క్కినవిడికెంపువంకి జిగి కెంపగు దుప్పటిదాల్చి యాతఁడే
మనసిజుఁ డాయన న్సొగసుమార్గముగాఁ గయిసేసి వేడుకన్. 54

సీ. సమదవేత్రకరాతిసాహోనినాదంబు గదలివచ్చెనటంచు మదికిఁ దెలుపఁ
జామరగ్రాహిణీసరళకంకణరావ మిదలి కేతెంచె నంచెఱుక సేయఁ
గమనీయయవనికాకాంచికానిస్వాన మల్లన వచ్చెనం చానతీయ
సంగీతవిద్యావిశారదాగానంబు లిదె యరుదెంచెనం చేర్పరింపఁ
జనవరులు లేచి నిల్వ హజారమునకు, నరిగి చౌకట్లముత్యాలయందు హస్త
మిడఁగఁ గొల్చుచు నిలిచి సాహిణులు మొక్కి, తెచ్చి ముందఱఁ దోలు నాఁటి తేజినిల్వ

క. వడిఁ గట్టికవారలు హా, వడమిడి హెచ్చరిక రాయవరగండ యనన్
బెడయం కెవన్నె హైఁగా, లిడకపుడు చివుక్కుమనఁగ నెక్కెం దేజిన్. 56

మ. చనవుల్మీఱఁగ మ్రోల నూల్కొలుపు బల్సాంబ్రాణీధూపంబు హా
సనకు న్వేలుపుముద్దరాండ్రు కచముల్జార్పంగఁ బుణ్యాంగనా
వనజిన్యబ్జకరాపతచ్ఛితమణు ల్వర్షింప ఛత్రంబుపై
వనువౌ బంగరుగుబ్బ లొప్పుఁ దలఁ బ్రోలై ముంచఁ జంచద్గతిన్. 57

చ. జనవరమౌళి కొంతవడి సాహిణి నివ్వెఱగంది చూడ జో
డన రవగాలు చూపుచు హుటాహుటి నేగిపరాకు వీరవీ
రని తెమ్ముఁ జెల్ప నంపలు దయంబున వెంబడి హాగె సల్పి యొ

య్యనఁగనుమూసి కన్దెఱచునంతటిలోఁ మునిసీమఁ జేరఁగన్. 58

క. అరుగఁ దదీయమనస్స్ఫుర, దరవింద మరందబృందమై మధురసుధా
చిరకంపమై యొకానొక, పరమానందంబు హృదయబంధం బొందన్. 59

సీ. మధ్యసంధ్యాస్నాన మౌనీంద్రలూన తాపసగంధపవనంబు భ్రమరివాఁడె
నంబుపర్ణసమిత్కుశాయాతవటుజాత సమదనాదంబు మిాసంబు దీఁటె
సవన ధూమాబ్దవీక్షణనటత్కేకికాంతావిలాసము తొడల్పట్టుకొనియె
నన్యోన్యవైరాసహామృగేంద్రమత్తవేదండ కేళికలు పంతములు వలికె
నీకరణిమున్నగాఁ బరాకిడియె మాని, యాశ్రమంబని తన్మార్గమభినుతింప
మోదమునఁ దేలి నృపమౌళి మోము చూడఁ, జనవుమైఁ జేరి నిజకేళిసచివుఁడనియె.

సీ. చలువలు నించు నచ్చపుమంచుఁ జిలికించు తేరాయఁ దెప దేర్పఁజేంచువాఁడు
గలభి గాపంద వేల్పుల నొక్కనొక్కనిఁగా ధనరాజు వెలినుండి యనుపువాఁడు
వారివారిప్రభుత్వతారతమ్యమెఱింగి గిరిశుండు బంతిసాగించువాఁడు
ప్రొద్దువోయెను జూచి భుజియింపుఁ డని దేవపతి యుపచారము ల్పలుకువాఁడు
తగినవారల వీక్షించి తమ్మిబోఁటి తోఁడు మాటికిఁ జవు లెచ్చరించువాఁడు
జనవరాఖండలా యిందు సంయమీంద్రు కాండకృతమైనసత్రయాగంబులందు. 61

చ. మునివనిత ల్శచీముఖ తమోనిభవేణులకుం బతివ్రతా
జనతతిఁ దెల్పఁగోఁబరవిచారము గావని వేల్పుటొజ్జ జ
వ్యని మొగ మప్డు ముంజొనుప వారలు నవ్వుదు రామె సిగ్గుపెం
పునఁ దలవంపఁ జందురుఁడు పొంగగ నిచ్చట యాగవేళలన్.

సీ. సాలీఁడు గాఁబోలు సమదవేదండంబు తెలినారచీరలు డులిచి తెచ్చెఁ
బనివాఁడు గాఁబోలుఁ బటుఘోణిపోతంబు బలుమోదనివ్వరి కలుపుదీయు
గొల్లఁడు గాఁబోలు భల్లూకపాకంబు మేలిజన్నపుఁబసిమేఁపి తెచ్చెఁ
జనవరి గాఁబోలు గొనబుఁబ్రాయపు జింక యలరిపై పారుపత్యంబు జేయుఁ
గూలిగొను నొజ్జకాఁ బోలుఁ గోదమ చిలుక, తపసిబుడుతలగమికి వేదంబునుడువు
సుసరముగఁ బారికాంక్షు లేజోలిలేక, జపతపంబులు సాగింప జనవరేణ్య. 63

చ. మునివరులేగ వెంట మృగము ల్చదికిం జని యంతనంత మే
పున కటు నిచ్చ చి న్నియమపూర్ణత వారు నిజాశ్రమాళిసం
జనినఁ బదాగ్ర్యబంధురపవిత్రాలజటల్లరి జీవికాఖ్య వె
న్కొని చెవి బక్కరించి యుఱుకు బొంకట్టిన వెల్ల దాఁటుచున్

సకలసిద్ధివి తండ్రిపద్దులు, వెలసితి విటు లపనికన్న విక్రమ సరిమన్- 73

చ. అనుచు బహూకరించుసమయంబున నూరకయుండి యుండి యం
బనరుచి పుంజమంజిమకు నగ్రహమైనతమంబు పక్వతో
డన హరిచందనప్రతిభటం బగు వెన్నెల దోఁచె వెంటనే
కనఁబడియె న్నిజప్రకనకస్తబకస్తుతమైన యొంటలున్- 74

క. అది చూచి మేదినీవర, భిదురీ మృదుకీలిగా దభేద్యము గంటే
యిదిసుగన్మ పనుజశాంబరి, గదిసె న్వరిపూర్తి దీని ఖండింపు మికన్- 75

గీ. విజయ మగు నీకు గెలువు మోవీరవర్య
యనుచు గాలవుఁ డాడుచో నపుడఁ గలుగు
పారిగాంత్రులు కటకటం బనుచు శిష్యు
లంటి చనుదేర నవ్వోటి కరుగుదెంచి- 76

క. మునిచంద్ర వచ్చి మావెం, టనెవచ్చు నటంటి వీతఁడా నృపశేమ
య్య నరేంద్ర కన్నులారం, గనుఁగొంటివె వీని యవనగాకి తనంబుల్- 77

ఉ. అయ్యయొ మాకు పంపమిడినంతిఫలంబు నరేంద్రచంద్ర యీ
పయ్యము తోడి జాగరము దాఁటఁగఁజేసి శుభమ్ము లిమ్ము తే
వయ్య కొమాళ్ళతండ్రి వయి యాశ్రితరక్షణ దుష్టశిక్షణా
క్షయ్యదయాపరాక్రమ విశాలుఁడవై మనుమయ్య యిమ్మహిన్- 78

సీ. చవుకొన్నాముంచు జట చెప్పుమఁ బరీక్షఁగొని వరింపు మటంచుఁ బెనఁగువారు
ననుజూచె ననుజూచె ననుచు రిత్తకురిత్త జపలు వట్టుక పోరఁ దొడఁగువారు
బులకము లైమ్రనిట్టపొడువఁగ వడి నోరు దెఱచి మేమేఁ జూపఁ దిరుగువారు
జేసన్న నటజంబు చెంతకు రమ్మని మును దొంగమొక్కులు మొక్కువారు
నగుదు రీయయ్యలెల్లవాఁ డపరుగడగ, గులుకుగుబ్బలు పలుకుఁ జెక్కులు మిటారి
మొలకనవ్వులు గలమోము ముద్దుగులుక, మాయపుం డెక్కులాడినై డాయునప్పుడు-

సీ. అటుమొన్న భార్గవజటికి శౌనకమౌని కొకవాని మైనొంట కుంటఁ జేసె
మొన్నఁ బారాశర్యముని యోటరాఁ గూఁతలెగయించి వెరవేఁకి యెత్తఁ జేసె
నిన్న విశ్వామిత్రునికిఁ పంపరఘటించి యొప లెఱుంగక పడియుండఁ జేసె
నేఁడు మార్కండేయునికి సిపంబెత్తించి తలవీడఁగ బయళ్ళ మొలఁగఁ జేసె
మానవాధీశ విను మింతమాత్రమైనఁ బ్రతుకవచ్చును వీసచేఁ బడినపొల్ల
కొల్లఁబాటయ్యె మాకునింమునికి యేమి, చెప్పెడిది మాతపంబు నీచేతి దింక- 80

ఉ. అని విని యంతయేమిటికి నాసతి యిచ్చెద రిన్ని నాళ్ళుఁ ద
ద్దనుజుని నొంచి మీపద ముదారముదాకృతి నొందఁ జేయఁ గం
డినయని నాకు నేర మవునేకద యాకొదవ న్సహించిన
న్ననుపుఁడు వానిఁబట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్- 81

ఉ. అనిన రిపుక్షయోస్తు విజయోస్తు పతేభవతే యటంచు వా
రనుపదురాపకోప తరుణార్క విభాదళితారుణాంబుజం
బనఁగను మోము కెంపుగఁ దదర్థరణోన్ముఖభృంగయుగ్మత
జ్జృంభనటనభ్రూకుటిక్రమము దెల్పఁగ నవ్వేటుఁ దర్లి నిల్చినన్- 82

సీ. అధిపభృత్య పరస్పరాన్వేషణాకారణప్రతివక్త్రృతనామకార్య
మననుగతస్వామి హయవేగభూరుహచ్ఛాయాసమాశ్రితచ్ఛాత్రకంబు
ధావనాయాసాస్వజీవనవృత్తిధిగ్వాచకాందోలికావహజనంబు
సమ్మర్దబహుళాది సరణికోభయపార్శ్వచారితవారణాధోరణంబు
సరయ సరదుష్టనిష్పత్తజర్జరధూర్త, గణ్యాగణిక్యసంభవత్క్రమనహాస్య
వారణక్షమతత్పతాక్రూరదృష్టి, సంవృతాశంబు సైన్య మచ్చటికి వచ్చె- 83

క. ఈరీతి సైన్యమంతయుఁ, జేరిన నొకబయట రాజసింహము భటులం
దేరిజ వేయంబనిచి గుఁ, డారము లెత్తించి యంతట ప్రవిగుప్తింకన్- 84

గీ. పటపుటంగడి వీథులేర్పఱచి కొంచె, పాటి నడగని నెక్కి యాపాలె మెల్ల
విడియ నియమించి తిరిగె వేవేలు దివ్వె, టీలవెలుఁగున సంగీతమేలమమర- 85

చ. తిరిగి యతండు వచ్చి వడఁదేర్చుచు ఘమ్మను వట్టివేళ్ళచ
ప్పరము కురంగటం దగు తుషారము చేరునఁ జారువ్రజపాం
డరరుచిరమ్ము గుమ్మతగు డారమునం గొలువుండి పట్టనాం
తరముననుండి వచ్చు చరసాధుల కమ్మలు వించు నున్నెడన్- 86

గీ. ఊడిగపుటత్తెకాఁ డొక్కఁడొటుఁగుఁ జేరి
విభుని చెవిలోన నేమేమొ విన్నవింప
నతని కనుసన్న గనుఁగొని యయ్యె మంచి
దతనిఁ బిలిపించెద నటంచు నఱిగె వాఁడు. 87

సీ. నేవమై సగము దీసిన బూదెపండుతోఁ గూడినబంగారు లాడె సింగి
బారసీలిపిని జొప్పడ భగవద్గీత లెన్నిక వ్రాసిన చిన్నిపలక
బుడుతపస్సిమిరుచి పులితోలు చుట్టతో బన్నసకట్టించిన పట్టుజోలె

యొకతిత్తి బిగదేశల కొసంగఁ గూర్చిన రసవాదపు మెఱుంగుఁ బసిఁడి బుడ్లు
కొండవలె నెత్తిపైఁ జుట్టుకొన్న జడలు, వెండికట్టులబెత్తంబు విడెముమీఁద
వీడియముగల్గుదార పాతలాఁడెజోగి, బిలికొని వచ్చి పొడఁగనిపించుటయును.

గీ. పతికరముఁజూప రత్నకంబళము మీఁదఁ, గడవసమువైచి కూర్చుండి బుడుతవీచు
సురటిగాడ్పుల నుదుటి కస్తూరి బొట్టు, రవలు రాలంగ నాతఁడా రాజుఁజూచి-

సీ. ఇది చేత నుండిన నిసుమంతపడిలోన నేదేశమునకైన నేగవచ్చు
నిది మోళి పైనున్న నెదుటి చేవెళ్ళిన వైరికైదువజాలి దారితప్పు
నిది దట్టిపొఱ నున్న నెటువంటిరూపైనఁ బొరిపించి వేడుకఁ జూపవచ్చు

*  *  *  *  *

*  *  *  *  *

*  *  బవనికలోనుండి యొకమాయ పన్నుటయును.

ఉ. కంటెఁ దగిల్చినట్టికొన గల్గిన చంద్రుఁగావి జాళువా
జంట పయంటపై నిగుడి చక్కని జక్కవ నిక్క చొక్కపుం
జంట చెలంగు బంగరువు చాయలు దూచియనంగఁ జాలు వా
ల్గంటి మెఱుంగుఁ జూపులు దళారన వచ్చె మహాద్భుతంబుగన్- 91

ఉ. చొక్కపుఁ బంజుకమ్మల రుచుల్మెఱుఁ గెక్కిన చెక్కుజాలువా
నక్కులచక్కజక్కిణిగొనం బిగిగుబ్బలు పిక్కటిల్లఁగాఁ
జక్కలరాచడాలు తెలిచూపులు త్రొక్కనిచోట్లు ద్రొక్కనా
చక్కెరబొమ్మయమ్మహిపచంద్రుని చక్కటికేగి గ్రక్కునన్- 92

ఉ. రంగు చెలంగ గుబ్బల ధరాస్థలివక్షము మోపలేమి సా
ష్టాంగ మొనర్చ సిగ్గుపడె నంచు నభంగురపాకభిన్మణీ
సంగతకంకణారవముచాటఁగఁ బైటచెఱంగు కేలితో
ముంగలఁ గొంకుచుం గొలువుమొక్కఘటించి పిఱింది కేగినన్- 93

సీ. సయిదోడ చూడు నసాయ యిట్లేజ యిట్లేశవోజూలఫతి యింగిలయ్యా
* జగ్గుమంటివి వచ్చిశాణ నిద్దాహుంత్త కారి బుర్నాపుత్త గాలిసుమ్మ
అట్టెచూస్తుండది యదెనస్నెమోసిలి గలవాఁడ నని యదిగాక గడిని
చిక్కారిసాదన జేసెనదియింన్న దోభాజలల్ల మెలుద్రిబజారి

---

* యీపద్యమును బ్రత్యంతరములేకపోవుటచే నిచ్చవచ్చినట్లు దిద్దినఁ గవిహృదయము చెడునని భీతిచే నాభారముఁ జదువరులకే వదలినాము.

దీనిపై యేమునై సేసి నానువాని, చక్కఁగఁ దిక్కొలాదికిఁ జుస్థిరోలి
రాజుపాలానవిను యిటురాయటంచు, రాదదేవళ్ళ కెఁగలి విరాళిఁగొనరి. 94

గీ. అంత వారెల్లఁ బత్క్రారణాభినూత, నాతివాచాటతాజ్ఞ ప్రభూతరోష
పీఠహోత్రసముజ్జాతధూతికేళి, కాద్రుతిస్థితతామ్రాక్షులగుచు లేచి- 95

సీ. ఇలుతోఁడుత దట్టిపొరల వంకలు దూస్సి తెలిచల్లసములతో నిలుచువారు
నింటి కిమ్మని పిల్లబంటుఁ జేతికి సొమ్ము లొసఁగి పీరావేశ మొందువారు
జానస్నఁ జేవెళ్ళ మనిహెచ్చరించుచుఁ జికటారి పొదలిశ ల్సోగువారు
దీని ముందరనొంచి వానిపైఁ బడువారు * * *
వాలు గొని లేచివచ్చు భూపాలుఁ ద్రోచి
యవ్వలి గుడారమున కేగుఁడనుచుఁ జెంకి
యతనిగద్దింపులకు భయమందువారు
ననుచు సంపఱు దొమ్మిగా నరయుటయును. 96

గీ. అంత నాలాడెజోగి మాయావిధిజ్ఞ, పంచమంతయు నుపసంహరించి నిలిచి
మునుపుఁ గొలువున్న వేళ నేయునికినుండి, రట్లయుండఁగఁ గైవార మాచరించి- 97

క. పాతాళకేతుఁ డంపిన, దూతస్వామికెదిరి దురమున నిలువ
న్నీతరముగాదు వినుమీ, వేతెంచి బలంబుతోడ నిటు విడియుటయున్- 98

మ. తనచారుల్గని వచ్చి దైన్యమున నేతద్వార్త విన్పింపఁగా
విని మీసంబులుదిద్ది దైత్యుఁ డహహా వీరా వడిన్వచ్చెపో
రనునన్నుం గది యించువారు మఱివారా నన్ను మార్కొంచుదం
డనుమానింపక వచ్చి నిల్వఁగల వీరాగ్రేసరు ల్పాపురే! 99

క. పెంపు విచారింపక విని, పింపఁగరాదనక వచ్చి ప్రేలెదు వీరిం
జంపలు వేయరె యనుచు ని, లింపారి నిజాప్తులం బిలిచి యిట్లనియెన్- 100

ఉ. వింటిరె యొక్కవార్త మనవెజ్జులు చెప్పిరి తాముకన్నులం
గంటి మటంచు వీతబిసిగాంద్రుఁ మదీయమహోగ్రమాయకై
దంటతనంబునంజని ఋతధ్వజు సైన్యసమేతుఁ దేర నా
బంటుఁ దనంబుఁ బాపుటకుఁ బన్నినవా డట వాఁడు వాఁడిమిన్- 101

సీ. గరళకంఠద్వేషి కరకకాయలు గొన్ని తినియైన నాఁకలి దెచ్చుకొనుము
దేవేంద్రమదభేది తెలిచాయ గలకోర పంటిమైన ల్పానఁ బట్టుకొమ్ము

జూచు సంగీతమేళంబు సొగసుకాండ్రి
ధిమ్మనెడి మద్దెలల్వ్రాత గ్రమ్మకొనియె
రాజు పవళించు తెలిగుడారంబువ్రోల- 109

చ. నలుఁగిడి చల్వదాల్చి పయనంపు టలంతల నిద్రఁ జెందరో
వెలఁదులలేపఁ గొంకె పతివింతగుడారపు ప్రాకివారిగం
టలకొచ కుల్కులేవఁ జిఱునవ్వులతోఁ దమవారిఁ గూడి యిం
పులతమి దీఱినన్ నిదురవోయిరి నవ్వుబోజుంగు లత్తఱిన్- 110

చ. గుమిగొని తెచ్చికోలుకు సిగుంపులఁ జెట్టులనీడఁ బొట్టిమం
చములపయి న్వయించి పటసారకుటీరము లెత్తి మేలిజా
సమున వమించు పల్లవులనంటున నేరము లెన్ను చున్న వ
ప్రమదల వ్రోల నీటునెఱపం బనిపూనిరి గుత్తలంజియల్. 111

చ. కనుకని తెల్లవాఱుననుక ప్రతిగోరెడు పల్లవాళి మే
ల్గనుఁగొని వీడెముంగలుపులాహిరి మేపుల నిద్రఁబుచ్చి చెం
దిన చిఱునవ్వుతో నపుడె నిద్దురలాయని వింతపైఁడి ప
ట్టిన వెలముద్దుగుమ్మలు పడిన్నయనించిరి చప్పరంబులన్. 112

క. అల పాళెమునకు నిలుపని, బలకరమై పారివారి పరియై తగును
కక్కళమై నిదురించని సకిం వలపుల వెలచెలుల విటుల వతిఁజాలు టమరెన్. 113

సీ. ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బుబాటు గొల్లసివాలు పాడుకొనుచుఁ
బాముసాడించునేర్పాటునఁ దలయూఁచికొంచును జెంగు విన్పించుకొనుచుఁ
దమవారి గుమిగూడి దమ్మరాజులకత లొన్ని టికడ్డములేక నొడివికొనుచు
లయయొక్కట్రోవతాళంబొక్త్రోవఁగా నేమేమొ ధక్కవాయించుకొనుచుఁ
జిటుకుమన్నఁ బరామరిశించుకొనుచు, నంటుకత్తెలు తమపయనంబు నమ్మ
తించకాడిన వగఁ జెప్పుకొంచుమింది, రక్కళపునల్లనుండుల యొంటికాండ్రు. 114

సీ. వెఱవకుమని పెన్ను చఱచి వేలుపుతోఁడు తెలిపిననింద్రాణి తెలియదయ్యెఁ
దనుతానె తెలిసి మూసినకంటితో వాణి వీనులపైఁ గేలు మానదయ్యె
నది పరామరిశింతునని యేగు పతిసాఁగి జలధినందనకొంగు విడువదయ్యె
దడదడమన గుండె తాళిబొట్టువద గుబ్బలిపట్టి పడుకయిల్వెళ్లదయ్యె
బాళెమున నక్కడక్కడఁ బదిలముగను, వ్రోయఁజేసినతముదల మొదలిపోటు
దాటి వ్రోతల పటహంప్రధణధణలకు కొంతిగా నండ్లనిటులున్న యంతలోన. 115

క. అలరాజు విజయ మెసయం, గలఁడని చంద్రుఁడును దారకావనితలతోఁ
గలహించి ముడియవైచిన, పొలుపలరన్ వేగుఁజుక్క పొడిచెం బెడఁగై 116

క. అంతట దనుజేంద్రుం డొక, దంతపుఁజవికెన్ బ్రధాన దైత్యులతోడ
న్మంతనమాడుచు నృపుబల, వంతపునైఖరులు వేగువారలు దెల్పన్ 117

క. పడవాళ్లఁ బిలిచి బలముల, వెడలింపుఁ డటన్న వారు వెసఁ జని నిద్రా
జడులను బలాశి వీరుల, నడిగా మేల్కొల్పి ప్రకృతవార్తలు దెల్పన్ 118

చ. అవరుచు వచ్చె నొక్కపలలాశి నిజాంగన సిగ్గుతోడి న
వ్వొపవెడు చూడ్కిచేతఁ దనయుల్లములోని పునారతక్రియా
భ్యుదయపు వాంఛదెల్పఁ గనుబొమ్మ నదల్చుచు మీఁదివేలుపు
న్మదితల నంటు గానిపయి ముందుగఁ జొకఘటించెనోయనన్ 119

చ. ఒకదనుజాధినాథుఁడు మదోద్ధతి గందమలందికొంచు గొం
చక చనుదెంచె నుగ్రరణసన్నహనంబున రాజమార్గణా
ళికి నిఁక మీఁద డెంపము బళీ యిరవౌనని బొమ్మగోడపైఁ
జికిలియొసంగి వన్నియలఁ జెన్నగు సున్నము వూయుకైవడిన్ 120

గీ. విరులు సిగఁ జుట్టికొని యొక్క వీరదైత్యుఁ, డరిగె నిఁకమీఁదఁ గల్గు కల్పావనీజ
పుష్పముల సారసౌరభంబునకు వాని, వలపునకుఁ బూని సరిచూడవలయుననఁగ. 121

క. ఈ నేలచుట్టుఁ దిరిగినఁ, బోనీయఁడు రాజు పాఱిపోరాదనుతీ
రూనఁగ నొకనక్తంచర, సూనుఁడు చక్రింబు ద్రిప్పుచుం జనుదెంచెన్ 122

క. అనలోపమనృపశరముల, మొనలంబడి తరణిబింబముం జొచ్చుగతిం
దనుజుం డొక్కఁడు గ్రక్కునఁ, గనకరథంబెక్కి యక్కు గ్రిక్కుచు వెడలెన్.

సీ. పడవాళ్లగమికిఁ జేపుడికి దబ్బఱనొప్పి పైపైచుకొని మూలఁబడినవారు
నింట్ల లోననయుండి యెటుపోయిరోకాన మనిపించి కనిపించకడఁగువారు
నింటికావలికి నన్నచట నిల్పరు గదా యని వేల్పులకు మ్రొక్కఁ జనెడువారుఁ
దొలునాఁడె నృపునివార్తలు విని యొక తేనిపనిఁ బూని యెందెందొ చనెడువారు
గ్రాసములు చెల్లలేదని గాసిచేసి, కొలువుజీవితముల కొప్పకొననివారు,
నగుచుఁ గోఁచపిశాచము ల్దిగులుపడఁగఁ, దక్కరక్కసిదొరలు ముందఱను నిల్వ

సీ. సలుచుండి వీణ చేతులఁబూని తెలుఁగంటిబయకాఁడు మేల్కొల్పు పదముఁబాడ
నలుపుతో నాల్గుమోములదేవుఁ డొకయోర దిఃశుద్ధి దెల్పి వేవెనుక కొడుగఁ
వనయూరినుండి తెచ్చినపూలమాల జేజేలరాయుఁడు చేరి చేతికొసఁగఁ

జోరువచేసికొనిశంకరుఁ డిచ్చుకాలకు సఖుఁ డౌను బేరుపైఁ జాడిచెప్ప
గడియప్రఢుక మునుంగుటఁ గని గురుండు, తెల్లవారెడునని పఱతెంచి పలుకఁ
✓ గటికవారెల్ల దొరలువచ్చుట వచింప, దనుజపతిలేచి యొకభద్రపంతిసెక్కి 125

గీ. కోటకావలికై యాప్త కోటితోన, నీవు నీవని నియమించి నిలిపి తక్క
రక్కసులు వారణంబుల రథములందుఁ, దురగములయందుఁ బొడసూపి తోడనడువ

సీ. చెకుముకి యగ్గిజానకిత్రాటిమిడుఁగురుల్గ్రాలెడునది యొలగోలుమూఁక ✓
వెదురుమల త్రెళ్చు విధమున నీటెయ్దాల్చిపాల్చియది డండిబారు
లిరుగోపులను దుమ్ము లెగయించునదిసిలేముస్తీబుగల కాలుమొక రిపోజు
కొమ్ముకత్తుల మెఱుంగుల వెల్లపావడ గ్రాలునది మస్తేనుఁగులచియంబు
సురగిరీంద్రంబుపిల్లలై చుట్టు నున్న, కనకరథముల నడుమ సింగాణి విల్లు
దొనలు మెఱయంగఁ దేజిపైఁ దోఁచువాఁడు, ధారుణీశ్వరుఁ డని వేగువారు దెలుప

చ. అరిగి మహోభయంకరతరాహవదోహలబాహనప్రతా
పరుచులు వోలు చెందిరపుఁ బావడచేఁ బుజచేయి వీచుసు
స్థిరమతి సంపపెట్టుకొలఁదిం గజరాజము నిల్పి దానవే
శ్వరుఁ డెలగోలనర్వఁగ నిశాచరుల న్నియమించి నంతటన్. 128

చ. అలరు మొగంబుతోఁ గువలయాశ్వము నిల్పి నరేంద్రమౌళి తూ
పులపొదిదోయి వీఁపుకడఁ బొందుపడం బిగియించి మించురా
✓ చిలుకలు ప్రాఁతగచ్చుపనిసింగిణి గైకొని యెక్కువెట్టి సే
నలు తనసన్న గోరఁగ గుణధ్వనిచేయుచుఁ జేయి వీచుమన్. 129

క. పేరేములువాటి యొక్కొక, చేరున గుంపగుచుఁ దారసిలి యిరువాగుం
ఘోరప్రబాణపుఁ జువ్వలు, బోరనఁ గొనవిడిచి వైవఁ బొసఁగె న్మోపటన్. 130

క. కొనద్రుంచినైచు బాణపుఁ, బెనుజువ్వలు పాటి సేలపెట్టుగఁబడుజీ
బున సిగిడి కాలుసేతులు, దుసియలుగావించి ముందు దురుసున నడిచెన్. 131

క. ఉయ్యాలచేరులనఁగా, నయ్యిరువాగులును పటిమి యటు దిరుగుచు బ
ల్కయ్యా మొనరించి యించుక, డయ్యక యొడ్డె పయిఁ బెట్టుటయు న్బోయెదన్.

చ. ఒకపరియొడ్డులోని రిపులుగ్రత్రవైచు తుపాకి మందు గుం
డకు వెనుదీయకాఁగి యచటంబడు సాపులఁ గోలుగొట్టినీ
య కనిఁ జెనంగి యంతఁ బరియం బడి యచ్చటివారలు గకా
వికలుగఁ దోలి యొడ్డు విడిపించిరి చేరువకాంద్రు మెచ్చఁగన్, 133

గీ. అలసినట్టి జనులు తేలి యవలికరుగ, వేణుతుటుములు పెనుబోటు భేరిమ్రోఁత
లమర నరుదెంచి దొడ్డకయ్యమున నవియుఁ, బడలనంతయుఁగని పండిబాపు గధిసె.

క. అంపఱునిట్టలు వచ్చిన, యంపము గనుపట్టెఁ బద్మజాంభోనిధి దాఁ
టం దెప్ప గట్టెఁ బూనిన, చందంబున నలుగు లరిదిశాయల నీనన్. 135

గీ. ఒకఁడు కుంతానఁ బగవాని యురముగ్రుచ్చి
వెంటనేయాతఁ డీటెచే వెళ్ళఁ బొడువ
వెలసె నడ్డఱు నిల్చిన నిలుపు కడన
కాళికై కానడించిన కానుకనఁగ. 136

క. పగవాని గ్రుచ్చి యీటిని, నెగనెత్తెనొకండు రణమహీంద్రుమాలమునం
గగనమునుండి వ్రాలెడు, ఖగపాళుల కంది యిచ్చు కైవడి మెఱయన్. 137

క. జముదాడి నొక్కవీరుఁడు, విమతేంద్రుం బొడిచి వాఁడు వెస నిజభుజసా
రము మెచ్చి చల్లునవుడుం, కుసుమబలెఁ బద్రక్తమున నిగుంభితుఁ డయ్యెన్. 138

క. అలుగునగచూపు వేళం, బలతలమును నంతసోఁకిన న్మగవానిం
గళదాఁకెఁ బెనఁగు నొకమొ, క్కలపుదొరకరాని నీటుకత్తియ యగుటన్. 139.

ఉ. సగళము లూడ్వనెత్తి కరిణీపతిచేరినఁ దేజిపావడన్
మొగమునఁ గప్పినొకి యొకమొక్కలపు న్నెఱరౌతు కుంభము
ల్పగులఁగ జేసిన న్వెడలెఁ బట్టము వెంటనే మౌక్తికావళు
ల్మగఁటిమి మెచ్చి చేరి జయలక్ష్మి ప్రసూనాంజలి యిచ్చుకైవడిన్. 140

మ. బలియుం డొక్కపఠాణిరౌతు తనబాబానూకుచు న్రెండుపీ
ఘులమాస్త్రీలతలల్కరాసిలతికం ద్రుండించుచుం జుట్టిరా
నలరెం బత్తనువు ల్కరంబడుట భూభాజ్ఞప్తిచే నెట్టివా
ఫులు నేలం బడవైచి కూలఁబడుకాపుల్వోలె నప్పట్టునన్. 141

క. నరపతి యంతట దనుజుల, యురువడిఁ గని చేయిపీవ నుగ్రాకార
స్థిరతంగరులకుఁ గరులున్, హరులకు హరులరథములకు రథము లెదురన్.

సీ. రాజ నాచెయిచూడు గ్రాసంబు ఋణముగాఁ జేయుదునే యంచుఁ జేరువారు
లలితంపుఁ దులశిప్రోగులుద్రుంచి నోటిలో నైచికొంచుఁ దురీనవచ్చువారుఁ ?
గలనిలోఁ బొలియుటకంటె భాగ్యమ్ములున్న వెయంచుఁ దెగి యనికఱుమువారు
నేలినవానికట్టెదుట నే పసికివచ్చుటగదా మేలని చొచ్చువారుఁ
బూర్వవైరంబు మాని సొంపులు జనింప

నొకని కొకఁ డెచ్చరించుచుఁ జికిలియొఱలు
పాఱవైచుచు వడిఁజొరఁబాఱువారు
నగుచుఁ గైజీతములవార లనికి నిగిడి. 143

క. దనుజులఁ గదిసిన నత్తఱి, జనితంబగు ధూళిపాళి చదలఁ బొదలఁగా
ననిమిషకోటికిఁ గరములఁ, గనుదోయిం బులుముకొనుచుఁ గనుఁగొనవలసెన్.

సీ. అరదము ల్దరదుర నరుదార నరుదేఱ నరదము ల్దరదురనరిగె నెదురు
కరులు ఘీంకారబంధురములై నడతేఱఁ గరులు ఘీంకారబంధురత నెదురు
హరులు హేషాతిభీకరములై పఱతేఱ హరులు హేషాతిభీకరత నెదురు
భటకోటి చటులతోద్భటములై చనుదేఱ భటకోటిచటులతోద్భటతమీఱు
సారథులు వ్రాలఁగొమ్ములు చదిసికూలఁ, బక్కెఱలువ్రీలఁ గరవాలపటలితూలఁ
కేడివారంగ నవి పోరు ఖేచరాళి, హర్షమునఁ జూడఁగా బొమ్మలాడినట్లు. 145

మ. చదిసెం దేరులు పాఱె వారణము లశ్వమ్ముల్గరం గూలెఁ గం
జెదరెన్ సైన్యము వ్రాలె బాహువులు వ్రీస్సెన్మాంసము వ్రాలెనం
గదము ల్ద్రెళ్లెఁ గిరీటము ల్పఱచె రక్తశ్రేణి కయ్యంపుఁ జో
కుఱ్ఱదనర్పన్ భుజదర్పమొప్ప నిరువాగుం జేరి పోరాడఁగన్. 146

సీ. ప్రేగులుమీఁదఁ గప్పించి నవ్వేడు తలల్దూఁడులుగల తమ్మితుటుముఁ దెగడెఁ
గెంపుటుంగరపుడా ల్గీల్కొన్న బాహువు ల్షణమణు ల్గలయహిప్రభులఁ దెగడెఁ
బలు జముదాడి పోటులమించువత్సము ల్నెఱియ లానిన భూమినీటుఁ దెగడెఁ
వ్రేటులరక్తము ల్వెడలించుతొడలు కుంకుమనీటి చిమ్మనగ్రోవిఁ దెగడె
దనుజమనుజేంద్రసైన్యముల్ దైన్యమెదలి
కయ్యమొనరింప సంగరాంగణము చూచు
దివిజవర్యులు మొగములు ద్రిప్పికొనఁగ
నప్పు డమ్మక్కు యనిపించె నమ్మృతముగను. 147

వ. వెండియు నుద్దండతరచండధరకోపాటోప విభ్రమభ్రమిత నయనభ్రమావహస్యంద
నసహస్రసంగతరథాంగనికరావభ్రమవిభ్రమణ విధూత ధూళీపాళికా ధరాధురావ
హ గిరీశపరీణకరీశ్వరంబును గరీశ్వరధారాధరక్షతజపూరపారావార దుర్వారత
...యువాన కనకపరికరంబును బోరనెడఁదగాయంబులవారలం గుంతసంఘ
ట్టితద్వ...టికాడొలికలం గొనిపోవువారును మున్నుఱకమై నెక్కెనకత్తలాణంబు
... పలపాలు చేయ నోపక డిగ నుఱికి కటారుల డొక్కలు విదారించి

నడచి పడువారును క్షతంబులవెడలు ప్రేవుల నూడనీక యదిమి కదనోన్మాదం బున దుష్పటులు బిగియించి యెదిరించువారును గెలుపుగాయంబులఁ బడియుం డియు మండిగాలిడుకొని కైదువులు జడిపించుకొనుచు రౌద్రాకారంబున నున్నవారును గళలెలిసి నలుదిక్కులుం బులుకుపులుకునఁ జూచి మానధనంబునం దొడిగినచల్లడంబు లక్కడక్కడఁ జించుకొనువారును ప్రాణనిర్యాణసమయంబు నందును నిజస్వామివిజయంబెవిచారించువారును నడుగకమున్న యభ్యర్ణంపునుడుఁ గుల జలంబుదెచ్చి దప్పినివారించు బంటుల ఋణంబులు దీర్చుకొని వారితోనా త్మీయులకు వలయు బుద్ధులుపదేశించువారును దెట్టువలుగట్టియున్న క్రొన్నె త్తురులు గనుంగొని నెత్తురుకళవట్టి తమకుఁదామ వ్రాలువారును దొలఁగక క్కడక్కడభ్రపజచిన ముదురుమానిసులకతంబునఁ బోఁగూడక నమోనమో యనుచున్నవారును గ్రించుఁదనంబునఁ గొంచెపాటిచెనకులఁ దెచ్చికోలువేసన లంబడి తన్నుకొనువారును గలిగి సంగ్రామంబు గావున నధికధామంబును జన్యం బు గావున భూతక్రియామాన్యంమును సమరతలంబు గావున ధమోజ్జ్వలంబు ను నై యాసమీకంబు సమాకులితనాకలోకం బయ్యె మఱియు. 148

గీ. పోరఁ బెనువానగా రక్తపూరమొలుకు, కాయములు పూను భూతనికాయములకెఁ
గేళిగతి నిల్చు రణభద్రకాళిమ్రోల, వరలు పన్నీరుతిత్తులవా రనంగ. 149

సీ. గ్రుడ్డులు మిడికించుకొని దప్పికిమ్మను దమవారినొక్క బేతాళపాళి
గ్రొంతుమ్రోచిన దిగుల్కొని నోర వ్రేలిడి క్రక్కునొక్కపిశాచికావిభుండు
అన్నువట్టినను మ్రాగన్నుతోఁ బొర్లాడు నేలపైనొక డాకినీవరుండు
కక్కుర్తి మెక్కి యగస్త్యమంత్రమువల్కు బొడ్డు నంటుచు నొక్కభూతనేత
తనివితీఱినత్రేఁపు విన్నునకుసిక్క, శతపదాల్ దొర్లి నొక్కనిశాచరుండు.
పలలరాసుల బువ్వంపుబంతివిందు, మించుబోఁకులతో నారగించువేళ. 150

గీ. ఒక్కనిక లేఁబరమరసియుఁ దగఁదినక, వీనిఁబజనైచె నాతఁ డావీరుఁ డనుచు
గావనుచుఁ గుమ్ములాడునక్తంచరాళి, యెంతకార్యంబు దమకేమి యెవ్వఁడైన. 151

క. ఒకవీరవరుకబంధము, నకుమూఁగి పిశాచికాగణము భూతావే
శకమున నది యెగిరినచోఁ, బకపకనవ్వించె నులికిపడి డాకినులన్. 152

* సీ. శౌనకమౌని విశ్వామిత్రుతోఁ దెమ్మ పన్నిదం బనుచుఁ జేపట్టి తిగువ
శుకుఁడు * * * *

---

* ఇక్కడఁగొంతగ్రంథభాగము మాతృకలోలేదు.

మాలిని. ధరణిభరణశేషా దర్పకద్వేషవేషా, శరనిధిసితకీర్తి సాధయోధాగ్రవర్తీ
వరగుణమణిజాలా వర్ణితోద్దీర్ణలీలా । నరపతికులహేళీ నారసత్సూత్రపాళీ




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమ స్వయాభరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజితచైత్రి కాశ్యపగోత్రపవిత్రి జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రం బనుమహాప్రబంధంబునం బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీరమణీమృదుపదలా, క్షారసకోపారుణప్రసారితవీక్షా
దూరితవైరికలాపా, నారీనవకుసుమచాపనారదభూపా! 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడంగె
నట్లు పాతాళకేతుఁ డత్యాతుధాన, పటలికన్నను మున్నుగాఁ బాఱుదెంచి. 2

క. పళివాయితోడఁ గోటకు, వెలుపటియిగ్గిల్లుగొట్టివేయించి పిరం
గులు లగ్గంబులమీఁద, న్నిలిపించఁగఁ జనిచి నిగుడునెవ్వగతోడన్. 3

చ అరిగిపురంబుసొచ్చి పలలాశనమౌళి కుమారుతోడమే
ల్సరియగు దైత్యులం గపనుల న్నిలువ న్నియమించి యాయస
స్ఫురణఁ దనర్చు కోటతలుపు ల్బిగియించఁగఁ బంచి ధీరతా
స్థిరమతిఁ జేరఁగా నగరుఁ జేరిహజారము నందు నిల్చుచున్. 4

క. మించు తమిఁ గణజము ల్దెఱ, పెంచుచుఁ దైజీతములకు వేర్వేఱ వ్రా
యించుచు నెలకొలువునకుం, బంచియిడుచు మందుగుండుబాణము లెల్లన్. 5

క. ఇటు లుండ నచట నృపుఁడు, ద్భటగతి దానవుని కూటిపాలెం బెల్లం
దటుకునఁ జూఱ లాసంగుచు, నటు నిలువక సేనతోడ నప్పురిఁ జుట్టెన్. 6

చ. అచలితవృత్తి నిట్లు విడియం బళివాయి పలాశి వీడు మె
చ్చుచు నలకోటకేగు జలసూత్రపుఁ జోటు లెఱింగి యడ్డక
ట్టుచు రసవర్గ మచ్చటకడున్వడిఁ జేరఁగ నీక శూరతా
రచనలఁ జిల్లరల్చెలువు రక్కసిపాలియగాండ్రఁ గొట్టుచున్. 7

క. ముత్తికె వేయించిన దితి, జోత్తముఁ డింముకయు బెదరకుద్భటధీరో
దాత్తమతి నగరు సొరక వి, యత్తటి నటునూరు గవనియందె వసించెన్. 8

సీ. తెఱగంటిదొర నరాధిపు మెచ్చఁ జనుటకై నలువతో నాలోచనంబు సేయ
నిలనుండి వచ్చు వేగులవారి వెంటనే సురమాని గొణుగుచు సుద్దులడుగ
గిరిభేది నగరివాకిటివార్త లడుగంగ దిగధీశులు నియోగి తెగల నంప
అస్త్రాలు విడి వేల్పు లమరగాండ్రసురేంద్రు కార్యకర్తలబంటుగట్టికొనఁగ
ఘోరభుజశక్తి ముచ్చిమిపోటుగాఁగ, మేదినీభర్త పాలెంబు నీఁడఁబడిన
దానవులమూఁక పెమ్మహోత్కటకటోగ్ర, ఘాటిఁ జీరిడించి కమ్మాఁ గోటఁ జేరు.

సీ. అచ్చట వెలుగ లుయ్యాలచేరులు నేలపై చితి రని తోడి వారిఁ బదరఁ
జోటించుకయు లేక కోటరంబులలోని యిరవుపాములు వెఱ బొఱియఁజొరఁగ
నఖిలపక్షులకులాయములుఁ బోఁ బిల్లల గఱచి యవ్వలి కోనకడకుఁ బఱవ
మించి చీఁకటులుకల్పించు నీడలు పోనఁ బద్మాకరంబుల పాఁచి విఱుగఁ
జెట్టుగులులేని పెనుగారుచిచ్చు వచ్చె, ననుచుఁ జెంచెత లెండకై యలమటింపఁ
బార్థివేంద్రుని భటులు డాబాలు నడుప, నటకి రయ్యద్రిపై విపినంబులెల్ల. 10

క. దనుజుల తుపాకిగుండ్లు, ల్గనఁబడు డాబాలు పలకలందాఁకి బిరీ
లునఁ దిరుగుఁ దమునియోగిం, చినవారల నొంచ మగుడు చెలువం బమరన్. 11

క. మనుజేంద్రుఁ డంత సేనలఁ, బనుపుచు సురతాణి లగ్గఁబట్టించిన న
ద్దనుజపతి వీరధర్మం, బునఁ దెగువకుఁ జొచ్చి యెదుర ముదిరిన కినుకన్ 1

మ. అరరే వేఁడి మెఱుంగు తూపుఁ గొనియయ్యా యెంతయోవింత యా
నరనాథాగ్రణి యేయఁగా నది దిశాంతభ్రాంతరోచిర్నిరం
తరమై వాని శిరంబు నైకొని యనంతాకాంతపైఁ దాల్చెనం
తుదసంతోషహృదంతులై దిగధికాంతుల్చెంత చింత ల్విడన్. 1

ఉ. అంతటఁ జేరవచ్చిన వియచ్చరనాథుల దీవనల్మహీ
కాంతుఁడు గాంచి వారి వ్యసనగౌరవసారవచోవిభూతి న
త్యంతము సంతసం బొదవ నవ్వు నిజాంచితసైన్యము న్బహిః
ప్రాంతమునందు నుంచి పరహాసవిలాసవిభాసమానుఁడై. 1

క. నగరిపురిపునగరుండ, న్నగరీరథయూథసౌధనానావిధరు
గ్గగధగలు చూచువేడుక, చిగిరింపఁగురింపరాని చిడిముడి వొడమన్.

క. ఒక్కఁడె పవనోద్భవజవ, ధిక్కరణధురీణ మైన తేజిన్వడిగా
నెక్కి ప్రకాశాత్యవజవ, దిక్కంబగు పురముసొచ్చి ధృతి నచ్చోటన్.

ఉ. గోడలుగోష్ఠముల్గరిడి గుళ్లు గృహాంగణము ల్గజస్థలు
ల్మేడలు మేలుకట్టులును మిద్దెలు ప్రాకలు మేలుమచ్చులున్
వాడలు వేదులు న్విపణివర్గములు న్వనజాకరంబులుం
జూడఁ బదాఱువన్నె గల శుద్ధసువర్ణము లౌట మెచ్చుచున్.

సీ. పరఁగఁ బిరంగీల బలుగుండ్లకై డాఁగఁ బఱిక లమర్చిన పాఁతరలును
వెలుపటి మంచుతిత్తులు గూలిన యరాబు కొఱకమర్చిన పచ్చిగోడగుంపు
లెవసి మాస్తును లెక్కకెక్కు కుంపెంగఁ దార్చిన కాంచనంపు పంచనపుఁ జేతు

తెమటి సురంగంబు లెఱింగి యా చాయఁగాఁ గల్పించు ప్రతిసురంగముల గములు
ప్రతిబలము ప్రేయు తిరుగుడు జాళ్లకతనఁ, గుమ్మ్మలానిన బంగారు గోపలుపలి
పడిన మగరాలు చూర్ణమై పుడమిరాలు, నీలములచాలుఁ జూచి వర్ణించుకొనుచు. 18

క. ఘోరదశాధార నిశా, చారికృశాంగులను జూచి జడియకుఁ డనుచున్
సారతరదాతృమహిమం, బూర ధరాజాని యభయ మొసఁగుచునంతన్ 19

సీ. కోటవెట్టికి ముద్దుగుమ్మలతో మట్టి తట్ట లందిచ్చు గంధర్వచయముఁ
గనునీళ్లు పులిమికొంచును బానశాలలో మంచు గట్టించు నమర్త్యకులము
మలఁగికొంచును ఫిరంగుల లగ్గములమీఁది కురువడితోఁ జేర్చు నురగగణము
బలిమికాండ్రగు రక్కసులకు సంకెళ్లతో జలకుంభములు మోచు సాధ్యపటలి
విబుధరిపు పాటుఁ జెప్పుకో వెఱచి మత్తి, యపుహజారాన గుసగుసలాడుచున్న
కిన్నరశతంబుఁ గని బుజ్జగించి పనిచి, ననుచు వేడుక తోడుగా నగరు చరిసి. 20

సీ. నలఁగిన మైలచీరలకు మైఁ బొంగారు సిగ్గులు బంగారు నీరుగాఁగ
ముడివీడు నిడుపక్రొమ్ముడుల డాలు శరీర మునకు నల్లని మేలిముసుఁగుగాఁగఁ
బవళించు కఠినభూభాగమ్ముమీఁద నిబ్బరపుఁ జూపులు కల్పపాన్పుగాఁగ
నాఁకటి కన్యోన్య మలసత మైన నాడు మాటలె యమృతంపు తేటగాఁగ
దనుజు చెఱసాల నున్న గంధర్వకాంత, లపరిపాటునఁ దనుఁజూచి బెదరి లేచి
కొంకు సిగ్గులతో మఱుంగులకుఁ బోవ, నిలచి వారలఁ జేర్చి మన్నించి పనిచి 21

క. తోపరాచరాతినిద్దపుఁ, జవికెల తెగల న్నగళ్లచావళ్లను సుం
బవషఁపుఁ గొణిగెల లోగిలి, సవరనికేరులునుదాఁటి చనఁ జననెదుటన్. 22

గీ. పచ్చిదేరఁగఁజిలుక బాబా వజీరు, జగడమునఁ గుమ్మ్మలాడు నచ్చరమిటారి
కత్తెయల వేల్పునెఱనీటు కాంద్రప రూప, ముండు బొమ్మలుగల మేడయొకటిగాంచి.

క. తగురా మగరాసగనిగ, లగురా తొగరాచసాలల స్వప్ననువుం
బిగడాలడా లిటెంతటి, సొగసని తేజీని డిగ్గి చోద్యంబలరన్. 24

మ. చనుచో నాతని కందుఁ గర్ణపద విశ్రాంతంబు లయ్యెంగడున్
వనితా యెంతటి బేల వే నెలఁత మైనం జింతనే చింత గుం
దువకే యంపని భ్రాని పండులకుఁ జేతుల్ చాతురే యైన న
ద్దను జోపంత మెఱుంగు నంతకును గాంతా తాళుమ న్వాక్యముల్. 25

క. అది విని మఱియున్ విని విని, యిదియేమో కాని చూతమిపుడనియవనీ
ధవునేత బూరికోరిక, నవలికి జని జనిత విస్మయ నిమగ్నుండై. 26

కాని నెఱిచూపు నెవ్వరు నగించని నవ్వు బయల్గుఱించి ప
ల్కును గిళిదేరుమేనుఁ గనుఁగొన్నను జక్కఁదబొమ్మయొక్క చ
క్కని మొగవానికి న్వలచెఁ గావలయుం గలయుం దలంపఁగన్. 36

క. బలవంతపు వలవంతలఁ, జెలువంతయు నీసొమ్ముఁ జేసెనో కోయీ
వలపునఁ దగిలినవానికి, దలఁపున లవలేశమైన దయలేదే మో 37

ఉ. వానిదిగాక జన్మమును వారము నీరమణీలలాల య
య్యో నగు బాటుగా నతని యొద్దకు నెచ్చెలిఁ బంచి పంచినం
దానిటు రాక వేఱిమియొనర్చునొ నావలపంచు నించు వి
లాఁకునికిలోఁగి నెమ్మదిఁ దలంచుకొనన్ వలపించె నెవ్వఁడో. 38

క. అవ్వల నొకనికి మీఁదుగ, జవ్వనమిటు గట్టియున్న జలజేక్షణతో
నెవ్వగఁ బలుకులు పలికిన, నెవ్వగ యేకాని చేర నేరవు కోర్కుల్. 39

గీ. ఐన నేమగు దీనివృత్తాంత మెల్ల, దెలియవచ్చుఁగదా యంచుఁ దొలఁగి యొక్క-
లోపమలుఁగున నిలువ నాలోలనయన, జేరి నెచ్చెలి హారాళిఁ జిక్కుదీర్చి. 40

మ. తలపంక్రశల్ మన మీనిశాచరునిచేతం జిక్కి దిక్కేది యీ
యిలఁ గాసిల్లుట గానకేమయినో వారేమైనఁ గానిమ్ము నీ
యొం ప్రాయంబు నిరూఢి కాసపడి వీఁడేమేమి గావింప వ
త్తలుచున్నాఁడో యెఱుంగ మిందులకె యింతీ వంత లేదాయె నే. 41

క. అక్కఁ బుత్రధ్వజభూవరుఁ, డెక్కడ నీవెక్కడే యిదేమిటికే నీ
చొక్కపుఁ జక్కని నెమ్మే, నిక్కాఁటియ కోర్వనేరదే వగయేలే. 42

చ. తలపున నెంతి మోహ పరితాపము గల్గిన దాచుకొందురో
యలయక లేక యీకరణి నంగడి వెట్టెదురో వధూటులా
పలుకవు నిన్నువంటి కులభామలఁ గానవొ వారికాత్మ నా
ఘులపయి బాళిలేదొ తమిబుట్టిన పట్టున మట్టుపెట్టరో. 43

క. తగు లెఱుఁగఁ జేసి కూడఁగ, మగవానికిఁ జెల్లుఁగాని మఱియెంతైనన్
మగువకుఁ జెల్లదు మీఁదట, నగుబాటగుఁ బిన్నపనులనన్ రాదు చెలీ. 44

ఉ. నీమది నింతకోరిక జనించినయప్పుడు యెట్లు కూర్చునో
యేమరుఁ డింక నిన్ను వసుధాధిపమౌళికిఁ గూర్చుకుంద నే
నీమనమంతగా రిపులమే మఱివానికిఁ గానఁగీతిగా
చేమరియాడ తప్పినసతీవిను మొక్కటి సావధానవై. 45

క. మనలం దెచ్చిన యాఁడై, త్వని బాధలఁ గలఁగి మునులుతోఁ దేరఁగన
జనపతి యాతనితో నిదె, యని సేయుచు నున్న వాఁడటంచును వింటిన్. 46

క. పురవనుజ కామినులు కా, తరలై తరళైకహృదయతం గుందుచు నా
తురలై గరళైధిత వా, క్పరతంత్రత మాని యునికి గనుఁగొనుమబలా. 47

క. గావున నృపతిజయించెం, గావలయుం జూడు మెషము కన్నదరు ననం
గావిని పలికిన దానవు, నీవాయని చూచి కామినీమణి కలఁకన్. 48

గీ. యేటి పలుకమ్మ యతఁడు నన్నేల యేలు, తిరిగి సంధించి నన్ను బోధించరాకు
మింత యేమిటికింక నాయించు వింటి, వాని కెక్కిన ప్రాణమే వామనయన. 49

చ. అనిపలుకం ధరాధిప సురాధిపుఁడీసతి నెమ్మనమ్మునన్
ననునెనయం దలంచుట కనంబడె బోటి ఋతధ్వజేశ్వరుం
డని కొనియాడె గాన నటులైనది నిక్కమయ్యెనేని నే
దనువిపుడీ వధూమణి పదంబుల వైవఁగఁ దామసింతునే. 50

శా. నాభాగ్యంబదిరయ్య యీయతివ యంపంబిందు భావించినా
క్షేభంగింగ నయంగఁ గల్గునని యూహింపన్ మనర్థంబుగా
నాభీలాభవ భూరి ఫాలపహనాభానంగ కౌక్షేయక
క్షోభక్షయ్యతఁ జెంది యున్నయది యిచ్చో మెచ్చ వచ్చుంగదా. 51

చ. నముఁగొని తెచ్చినట్టి మునినాయక నిన్ను నుతింతు నోబలా
మునిఁ గొని యాడ నేల పెను మొక్కలిరక్కసి జేనికై కదా
యనుకల ధానవాపహయంబుగ వచ్చితి గాన నింక నా
తని యనదాన మెంచవలదా జలజాలక నిండుఁ గాంచుటల్. 52

చ. ఇపుడిటు కానుపించుకొని యేను ఋతధ్వజరాజనంచు
దట్టపు దమిఁ దెల్పి జాణయగుటన్ జెలి యెవ్వలికేఁగ సిగ్గుదో
రపువగకొంత జారఁగ బరాబరి సేయుచునిందు మారుక
య్యపురుచిఁ జూపి దీనివిరహాంబుధికింగడఁ జేరనిత్తునో. 53

సీ. యీగుబ్బలిఁకమీఁద నాగోటికొనధాటి గదిసిన గజిబిజి గాకయున్నె
యీమోవియిఁకమీఁద నామోము మునిపంటి ఘాతచే నలిబిలి గాకయున్నె
యీదేహమిఁకమీఁద నాదు కౌఁగిలింత వగచేత పసివార్లువాడకున్నె
యీకురు లిఁకమీఁద నాకూర్మిపెనఁకువ, పాటుచేపడిఁ జిక్కువడకయున్నె
చిక్కువడుగాక యేమినా చింతదీర, ననుభవింపక పోనేర నకటయిట్టు

లేల తలనిలిఁ బూవుఁబంటిదిలతాంగి, గానవొకయింతయోర్వదోకద యిదేల 54

క. ఘలి యేటి కోసఁగ లివితో, య్యలిచేఁబేర్కొన్న యట్టి యాతని ననుఁగా
పఁలచితి వేఱొకఁడెమో, యిలలోన బుతధ్వ జేంద్రుఁ డెంపఱుగలరో 55

గీ. జన నొకసాధనం బున్నదా బుతధ్వ, జేశ్వరుండీ పలాశిలో క్షేంద్రుతోడ
నని యొనర్చు చున్న వాఁడన వయస్య, పలికెఁగావున నతఁడకావలయు నేను. 55

క. అన్నిటికిని మంచిదియే, సన్నలతాంగులను డాయఁ జని తద్వచనా
చ్ఛిన్న మకరంద ధారా, భ్యున్నతిఁకిం గర్ణపుటము లొగ్గుటయనుచున్. 56

ఉ. లోవ మఱుంగువాసి జనలోకచసాకరబాకశాసి మై
తావులకంటె మున్న రుచి ధారలు బారులు దీర్పఁగా రతి
స్త్రీవిభు రంభ చుట్టమును జెక్కలి గొట్టు నొయార మొల్కఁగా
నావనజాక్షు లున్న యెడ కద్దరిపాటున వచ్చి నిల్చినన్. 57

చ. కసిహృదయంబు ఝల్లుమన ఘుల్లుమనంగఁ బదాంగదంబు ది
గ్గన వెస లేచిలేనవ యొయారముతోఁ దెరచాటుఁ జేరఁగా
మినిచెలికత్తె తత్తరము మెక్కన గద్దియఁ దెచ్చియుంచ మిం
చిన తమినందు మీఁద నివసించె ధరావరుఁ డావరాత్ముఁడై. 58

ఉ. అంతటలో బుతధ్వజ నరేంద్రుని మోహనమూర్తి మున్న గ
న్నంతయుఁ గన్నులంబడిన నాతఁడు కాడ యతండె యాగదా
కంతుని దాడికిన్ వెరవగా యని డెంపమునందు నెంతయుం
జింతవహించుచుండె సరసీరుహ లోచన బోటి యచ్చటన్. 59

చ. ప్రకట గుణాంక యోపురుష సింహమ నీమహనీయమూర్తి మా
మకహృదయాంబుజమునకు మక్కన నెక్కనఁ జేసె నింకఁగొం
కక కనిపించుమంచు నడుగన్ బనిలేదయినన్ శుభాభిధా
యకమగు నీచరిత్ర మువయంబులకుం దగు నంద మొందఁగన్. 60

చ. బహుతరదేహధామ ఘనబాహు విహారముఁ జూచినన్ మహా
మహుఁడవు గాక యొక్క నరమాత్రుడవేయనిదానెఱింగియున్
సహజపుముగ్ధతాగుణమునన్ వినఁగోరితి గాక నీశుభా
వహన ధురీణమైన గుణవారము నే విను నంతదాననే. 61

గీ. ఓ మహాభాగ నీకథాభ్యుదయమెల్లఁ, దగినచందాన వినినయందాక లేదు
పారవిరహిత ఘోరార్తిజా వారిరాశి, మగ్నమామక చేతోతి మహిమకతన 62

క. కతలయ్యా మావితమా, వెతలన్నియుఁ దెలుపవచ్చు వీనవు వినుమా
జతనమున గుణము లనియెడు, రతనంబుల గని యటంచు దనుజోవచించు మన్. 63
వ. అని చెప్పి మఱియు నెచ్చెలి యిట్లనియె. 64
సీ. అనఘ విశ్వావసుండనియెడు గంధర్వరాజు దుర్గాపుత్రి తాత వెలయు
నతని పాణిగృహీతి హారిణియనుపేరుగారి కాంచినముద్దుగుమ్మమించు
నాయమ్మ సుతులెందరైన గల్గియు కూతు, రొకతె లేమికిఁ జాల సవ్వళించి
యాత్మ జాత నొసంగుఁడనుచుఁ దేవుండనియే, కంటఁ బడు రాత్రికెల్లమొక్క-
నట్టిదకదా వధూటుల కల్గుఁడనుచు, నగవు వగవులటంచు నెయ్యంబులంచు
సంపకములంచు మఱియెన్నియైనకలవు, కాంతలవియుండె మీఁపటి కతలువినుము
గీ. అంతనక్కాంత గర్భాలసాంగియగుచు, నాకుఁ దెలియదుగా యొకనాటిరేయి
నందఱును మంచిశుభవేళ యనుచుఁబలికి, రప్పుడీ యుద్భవించెడు నమ్మఁగనియె. 66.
గీ పుట్టినప్పుడె జన్వనంబును సమస్త భామినీకోటిఁ దలదన్ను పాటిచెలువు
గలిగె దీనికి నదియె దుఃఖములకెల్ల, మూలమైనది యంత నాలోలనయన. 67.
క. అసమాన వయోమదమున, లసమాన కలాదులం జెలఁగఁ జూచిమదా
లసయనుపేరిడె విశ్వా, వసుఁడున్ హారిణియు గారవంబునఁ బెనుపన్.
ఉ. అయ్యొ పరాకు మాప్రియవయస్య యటంచు వచింపలేదు మా
తొయ్యలి వీథిలో నొకపుడో నడయాడఁగఁ జూచెనేని యా
తియ్యని వింటిజోదు శరధిం గదియించిన పూవుఁదూపులే
యెయ్యెడ వైచికొంచుఁ దమి హెచ్చినఁ బోఁ బొరలాడకుండునే. 68.
క. ఏటికి మాటలు నాఁటికి, నేఁటికి మగవాఁడు వలచునే కద వినుమా
బోటి తటాలునఁ జూచిన, నాఁటదివలచు న్మనోంబుజాగ్రమునందున్. 69
సీ. బలవైరి పనిచినఁ బిలువ వచ్చినవానిఁ, గనుసన్నచే నిల్పి కవముఁ బనిచి
మూపుపైఁ గేలుంచి ముచ్చటాడుచు వచ్చు నలకూబరుని మన్ననలు వరించి
నెనరుతోఁ గడునాచి కొనివచ్చు నును గచ్చు టరిగెలవారి నందందునిల్పి
కడువేగ మడుపులు గైకొని యుడిగంపు రాజీవముఖి హోజారమున నిల్పి
కొలువునకునేఁగు రంభ నిచ్చలముగాగ, నగరులోపలఁ జొచ్చి మానాతిఁ జక్క-
దనము వీక్షించి యామెనిద్దంపుఁ జెక్క-, నొక్కముద్దిడుకొనిపోవునొక్క-వేళ. 70
సీ, శచిచేత జంభశాసనున కొక్కొకవేళ స్వారిసరాగాలు జరుగఁ బాసె
రంభచే నల యక్షరాజపుత్రకునకు లలి హుషారుగ వెషలంగఁ బాసె

పార్వతిచే నర్ధపద్మారి మౌళికి నిట్టట్టుఁ బింబంబులెత్తఁ బాసె
కమలచే నీలమేఘశ్యామమూర్తికి గరుడునెక్కి వయ్యాళిగనఁగఁ బాసె
నెంగునన్వసున్వపర్వేందు ముఖుల, చేతనిశ్శేషదేవతాశ్రేణికెల్ల
సపన కోటులలోఁగట్టుగఁ జలఁబాసె, ననఘ మానాతి జాతురో యనుభయమున. 71

ఉ. ఆ వెతలెన్నియైనఁ గలవయ్య మహాత్మ వచింప భారతం
బీరజాక్షి మెచ్చఁ జనదెవ్వరినెట్టి మహానుభావుతే
జోవిభవంబు దెల్పినను జుక్కను నెవ్వరి రూపమెంచినం
దావిననట్లు పోవునొక తప్పుపనుల్ గదియించి యవ్వలన్. 72

గీ. అంత నొకనాఁడు తలిదండ్రు, లనుప భూమిఁ గలవిశేషంబు లీక్షింపఁ దలఁచియేను
లోనుగాగల నెచ్చెలుల్ వేవేలు, గొలువ నిగ్గజయాన యయ్యలకు డిగ్గి. 73

క. ఇందుఁగల పుణ్యభూములఁ, దండంబుఁ జరించి కోకిలాళిమదాళీ
కంపలిత కేళిపాళిన్, దంపనముం జేయ నొక వనంబున విడిసెన్. 74

చ. విడిసినయంత నొక్కదొర వేఁటకు వచ్చెనో కాని కొంచెపు
న్నడగని నెక్కి చేతను గనంబడు నెట్టెము మీఁది డేగయున్
బడలినమోము గువ్వగుబ్బి పట్టుల బాలెడు చూపు మించఁగా
దొడిఁదొడి నూడిగంపుఁ దెగతోఁ జనియెన్ మముఁ జూడఁ డేమియున్. 35

గీ. అతనిఁ గనుగొన్న నేకన్నెయైన వలచు, నమ్మహారాజు మరగవేగాతిశయము
నంది చనలేక యంతంతనరుగువారి, నడుగవారు బుతధ్వజుండనుచుఁ జనిరి. 76

గీ. అతనిఁ జూచినపట యీసుధాంశువదన, యదియనెపముగ రతిదేవియాత్మమదచి
నోటికందియ్య వగకోటి నూటికోటి, యెనె నేర్చి మనోజాతుఁ డింతిమీఁద. 77

చ. అదిమొదలీవఘూటి విరులంటదు కస్తురి గీరుబొట్టు పె
ట్టదు పువుఁదోట రాయదు పటంములు వ్రాయదు వీణచెంతఁ జే
రదు నెనరైన చిల్కనుకరంబున దాలిచి ముద్దటంచుఁ దా
గదియదు కంజకాండ కరకార్ముక కర్మహతాహతాంగియై. 78

చ. చెలులు మొరంగినిల్చి తనచిచ్చెపు గుబ్బలు నాయతీరు ని
గ్గులుగల కేలుఁ దమ్మి కనుఁగొంచు నయోయిటువంటి మేనికిన్
వలదె తదీయచారుతర వక్షముతం బువుఁబంతఁ బోలె నీ
యలసత దీర నిద్రఁ గననంచుఁ దలంచి వితాకురాలగున్. 79

చ. ఎలమి నరేంద్రపాళి తనయింటికివచ్చిన యట్లుగా మది

దలఁపుచు సిగ్గుతో మఱుగునన్ నిలువంబడి వచ్చినాతఁడా
చెలువుఁడు చూడఁ జేయునని జెల్వలిఁ దెవ్వరిఁగాన మేయనం
దలఁకుచుఁ జూచి కల్లయె యనంగను వెల్వలఁ బాఱ దీనయై. 80

సీ. అధిపప్రతాపాగ్ని నరికట్టుకొన్నట్టి, సాంద్రసంగపుఁదోయి కెంపుపసరఁ
బతికీర్తిచంద్రప్రకాశపటలిఁ గౌఁగిటఁ జేర్చు మాడ్కి మేనున బాండిమంబు వెలయ
విభుదానధారాంబువితతికిఁ జోటిచ్చు పొలుపున శ్రమజలంబులు చెలంగ
నాయకస్థైర్యంబు బాయకుండఁగఁబట్టు కైవడిఁ నైశ్చల్యగరిమ మెఱయఁ
గడపట నిజేశు మదిలోనఁ గట్టివైచి, కొన్నగతి సంతతధ్యానగుణము పసర
నమరియుండెను గనిపించినట్టులైన, నపరిపడి లేచుచెలెల్ల నిదురలేక. 81

సీ. తలవాప వెఱచు నీయళివేణి సమరంపసుమబాణపవకాంచనములుగన్న
పెనవెత్త వెఱచు నీబింబోష్ఠి తరువార సుకుమార తతధీర శుకముగన్న
బొడఁగట్ట వెఱచు నీపువుఁబోడి ఝుంకార భారాతిభయపదషట్పదముగన్న
నడుగిడ వెఱచు నీయబ్జపాదసమీప వికటానుభావహంసికలఁగన్న
వెడవిలుతుచేతనగు నలజడియుఁ దేనె, జడియుఁగమ్మని దెమ్మెరల్ తోఁపెఱుజడియు
నలయు నెమ్మెనఁ జలునఁ దాకలపరించుఁ, గలవరించునో కానొక కలవరించు. 82·

క. పొన్నలకుం దెలిజాబిలి, మిన్నలకుం బలుకుఁ చిలుక మేలిమిగలుగుల్
విన్ననగున్ విన్ననగున్, గ్రొన్ననగుంపులకు దిగులుకొని మదిఁ బొగులున్. 83

క. ఈరీతి నారికేక్షి, శారీభారీకృతోక్తి చకితాత్మకయై
పారరహితవిరహదశా, పారావారమున మునుఁగఁబడియున్నయెడన్. 84

మ. తనరెన్ మన్మథజైత్రయాన సుముహూర్తప్రక్రమంబేను పే
యనిశృంగారము భూరుహాళికి రతివ్యాలోల బాలామనో
బ్జనవప్రేమలకుబ్బు మంపలి వధూజాలంబు పాలింటి పి
ల్వని పేరంటము వాసనాజనకమై వాసంతమాసంబిలన్. 85

క. బెడగడరెలతావనితలు, నడతెంచు వసంతరాజునకు నడుగులకున్
మడుగులు వఱచినకైవడి, నడరెడు తెమ్మెరలఁ బండుటాకులు రాలన్. 86

చ. తనరస మెల్లఁ జూపవలదాయని వేళ యొఱింగి యత్తరిన్
గనఁబడు మన్మథాగ్నిమొలకల్ వలె మోసులుగా జనించి యా
మని పథికాంగనాపురుష మంపలి డెందములొంపఁ బంచివే
సినగతి రెండుగాగ విరిసెం దలిరాకు వనాంగణంబులన్. 87

క. తమ కుపమేయస్థానము, కొమిరెల మృదుపాద మగుటకు నైవశ్యక్ర
క్రమ మొదవ సరణి రసా, లములుం గెంపలిరుటాకులం బస రెక్కెన్. 88

గీ. వఱలె వనరాశిలోనఁ బ్రవాళపాళిఁ, గాంచి యీసునఁ బలెఁ బొడకట్టెనట్టి
ముత్తియపు గుంపులను దలంపులు జనింప, తారకతమోనివారకకోరకములు. 89

క. మసలతకూనల మాధవుఁ, డనువుగఁ గూడె నని యుస్సురను వనపద్మాం
గనల ముకుళీకృతాస్యము, లనఁగాఁ దరులందు మొగ్గ లడవిని యయ్యెన్. 90

క. మనసిజుఁడు రోఁజుచుం డి, మ్మను తుమ్మెద నల్ల ప్రజలకై నానా పు
ష్పనికరపరాగవ్యాజం, బున నత్తఱిఁ దేనెకణజము లర్పించెన్. 91

గీ. లతలసొమ్మైన కుసుమజాలంబు లొసయ, నకరువులపేరి యొమ్మెచ్చు పెకలిరాలఁ
దొడిమలకల్లఁ బచ్చిటాతుటుము గాని, పించె ననఁ బసరుఁజాయలపిందెలమరె.

గీ. మన్మథబ్రహ్మమునకు సమానదేవు, నొకని గల్పించి కైకొనరోయి యనుచు
నలవసంతుఁడు గట్ట వ్రేలాడు పసుపుఁ, బూఁతజాలెలవలె ఫలంబులు పెలంగె. 93

క. వ్రాలిన విరిజొంపముపై, రాలినపుప్పొడులు ప్రసవరస మనుముద్ర
గ్గ్రోలుకొనఁ బొలుచుచిలుకగు, ఱాలదు నేదారి కొలుచురాసులపంగన్. 94

సీ. దాఁచఁబెట్టినవా సుధామాధురీధురీణమరందబృందసూనవ్రజములు
కాకాచులా యనన్గళపచేళిమఫిదేళిమచూతపోతావళీఫలములు
సంతరించినవా విశాలమార్దవనిర్దయోల్లూనకదళార్ద్రసస్యవిమ్మ
లస్పృశించినవా వియద్ధరాపద్ధతిప్రౌఢసంచారిసౌరభములు
దొమ్మిగాఁ దుమ్మెదలుమూఁగి తొక్కులాడు
పొగరుతోఁ గీరములు చేరి జగడమాడు
గొంటుగాఁ గోయిలలు చేఁగి కుమ్మలాడు
మొనసి వలితెమ్మెరలు క్రెళ్లి పెనఁగులాడు. 95

సీ. చిలుకబొపనకోలంబుల బందుగులకెల్లఁ గలితామ్రఫలకోటిగ్రాసమొసఁగు
నెలదేఁటి రాచగుంపుల చుట్టములకెల్లఁ బలుకుఁదేనియ పల్లెపట్టలొసఁగుఁ
జలిగాడ్పు కోమటి చాలుసజాతీయములకుఁ దావులసంచిమొన లొసంగుఁ
గోయిల నాలనకొలముదాయాదుల కెల్లకోఁ జిగురాకు నేల నొసఁగు
కొమ్మల నెలర్చు సాలజాలమ్ములోనఁ, జిలుకసాంబ్రాణి తేజీవజీరుఁ డనఁ
దాజెముప్ప వసంతుని రాణువెల్లఁ, గన్నుగట్టెడు కడుపుంజ గనుటకేన. 96

ము. ఎనలెం పస్తోజ విక్కుతేజని జూమాయు...ఁ బల్మాలు ప

ల్వడి సంచద్రసనమొల్క దేఁజెలఁకమేల్వి లైక్క డించంగ న
వ్వైతవిలాక్కనికి దూరదేశగమిక్షోవి శ్లిష్ట్రమోహాపల
జ్జడినాకంపితశైర్ప్యదంపతిహారచ్ఛైత్రాదియాత్రాంతిన్. 97

క. అతజేఁ పమివెన్గలమై, శాతోదరి పొగుల మిగుల జడిసి శకిః
ద్యోతకము లైన చిన్నెల, చేత న్వాఁహ మఱి తెలిసి చెలువలు తమలోన్. 98

సీ. ఆయెనమ్మ యిదేటి యాగడా లిదియేమియెఱుఁగు నిన్నటినేఁటి మెఱుఁగు బోఁడ
యెఱుఁగునా యనఁగూడదిప్ప డిప్పుడు కొంత గడిదేజెంతే వలకారినగల
గడిదేఱ కింక నెన్నఁడు మంచిముగవానిఁ గోరెాచు జవ్వనం బూరఁజేయ
జవ్వనం బౌనెకా చవువుకొన్నది గాన మనసు నిల్పఁగలేక మురులుకొనియెఁ
జెలువ యీబాము లనుభవించినను గాని, తెలియదే ప్రేగులోపలి తీఁట వాంటి
వలపుకసికోఁత లిపుడగవారి కైన, వలదుగా దీని కిపుడేల వచ్చెనమ్మ. 99

చ. తపఁబడు మాట గద్గదిక చార్క్యము నిశ్చినవోట నిల్వరా
డడుగులఁ దొట్రుపాటు గదియంబడుఁ గంపము చెంద నిద్ర రా
దెవపని కోర్క్య హెచ్చు మదిసేమొ విశావిత జాలిజాలి యకా
నడిగినఁ జెప్పఁగూడ దకటా మరులెత్తిన యాఁటదానికిన్. 100

క. ఇవి యన్నియుఁ జెలులారా, చివురాకుం బోఁడియందెఁ జెలువొందెడు ని
క్కన మింలకు విరహామహో, వన మేకార్ణవము మీఁదఁ వగ వెయ్యదియో! 101

మ. అతివా యింతకుమున్న నన్బిలిచె డాయంబోయితిం బోయివ
చ్చితివా యంచనె నేప కంటి నదెరాజీవాక్షి యే లెస్స వేఁ
డితిఁగా నిన్ననె నేటికే చెలువ యంటి న్నాపెత ల్నికను స
మ్మతమా యన్న వితాకురాలయితి నమ్మా కొమ్మ యమ్మాటకున్. 102

క. అని పట్టుసేయు బోఁటులఁ, గనుసన్నలఁ గదపఁ బోవఁగాఁ బనిచి ననుం
జనవిచ్చి మనుపఁ గావున, నెనసినతిమి వనితఁ జేరి యే నెయ్యమునన్. 103

గీ. వచ్చి తపవాయెఁ గద మహీపాలయమహిపుఁ
జూచిన మ్లానయెఁ గద యింక శోభనాంగి
హానవలవ దె మనఃపురంబునకు మగిడి
తల్లిదండ్రులు కడుఁ దల్లడిల్లనుంప. 104

క. తెలిసె నిఁకఁ గొన్ని నాళ్ళ, యిలఁగల చెలువములు చూపె నిచట నె నిలువం
బలఁబినకైవడి నున్నది, చెంగవా యది లెస్స యన్న చేయుట మేమి? 105

క. అనినమ్మఁ జూచి తలవాఁ, చిన డగ్గుఱఁజేతి యేమొ చింతాసంతా
పనిరూఢిఁ జెందునంతము, గనఁబడియెడు నిట్టు లౌనొ కాదో యెఱుంగన్. 106

చ. సరసిజగంధి నీమది విచారము దోఁపఁగ వేఱొకండు లే
దరయఁగఁ గారణంబు నవయౌవనరూపకలావిలాసభా
స్వరుఁడగునట్టి యొక్క మగవానివయిం గను వైచి తేమొ దు
ష్కరతరచింతచే నదియొ కానలయుం దలపోసి చూచినన్. 107

మ. బలభిన్నీలకచామణీ యిదియుఁ దప్పా కాంతులంగోరి కాం
తలు చింతింపరొ కంతుకుంతముల వంతల్నింపరో లేక నీ
తలనే పుట్టెనె యైన నేరమొకొ చేతత్కార్య మాద్యంతమున్
దెలియం బల్కకయుంట నీవలన నింతీ యంత నే వింతటే. 108

క. నావంటి బోఁటి గలుగం, గావగదఁగ నేల యెంతకార్యం బైనన్
నీవే కానలె నన్నుం, దైవకటాక్షమునఁ గరగతము సేయ నటే. 109

చ. అనవిని యాలతాంగి నగవాననతిలన్ననుఁ జూచి భావవే
దినివి గదమ్మ నీకు నిఁకఁ దెల్పకయుండఁగ నేర్తునమ్మ నీ
యనవు మదీయఘోరవిపదబ్ధిఁ నోడ గదమ్మ వాఁడిమై
నొనరిన కంతుతూపులకు నోడఁగదమ్మ యిఁకన్ వధూమణీ. 110

గీ. నాతి యెఱుఁగుదువా యల్లనాఁడు డేగఁ, జేత వహియించి చిన్న తేజీదువాలిఁ
గాఁగఁ దోలుచు నీత్రోవ గానె చనియె, నామనసు వానిమీఁద నె నాటెనమ్మ. 111

చ. కలకల నవ్వుమోము పురిగట్టిన నెమ్మియి నూగునూగు మీ
సలు నవరంజిడా తెగుబుజంబులు చక్కనిముక్కు తేటక
న్నులు నిడుసోగకన్బొమలు నెక్కిన గ్రక్కునఁ బాలుగారు చె
క్కులు నసుమంతకాను తళుకుందొవలాన్పరమాళికే తగున్. 112

క. కనమో వినమో ఘనమో, ఘనమోహనమోవకారికచ మగవానిం
దినముం భువనంబుల నా, మనము స్మరియించువాని మతిగంటి మటే. 113

గీ. వనజలోచన నేనుగావలసినట్టి, దానవై తేని నెటులైన మానవేంద్రుఁ
గూర్చి నా ప్రాణ మిపు డెత్తుకొమ్మ లేని, పక్షమైనను నామీఁది బాళివిడుము 114

క. అని పలికి సొమ్మసిల్లినఁ, గని దీని మనంబు తెలిసెఁ గద యిఁక మీఁదన్
మనసిజుఁ డెదయుండు శరమే, సిన నేమగునో పరాకు సేయుదమనుచున్. 115

గీ. ఎంతలే దింతి యిఁక లెమ్మ నంతవేఁ, యింతులకు నట్టి యొడఁబాట్లు నొంద మబ

యప్పుడు నీచిత్తమే వచ్చు నిపుడు వట్టి, మాటలాడినఁ గలవమ్మ మానుమమ్మ. 116
క. కొమ్మలకుం బురుషులకుం, గమ్మని విలుకాఁడె వేల్పు గావున నతని
న్నెమ్మదిరాఁ బూజింతము, రమ్మీ యలకేళివనికి రాజీవముఖీ. 117
క. అని పలికి యేను నెచ్చెలు, లును మచ్చికఁ హెచ్చనీవిలోలేక్షణఁ దో
డ్కొని వచ్చి కుసుమవిస్మరు, ననిఁజొచ్చి రసార్ద్రవచనవైఖరి దెరయన్. 118
చ. అలవడఁ జంచలాలియుతమై సుమనోహరచాపహార్యవ
ర్గలగతిమించి పాదపవికస్వరవైభవహారియైన యీ
యలఘువనోల్లసత్ఘనమహత్వము నేమని చెప్పవచ్చునో
లలితలతాంగి కామితఫలంబు లొసంగుచుఁ బ్రోవుమనంచు వేఁడెన్. 119
మ. పొలఁతీ యోపొన గున్నపొన్నవిరికిం బూఁదేనె బల్కాల్వగా
యలరన్ సారెకు నెక్కుచుం దిగుచు నాలై దుమ్మెద ల్మించె ని
చ్చలపుం జాయలతావిజాజివిరి సేజాజోడు నైకొన్నక్రొం
దలుకుం బచ్చలమేడఁ దాకు జలయంత్రంబోయనంగంటివే. 120
మ. సరసాళుల్నిజగంధమానుచుఁ జరించంగుం భినీజాతము
ల్వరుసం జుట్టుఁ జెలంగుచుండఁగ మహావాలంబుకుంజాస్తిచేఁ
గర మొప్పార సుధాప్రభావమఘువుల్గ్రాల న్వివాదాహతిని
స్ఫురితంబై విలసిల్లె నోయబల యీపున్నాగముం జూచితే. 121
చ. అరవిరివెండిచెంబుల నయంబునఁ దేనియపానకంబు లేఁ
బరువగు గుజ్జుమావి చలిపందిరుల న్లతకూన లియ్యఁగా
నరుదుగఁ గ్రోలియు న్మనసిజాస్త్రిగుణస్థితిఁ గండుఁదేఁటి ని
బ్బరమగుబాళిమై నధరపల్లవమంటుటఁ గంటివే చెలీ. 122
చ. హితగతినిందు బింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁదగు కైరవారముల గర్వము మించె వధూటి కంటివే
హితగతి నిందుబింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁదగు కైరవారముల గర్వము మించుట చోద్యమే చెలీ. 123
చ. తనతను వెల్లగాఁచికొని దక్షిణమారుతచోరకుండు నే
ర్పునఁ జనుదెంచి తావిఁగొనిపో వనదేవత హెచ్చరిల్లి కో
యని పెనుఁబోటుఁగూఁతలిడునట్టిగతి న్విననయ్యె వింటివే
యనుపమగాత్రి కోకిలకులాకులకేళి కుహూకుహూధ్వనుల్. 124

గీ. మేలిమితేనియ నిండిన మెట్టతమ్మిఁ, జేరి కొలనడి పుష్పాళిపైకి దక్ష
పోసఁగ నవ్వలిక్రొవ్విరిపురుటియిల్లు, వింతగాఁ జెందెఁ దేఁటి బాలెంత కంటె. 125

క. అనియాలివితతకేళీ, వనపాళీగరిమ మెూలి నర్తించుచుఁ గ్రొ
న్ననసుంపుఁ జిసుము వేడుక, జనియింపఁ గడంగి సరససల్లాపములన్. 126



ఆతివరో చూచితె యలరెడి మావులు—జతగూడిన వివె చల్లనితావులు
ఏలకిపొదలివె యిటు రారాదటె—యేలపోయె దవనింతనె వాదటె
చాలువాలు నీసంపెగ మొగ్గలు—బాలకంటివే పాదిరి మొల్లలు
నెలఁత రాఁగదే నిమ్మల నీడకు—నలుక నేలనే యంతటి ప్రోడకు
ఎగిరి పడఁబడెనే యాకంకేళికిఁ—జిగురుచాలదే చెలి నీకేలికి
నాసలేటికే యంపని పొగడకు—వేఁటలే కీవిరులనె పొగడకు
పడఁతి రావె నా పాలిటి పొన్నకు—ముడివిడెరో సము మొన్నటిచిన్నకు
వాసంతికకై వచ్చెను చిన్నది—వాసమొసంగని తొయ్యలి నవ్వదు.
యీవిరవాదుల కేటికి ముచ్చట—తావులవిరికే తలుపుకు మిచ్చట
నెఱసిన విరికంటివె వాసంతులు—యెఱుకలేదె నీకేటికి రంతులు
పొదలినపచ్చటిపుష్పాళితిన్నెలు—అదిగొ కొనిరే యప్పుడె కన్నెలు
తెలవ దాఁటితే తేనియకాల్వలు—వెలదిరి నేఁడీవిద్యకుఁ జెల్వలు
సరసను మొలచెను జాలుగ మొల్లలు—దొరసెను నచ్చటఁ దుమ్మెదపిల్లలు
బొండుమల్లెలివె పొలఁతిరో మెచ్చితె—వండలు కదు వింతలుగా గ్రుచ్చితె
పలుకక కోయిలపదువులు మూగెను—బొలఁతి వెలచితే పూఁబోడ లోఁగెదు.
వెలఁది చూడు కురువిందలయందము—కెలఁకులఁ గడుఁ దొరఁగించె మరందము
సురపొన్నల కీసున వెన్నాడకు—తరుణి వెలుతు నిత్తువె నన్నాడకు
కోవిదారములకును వాదేటికి—నేవఁ గయ్యముల కేగెదు మాటికి
వనితలు బడలిన వగకనిపించెను—గొనకొని తుమ్మెదకోపములుంచెను. 127

వ. అని పుష్పాపచయంబు గావించి చాలించినంత. 128

క. మధురిమధురీణసవిధవి, వినమాధవికాప్రసూనవిస్ఫురమరం
దధునీమిథోవిహృతిమ, న్మధుపసధాళింవమందమారుత మొందెన్. 129

ఉ. మానవతుల్గనుంగొని రమంచమపంచనవారవింపబ్బొ
దానుసరన్మిళిందనికరాంధుకబంధురగంధసాంద్రమం

దానిలమత్త సింధురవిహారవిలోలతరంగజాలడో
లానిశఖేలనాకలితహంసము నొక్కసరోవతంసమున్. 130

వ. ఇత్తెఱంగునం గనుంగొని జలమానవకుమారు లెమ్మెలకై చిమ్ము క్రొమ్మెఱుంగుజము
దాములపెక్కునం దళుక్కున నెగురునిడువాలువాలుగుపిల్లలకై నికటతటతరు
పటలశాఖాశిఖానికరంబులనుండి దుముకు లకుముకులగుంపులం బెనుఁగు మరు
త్తులం దొలఁగు సరాగంబులగుపరాగంబులందగిలి యరవిందమందిరకుం దార్చినగం
దవొడియఱపెట్టెలదంపంబున నీటనుచ్ఛలితతరఘాంగంబు లగుతరంగంబులసందున స
దభ్రవిభ్రమంబునం దిరుగుజలభ్రమంబులం దగిలి నిగనిగనికెంపురాలు నింపిన గో
ముగను వామనగుంటలం దలపించుటకు శిరఃకంపనంబు సేయుచు జలబిందుసందో
హకంపలితవిచిత్రశతపత్రపత్రసమావేల్లితం బగుహల్లకంబు వారిదేవత కెత్తురకత
పాత్ర మౌక్తికారాత్రికంబుల డంబువిడంబింప నందులకు సోబనాలువాఁడు మ్మత్తె
చువులచెలువున మ్రోయు తేఁటినీటుకత్తియల తేటపాటలకుం జొక్కనో
యన నాయకులతోడిపాలయలుకలం దొలంగి చని వనజకుడుంగంబులం గపటని
ద్రాముద్రితలై చలితజలాంబులికలు సోఁకిన నులికిపడి యనునయింపం బతు లేతెం
చిరని బయలుజంకించు నీటుకత్తియల తేటపాటలకుం జొక్కనోయన నాయకు
లతోడి పాలయలుకలం దొలంగిచని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చ
లితజలాంబులికలుసోఁకిన నులికిపడియనునయింపం బతు లేతెంచిరని బయలు జంకిం
చు జక్కవమించుబోఁడుల యలక్ష్యబహుతరాక్షేపంబుల పెల్లునకుం గొల్లున నవ్వ
చుఁ బుఱ్ఱంటిసాది మన్వంపునవిగేరు మారుతమానవుండుం దీరసంచారిశిఖావళికుమా
రికాకేకారావంబు లను గద్దింపులం జళుకు వొడమించి నవదిక్తువాసం బర్వినరజం
బువిధంబున దుమారంబుగా నుప్పరం బెగయు పుప్పొడిపేరింట నుల్లసిల్లు నుల్లస
నీపలపీడుజోడాడు వేడుకలఁ గమలినీకమలబంధుపాణిగ్రహణంబునకుఁ గులదేవతల
నెదురుకొనుచదురన లజ్జించుచు పుటసమంచితసకోరకబిసాగ్రపాలిక లగుచు వచ్చు
మరాలికాబాలికలకలకలంబులసంభ్రమ్మికొని తమ్మిమేడలెక్కి పెక్కువగల జొబుచి
కొమ్మలసందునం దొంగిచూచు మధుపావరోధ వధూమణుల మిథస్సమ్మర్దకల
కోలాహలబాహుళ్యంబులకుం దగవు లూహించుచు నాళీకముకుళంబులను కలశకు
లంబులం బరిశిష్టించి నిష్టాసంపదం గలహంసదంపతులు పరిణయసమాగమంబునం బు
ణ్యాహం బాచరించి యెదురు నూడం బొడసూపిన యజ్ఞాతప్రభాతం బగు నిశాస
మయంబు విధంబునం దనరు పరిసరతరుచ్ఛాయామాయాంధకారంబునకుం దిగులువ

డి యప్పటప్పటికి వికసితాంబుజంబులం గనుంగొని యవియు ముకుళింపమిం బొంను రథాంగకామినుల వినోదంబులకు ఖేదమోహంబు లనుభవించుచుం జెంగటం జెలంగు చెంగలువబావులపై నంకించిపాడుతుమ్మెదల తేఁటిజక్కవలవారియాలాపంబులనం బరిఫుల్లసరోజం బనుకామిల్లిచేయువఁ బరఁగు వికసితప్రసవపరాగపరంపర యనుపరికిముగ్గుల పగ్గెల సంపం బగుమందమరుదాందోళితేందీవరముపైనుండి శివమాడు సారసచరార్థోహలకు సమీపంబున శైవాలకలాపంబు లనుధూపంబులర్పించుచు మూఁగికొని యాగామికార్యంబు లడుగునమ్మలక్కలచందంబునం బొసంగు నానావిధజలవిహంగమాంగనావ్యూహంబున నుత్సాహంబుఁ బొందుచుఁ గమలాకరాభిధానంబుగానం గంకణవిరాజమానంబై పుష్కరస్వరూపంబు గావున రాజహంసకలాపంబై శోభితతరంగవిశాలంబు గావున శైవాలప్రముఖానుకూలంబై సారంగవిలసితంబు గావునఁ బద్మకరేణుభూషితంబై యొసంగుటకు నంతరంగంబున నానంద మందుచుం జేరి. 131

సీ. నాదు మోమును నొక్కనయసువారలు గాన నవిప వారికి మోము నుద్ది యనుచు
నోపిసదానిపై నొడిసిన సేలికసాని పాదములపై నాన యనుచు
నాజతతో నేకాంతమాడితివి మాగుంపులో నీవుండఁ గూడ దనుచు
నంటిమి గాక మర్యాదతో నిల్చినే యప్పటికైనయట్లుగు నటించు
బాలయులనాఁడు నామీఁద నోలపెట్టి, తెచ్చనిఁకమీఁదఁ జరియింపుమీ యటంచు
నంతు కేమాయెఁ గాని లేనమ్మ యనుచుఁ, బలికికొంచును దెగలుగాఁ బంచికొనుచు.

మ. మొలఁతల్ తుమ్మెదకంటుకమ్మవిరియన్నీపానుపామాను మా
టలతిబ్బిబ్బల కుల్కికీలుజడఁ గొట్టం బూను జేజేలయొ
జ్జలయిల్లాలని వ్రాసినట్టి వలువ ల్చాలించి యచ్చంపు ని
చ్చలపుంజందురుకావి పావడలు మించన్ ఖేలనాలోలలై 133

గీ. డాసి దరి నిల్వ వారినీడలు పాసంగె, నీటిలోఁ దమ్మిమేడల నీటు రోసి
తన్ముఖాంభోజముల నిల్వఁ దలఁచి వచ్చి, పద్మ తాల్చిన విశ్వరూపము లనంగ. 134

చ. సుదతులు బంతిగాఁ గొలనుఁ జొచ్చిచనంగఁ గ్రమక్రమంబునం
బదములు ముంచి పెంకొనలఁ దైకొని పొక్కిటి నాఁగి చక్రసం
పదలు సహింపలేని కుచభారము లోఁగొని కంఠదఘ్నమై
తుది నటుం మించె యొయ్యనలతోయము కింబులు నాఁగి మించుటన్. 135

మ. కొల నయ్యింతులు సొచ్చినంత దరగి సోఁకుల్ పొచ్చిన న్నీఁగుఁద

మ్ములపైఁ దేఁటులు వేఱుతామరలపై మూఁగం బదియాళిరే
ఖలు వాటింగదుమంగఁ బద్మినికి రేఁగం జక్కవ ల్దాఁటు లె
క్కలఁలేఁ దెమ్మెరపుష్పవృష్టుల్ చపలనాఁగం జిత్రమయ్యె న్నదిన్. 136

చ. చెలువ యొకర్తు క్రొంబసుపుఁ జెందొవ బిట్టెగరంగనైన న
య్యలరు తపంజలిం బడుట యద్భుత మయ్యె మదీయపద్మరే
ఖలఁ జెలరేఁగి గాసియుపఁగాఁ బగునే యని యేసుదెంచి చే
తులపయి వ్రాలి వేఁడికొను తోయజబాంధవబింబమోయనన్. 137

గీ. సారసుచశైలమథితకాసారజలధి, నప్పడప్పడు వొడము నర్ఘ్యరాశికరణి
నొకతె కాంతాపమించి వెల్లకిల నీఁద, నమరె ముద్దులుగారు చిన్నారిమోము. 138

చ. ఎలమి నొకర్తు వెల్లకిల నీఁదఁగఁ జుట్టును గల్వపొగ్గుల
గ్గలముగ మించెఁ జన్నుఁగవకాంతులు గన్గొనవచ్చునయ్యెరా
జ్జలరుహగంధి పంపఁ జేరిచారికలచ్చట ముద్దుగాఁగ బొం
దులుగని నైచు గూటములతోడి కదానిసుడాదము ల్బలెన్. 139

గీ. మొగము మాత్రంబు కానరా ముద్దుగుమ్మ
యొకతె నిలువీఁత యీఁదెఁ జెన్నొందెఁ గురులు
నీరజాకరమనెడు మున్నీటిలోఁ గృ
పీటములు గ్రోలు మేఘంబు పిల్లయనఁగ. 140

క. బోరగిల నీఁదు నొక్కఁతెమి, టారి విశంకటకటీతటంబొప్పారెన్
సారతరాపరపారా, వారాన్వితమైన భూమివలయం బనఁగన్. 141

గీ. బాలికలు మేలి జీవనురాలనుండి, నీటికై జారు సౌరు వర్ణింపఁదగియె
నలమరాళసపై నడరంట సేయు, నలనళిలు కాని నుడుదోనియమ్మ్రఁగ. 142

సీ. చనుఁగవమీఁది చందనము చెందినచోటు వెలివమ్మిపుష్పౌఘు గ్గలసికొనఁగ
మొదల కుంకుమచర్చ మించి మునిచినచోటు చెంగల్వవిరిగుంపు చేరికొనఁగ
సారసూనుదుటి కస్తూరి మీఱినచోటు తేఁటితేజవరాంద్రము మాటికొనఁగ
నెమ్మేనిఁ బసుపువన్నియలు పన్నినచోటు నవకంపుటకరులు నాఁచికొనఁగ
జెలువ లీరీతి నీరాడి కొలను వెడలి, తమముఖాంభోజముల నిండు తావిగ్రోలఁ
దేనియలు గ్రాయు కన్కఁతిశాతేటులనఁగ, జలజకణములఁ గీలుగంటలు సెలంగ.

చ. తటమహిఁ జేరి యంతట మదాలసకుం గయిసేసి తాము న
క్కుటమణి భూషణావళులు దాల్చి యొటిపరాకులన్నయి

క్కుటిలకచా శిఖామణికిఁ గోరికలిచ్చు రమాకుమారు నె
క్కటిభజియింపకున్న నిది కార్యముగా దని యేగి యవ్వలన్. 144

చ. చెలువగు పూఁబొద న్వలపు చల్లెడు కస్తురి తిన్నె యందుఁ గెం
దలిరుపంరగిపీఁట పయిఁ దామరతూఁకునఁ జెంతనున్న నె
చ్చెలి మొగ మోరసేయ రతి చెక్కులు నొక్కుచు మోవి యానుచున్
గలరవ మిచ్చు పచ్చవిలుకాని లిఖించి సఖీశిఖామణుల్. 145

చ. అలిగిన మ్రొక్కి చుక్కజవరా లదలించుచుఁ గాలఁ దన్నినం
బులకలు దాల్చు చందురుని పొంకము వ్రాసి వసంతు మత్తకో
కిలములఁ దేఁటులం జిలుకగేస్తులఁ దెమ్మెరయాకతాయలన్
నిలిపి యమర్చి తెచ్చిన వనీకుసుమంబులు కుప్పవోయుచున్. 146

క. పూజించి చిలుక ముక్కు, తేజీవారఁ గూర్చి వికచదీవ్యద్గంగా
రాజీవ నవమధుద్రవ, రాజీనరవై ఖరీపరంపరదారయన్. 147

మ. హిమరుగ్బాంధన మంత్రహీనము క్రియాహీనంబు సద్భక్తిహీ
నము మత్కల్పితమైన యీనిఖిలనానానూనపూజావిధా
నము సంపూర్ణముగాఁ దలంచి దయనానందింపు నీవంటిదై
వము చిత్తంబున మెచ్చినం గలుగలేవా మన్మనోభీష్టముల్. 148

గీ. అరయ హరునంతవాఁడు త్వద్గురుశరాగ్ర, దళితపురదర్పుఁడై మహోదరముతోడ
నబ్జశరపాలిఁ గని మాళి నావహించు, ననిన నీశౌర్యసార మేమనఁగవచ్చు. 149

క. దైవం బనిన న్నీవే, దైవము గాకింక నొకఁడు ధవళాత్ముల నా
శీవిషవిశిఖ శిఖార్తులఁ, గావింప న్వరులఁ గూర్పఁగా నెవ్వఁడిఁకన్. 150

సీ. వేఁడి యొరాఁగదవయ్య విహితశైత్యాంధమంథరగంధవాహస్తనంధయంబు
వాఁడి యొరాఁగదవయ్య వనజాతిసహజాతి మార్దవనవకౌసుమవ్రజంబు
చేఁదుచూపుఁ గదయ్య జితసుధామాధురీసారకీరారావగౌరవంబు
వింతసేయుఁ గదయ్య సంతతాత్యంతపోషితహంసకాంతానిషేవణంబు
కామినీకాముకులకు యోగప్రసక్త, దక్షమగు నీకటాక్షము దప్పెనేని
గాన నిను గొల్చువారిచే కౌశలంబు, భనజయోన్నిద్రతారిణ పంచబాణ. 151

సీ. పీటిఁబుచ్చవె దాసవిభుకన్యఁగను బరాశరమానివరుసదాచారగరిమ
బైటనైనవె బృహస్పతిభార్యఁ గనుఁగొన్న తారకాకామినీధవుని గుట్టు
నగడుసేయవె యహల్యాకాంతఁ జూచిన యమరలోకాధినాయకుని నడత

కొడవ వౌనర్పవె కూర్మికూఁతు నీక్షించి యుబ్బినపద్మసంభవు పెద్దతనము
భూరిభవ యమ్మచెల్లగా నీవుచేత, నేఁజ బట్టిన నెవ్వారు నిలుచువారు
నారమునే నింతయేఁచిన యాఋతధ్వ, జేంద్రుఁ జెనకంగఁ జాల పదేమొకాని. 152

క. మారామపట్ట నీసుమ, మారాజచ్ఛరము దాఁపుమా రాజ యిదే
మారాటమునకు నోర్వను, మారాజముఖీమణీకుమారా మారా. 153

క. అని మఱియ యప్పుడు మగుడం, బనివడి పొగడె న్మధ్యాంగపాంథజిగీషా
తనుతత్తురంగహేషా, ఘనతరఘోషాప్తి యొసఁగఁగాఁ గలఁగుటయున్. 154

శా. చీనాచక్కోర ఘ్రాణపుంబులుఁగుఁ దేజీజోదుకేదంగి బ
ల్మానాకత్తికిఁ దత్తరిల్లి నవలా సాయంసమారంభవే
ళానాళీకని లీల సౌమ్మసిల బాలాపాలికల్ చంద్రకాం
తానర్ఘాంతిక వేదిఁ జేర్చి బహుచింతాకంపిత స్వాంతులై. 155

సీ. మదనుగుణవ్యక్తిఁ బొదలెడు తేఁటులే మంచకింకను ఝుంకరించఁ దొడఁగె
మానసప్రేమ యేమఅని రాయంచలే మించికొంకక హుంకరించఁ దొడఁగె
సహకారవృత్తిచే జరగు రాచిల్కలే కొంచకిక్కడ వెక్కిరించఁ దొడఁగె
ఘనమైత్రిచే నెమ్మిగను నెమ్మిగుంపులే ధృతియింకఁగా హుంకరించఁ దొడఁగె
నేమిచేయుదుమే బోఁటి యింక నేటి, మాటలే పోటుమరునకు మగువమీఁద
నింతపగయేల బాలవాఁడేమి చేయు, మనలపాపంబు పాలియింప నను మఱియు.

ఉ. కొమ్మ చిగుళ్లు దెమ్మ లతకూన విరుల్గానిరమ్మ పద్మినీ
తమ్ములు గొంచురమ్మ వనితామణికి న్ననశీతలోపచా
రమ్మొనరించవన్న పలరాయని రాయడి నేమి పుట్టునో
యమ్మక చెల్ల యింకఁ దడయం బనిలే దని సంభ్రమంబునన్. 157

సీ. అడుగునఁ బవ్వైచి రని దళం బెత్తునో నెత్తమ్మి పదముల నిలుప నేల
యంకంబునకుఁ దార్చి రని పొరవిచ్చునో యనఁటు లూరుల చెంత నునుప నేల
యధరభూమిని నిల్పిరని మొనచూపునో చిగురాకు కెమ్మోవిఁ జేర్ప నేల
యంబకమ్ముల నుంచి రని యెత్తువాఁటునో హల్లకంబత్తుల నలమ నేల
యిచట సమవస్తుసంయోగమేల యమ్మ, యిదియుఁ బగవూనె నేని నీయిగురుఁబోఁణి
తాళలే దమ్మ మీ నేర్పు చాలునమ్మ, తరుణియివి యెల్ల మదనసాధనములమ్మ. 156

క. అనుచుఁ బెనఁగొన్నతత్తర, మునఁ దగు శిశిరోపచారములు చేయుటయుం
మనసిజశిఖి బ్గ్గరమున్, నెనరునఁ బత్సఖుఁబగుం డె నెన్దుకమూఁగన్. 158

సీ. తనులతమీఁద జివ్వననికి మిహికాంబుకాండ మెంతయు నిరాకార మయ్యె
నఱచేతిపైఁ జుఱచుఱ గ్రుక్కియుంపంగఁ గెందమ్మి పుష్కరాకృతి వహించెఁ
గలికి కన్నులమీఁదఁ గమలిన పరువంపు నవగుత్తు లరయ సూనంబు లయ్యె
మినుకుఁ జందోయిపైఁ దునిసి మౌక్తికరాశి తిలకింప ముత్తెంపు తెరలువ్రాసె
బళిర యివియెల్లఁ దమపాటు దలఁప కిప్పు, డంగజాగ్నికి సాహాయ్య మాచరించి
కొమ్మపై వేఁడి చూపె నాకమ్మవింటి, యెమ్మెకానికి విజయకాలము సుమ్మ. 158

గీ. అదియుఁ గాకింద్రుఁ జనుదెంచునపుడు తమ్మి, విరులపగుకమ్మదెమ్మెరల్ వీచెనమ్మ
వైకొనక వచ్చినంతయుఁ గంటిమమ్మ, యబలనిందుండనీయరా దమ్మయను మ. 160

క. ఇందీవరలోచన లిం, దిందిరకచ సేవదేర్చి తెచ్చిరి సుషమా
కందళితైందవరుచిగరి, మందిరమగుధవళవసనముందిరమునకున్. 161

గీ. ఇట్లు చెలువలుదోడ్కొని యేగుదేర, నంబుజాననతనగు డారంబుఁ జేరె
ననిన జైమినిముని యావిహంగములన, నంతర కథావిధం బెట్టిదని యడిగిన. 162

శా. లక్ష్మీశోపమ వీరవేంకటనృపాలశ్రీమహారాయ ద ✓
త్తక్ష్మామండల మండనాయిత యశోదామాభిరామాఁశుస్నీ
రక్ష్మావర్తన కార్తికీకుముదినీప్రాణేశ చారుప్రకా
శక్ష్మాభృత్ప్రతిపక్షభూమిపతియోషాలోచనాంభోరుహా. 163

క. ధాటీఘోటీఖురఖుర, కోటీపాటితవిరోధికుతలపతిశిరః
కోటీరహారశకలవ, ధూటీనవమదన విభవధూర్వహసవనా. 164

పంచచామరము.

వదావదాహిభోగిరత్న వర్ణవర్ణితక్షమాం, గదాగదాసిమద్విరోధిఖండనాత్తలోకస
మ్మదా మదావళారివిక్రమస్ఫురద్వృశఃకలా, పదాపదానవద్రుమలోకపారిజాతవైభవా.



గద్య.

ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయా
భరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మా
నసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజి
తచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనా
యకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరాజద్వేంకటగిరి, శౌరిపదాంభోజభజనజనితోజ్జ్వలతో
దారవిభవేంద్ర సవరము, నారాయణభూపచంద్రనయగుణసాంద్రా. 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
నమ్మదాలస పటకుటీరంబుదారి, కమ్మతావులతెమ్మెరల్ గ్రమ్ముదారి. 2

క. వనిసొచ్చుట మరునకున, ర్చన లిచ్చుట సొమ్మసిల్లి సఖియలవలనం
గనువిచ్చుట వారచటికిఁ, జనుదెంచుట యెఱుఁగలేక తన్మయదశచేన్. 3

సీ. మనవులు విన్నవించిన వినునో యంచుఁ జేరుకన్నియమిన్న చిన్నఁబోవ
ననబంతి కానుకిచ్చినఁ జూచునో యంచు వచ్చునెచ్చెలి తలవంచికొనఁగఁ
నెనరుతో హెచ్చరించినఁ బల్కునో యంచుఁ గదియు పైపలి సిగ్గుగాంచి యొదుగ
గసపించి జాతిచెప్పిన నవ్వునో యంచు నరుదెంచుహరిణాక్షి యవలి కరుగ
వినక చూడక పలుకక వేదనాప్తి, నవ్వాకాపద్మనయన కాంతవశరాగ్ని
తప్తకిసలయముక్తనూతనపునఃప్ర, వాళకృతశయ్యఁ బొరలాడు వేళ యందు. 4

ఉ. ఈవనజాయతాక్షిఁ దరుణేక్షుధనుష్కతురుష్కమాళి యా
హావెతవెట్టెనంచు హృదయార్ద్రదయాభ్యుదయాప్తి చేత రా
జీవశరప్రహారగతిఁ జెందుట తెల్పఁగ నేగె నాఁగ గం
గావిభుఁ జేరెఁ గింశుకనఖద్యుతిఁ జొత్తిలి మిత్రుఁ డయ్యెడన్. 5

శా. ఛాయాప్రాగవకర్షణంబు సరసీజాతాంతభోగంబు కా
లాయానీకపతంగపాకపితృజాలప్రాప్తిపాంథప్రజా
స్థేయస్థానగతిప్రబోధకము దూతీప్రార్థనారూఢజా
రాయత్తంబు జరన్మహాతప ముదారంబయ్యె నంతంతకున్. 6

చ. వడి నపరాద్రిఁ జెంద నని వాసిగఁ బద్మిని నెత్తిమీఁదఁ జే
యిడి కరసంగతి న్నమయమేగఁ దదాశఁ గుఱించి రాగమే
ర్పడఁగఁ జనంగఁ దేజమెదఁ బాయఁడె యీయినుఁ డంచుఁ బ్రోత్త పె
ల్లడరఁగఁ జాటుమాటి సరసాళికతు ల్మొఱసెం గొలంకులన్. 7

చ. అవిరళనిర్గళన్మధురసాగ్రనిబద్ధ నిజానుబింబకై
తనమున హేళి కాలవశత న్నిజపద్మగృహంబుఁ జేర మా
ధవపద మాటచే రమ మదభ్రమరాళితమంబు వాని వెం
దవులక యుండఁగాఁ దలుపుదార్చె ననన్ముకుళించెఁ బద్మముల్. 8

ఉ. ఏకరథాంగభావము వహించిన నన్నిటు డించి పోవుట
ల్లోకుచితంబు గా దయిన నీవలె నేనును నీరధిప్రవే
శాకలనంబు గాంతు నను నాకృతి భానుని దేఱ చూచుచుం
గోకము బాష్పవార్ధి సమకొల్పె భవిష్యవియోగఖిన్నమై. 9

ఉ. ఎంతయు బాడబంబు తనయింటికడం జెలువొందు జీవనం
బంతయుఁ గొల్లలాడ భువనావనశాలివి నీవు పేక్షగ
న్వింతువె యంచుఁ బాశి మొఱ వెట్టఁగఁ జక్రము దానిపై రమా
కాంతుఁడు వైచెనో యన వికర్తనుఁ డయ్యెడఁ గ్రుంకె వార్ధిలోన్. 10

చ. కరముల బల్మిచే మెఱయు కంజహితుం డను మేటిజెట్టితో
నరుమగఁ బోరిపోరి సమయప్రతిమల్లకులేంద్రుఁ డాతనిన్
హరువుగఁ ద్రోచి మేనిచెమటూరఁగఁ దాల్చిన యెఱ్ఱమట్టినాఁ
గరమమరెం బ్రవాళరుచిగంధసురంధ్రసాంధ్యరాగముల్. 11

సీ. రవిగ్రుంక ముకుళించు రాజీవములఁ బాసి గమిఁ గూడు తుమ్మెదకదుపనంగ
విభునిఁ గానక భూమి వెదుక నేతెంచి చొప్పడు చాయ విశ్వరూపం బనంగఁ
దొగ నంటు సోమాఖ్య నెగడి రాఁగలఁడంచు గుమిఁగొన్న తామసగుణ మనంగ
రేకొమ్మ పతి రాక కైకొప్ప ఘటియింపఁ గొనవిప్పు కురులడాల్గుంపనంగ
కాముకాగమనప్రతీక్షాపరాయ, త్తోత్పలాక్షీజనాంజనవ్యూఢవిస్రమ
రాయతాక్షీణనవవీక్షణౌఘమనఁగఁ, బండిచీఁకటి తెంపంబు మెండుకొనియె. 12

సీ. నటదుగ్రఫణికాంకణనాదభిన్నాంతరిక్షమునఁ దాల్చిన వెండి కట్లనంగ
జవమందమందగంధవహాప్తి మింటిపై రాలు వేలుపుమ్రాని పూలనంగ
యామినీవిభువివాహమున కంబరవేది వరలు ముత్తెపురంగవల్లు లనఁగఁ
దమపుష్కరాభిఖ్యతత్త్వాంబకా వియత్పథము చెందిన వెల్లవమ్ము లనఁగ
సమయమనుయాత్ర నాళీకసార్వభౌముఁ, డంబుజంబులఁ జెందు రోలంబపఙ్క్తి
యనుతుపాకిని గగనలక్ష్యంబునై వఁ, దగులు సీసంపుగుండ్లునాఁ దార లమరె. 13

క. ఆలపొందుపుగట్టు నగరు, న్వేలుపదురాజునకు మ్రోల వేశ్యాసతి మె

చ్చులకుచ్చుఁ బట్టినటు చిన, వెలిపొనవ యనఁగఁ దూర్పు వెలుఁగం బొలిచెన్. 15

సీ. తనభానుసంతతి ధరమీఁద వెలయింప భువిఁగాధిపతి గురస్ఫురణఁ బెంప
రహిఁ బావమహిమచే జాతిసారి నొనర్ప నభవోగ్రధర్మ మొప్పారఁ జేయ
మానిత ధరణిజాతానంద మొనరింపఁ బాంథ రామాత్మదర్పంబు లడఁప
వనభూరికమలసద్గహస్ఫూర్తి యాయింపఁ దారేశరూఢివర్ధన మొనర్పఁ
దేనె రాయనిగర్వంబు గానుపింప, సమధిక పలాశపరచక్రసమితి నొంచ
నమితకువలయపరిపాలనము నెమ్మెఁ, దూర్పుదెస రామచంద్రుఁడు తోఁచెనపుడు.

• ప్రాగ్దిశాంగన కెంగేలఁ బట్టినట్టి, పురుతకాల్పట్టుగవిసెన పొమువు వలన
నంద మొందిన నిద్దంపుటద్దమనఁగఁ, బొడుపుఁగెంపున జాబిల్లి పొడిచె నపుడు. 17

చ. అమలిన శుక్లపక్షమెనయంపగు తద్విజరాజు మించిభే
దము సనరించి తేప్పు తెలితల్కులపాలనఁ బాంథదేహపాం
డిమబలెఁ జంద్రిక ల్నిగిడె డించిన నీరనఁ గాము కాత్మమో
హమువలె నంధకారనిచహం బడి యెక్కడనో యడంగఁగన్. 18

క. ఆకరణిఁ బొలుచు హృదయ, వ్యాకులతాతాపకారి యగు కోకారిం
జేకూరిన వగ వేలుపు, రాకూరిమిపట్టి యప్పరంబుగఁ బలికెన్. 19

మ. నెనరొందం ద్విజరాజుగా యితఁడు పోనీ యంచు నే నూరకుం
డిన నీవెంచక యేతువే యిటులఁ గాసీ మంచిదే చంద్ర నా
నుచువాలుంజడ చిల్వరాయనికి నిన్ను న్మేఁతగావింతురా
వినురా యేటికిపరాకురా కుసుమధన్విం గూడి వే రాకురా. 20

గీ. అమృతరామకమండలు హరిణకృత్తి, కాసమన్వితు నుద్దండ కరుని నిన్నుఁ
గన్న సన్న్యాసిగతి దోఁచుచున్నపరయ, గగనమధ్యాభియుక్తి నీకగునె చంద్ర.

గీ. శరధిఁదోఁచుఁట నాళీకపరవిధంబు, గోరికాంచుటయును క్రొమ్మాయుగుణముగల్గు
వింటనంటుట మమ్మేఁచుచుంట తెలిసె, నేయువారలఁ గానమో తోయజారి 22

. క. నళినాప్తువలన మండల, కలితుఁడవై వెలయుటెల్లఁ గలిగిన కరణిం
దలఁతువె శంబరహారికిఁ, గలదే యుపకారమెందుఁ గమలకులారీ. 23

సీ. నినుఁ గడుపారఁ గాంచినవారిరాశికిఁ గడలేనిపాటులు గాంచవలసె
నిను నారికోరి కైకొను కల్వచెల్వకు విషములో బ్రతుకుఁ గావింపవలసె
నినుఁ దలమీఁదఁ దాల్చిన శూలపాణికి నవిభవోపేతుఁడై యమరవలసె
నిను నమ్మి కొల్చి నిల్చిన తారకాళికిఁ జింతింప దుఃఖంబు చెందవలసె

నెవ్వరికి మంచివాఁడ విశ్లేషించి చూడ, నించువిలుకాని కొక్కనికే మొకాని
వానిప్రథమాస్త్రి విభవంబువారి కొనవె, రాదు నీచెల్మి చేయఁ దారానహాయ. 24

గీ. పాంథమదఖండనోద్దండదష్టకాండ, గర్వసాహాయ్యకలయొందు గన్న నీకు
నమరభోజ్యకళ్గ్లలవంద్రములోకు, లొకటికిఁ బదాఱు గల్పించి యుత్ప్రలాప్త. 25

గీ. అనుచురామాలలామ పాంథాతిభీమ, ధామచయసీమ యగుచందమామఁ గినిసి
వినిశితాంభోజనారాచమెనసి యేఁచు, మనసిజు గుఱించికొనుచు నిట్లనుచుఁబలికె.

గీ. అబ్జసీవైరి నీతండ్రి యైనగరుడ, గమనకేళికిగుఁ డెలోగాల మింత
కొదవలే నీదుతల్లికిఁ గొంప చెఱుపు, వీనితోఁగూడి యేఁచకు విషమబాణ. 27

చ. కమలశరా నిను జెఱపఁగా నియమించినఁ జేరిమూఁడుఁగా
శ్శ్రముసలి కావునం దయలలాట విలోచనకేలి నిన్ను ని
క్కముగఁ గరంచకుండె ననికాదె గిరీంద్రకుమారికాపరుం
డమలినమంత్రదక్షుసవనావని నాతనిఁబాఱఁ ద్రోలుటల్. 28

సీ. భామానిర్ఘాఢి గన్పడ మండలాగ్రంబు మెఱయించు మొదట నీమేనమామ
కొమ్మలపైఁ బండ్లుకొఱికి లావులనల్లధాటి కన్పించు నీఘోటకంబు
కాంతాళిపైఁ బరాగస్ఫూర్తిఁ గల్పించి చెనకంగఁ జూచు నీచికిలితూపు
నారులప్రోఁత నానందించి నిలువెల్లఁ గన్నులు దాల్చు నీకార్ముకంబు
బళిబళీనీకు బాకైన తలిరుటాకు, లడవి లతకూనలన్నఁ బైనంటి నిలుచు
నీవు మామీఁద శౌర్యంబు నెఱపుటరుదె, మానినీప్రాణచోర రమాకుమార. 29

చ. వనజకృపాణ చల్లనయివర్తిలఁగాఁ దడిపాఁతగొంతు గో
సినగతిఁ దష్మివాలు గొని చిమ్మెదు పాంథులమీఁదఁ దేనెఁబూ
సిన పెనుఁగత్తి కానలయెఁ జేతి? నీకది విప్రయోగమొం
దినయుల ముద్దియం దగిలి నెయ్యముఁ జూపఁగ నెట్టు లోర్చితో. 30

గీ. అనుచుఁ జెల్వాపుఁజెంగల్వయరిదికిరుసు, దురుసుమాష్టీని బదరి యుయ్యారుసుపట్టి
గురుసుమద్యోతనునిదూఱిగరుసుమీఱి, పేరెములువారెదు మరుతుక్కమారు ననియె.

సీ. మెడలపై నిడలేక సడగలు చిదిసిపో మేదిని భారమై మెఱయుఁ గాత
గట్టిగా నూపిరికట్టు పట్టంగ నాళీకనాభుఁడు పవ్వళించుఁ గాత
నాఖిలపాతాలమైనను జొరఁబాఱి పిల్చి తార్క్ష్యుండు నొప్పించుఁ గాతఁ
గృతియైన భాష్యఫక్కికయందు నొకమాట తగుచుట్టుఁద్రోవమై తాఁకుఁ గాత
ప్రబలపన్నగకులరాజ్యపట్టభద్రుఁ, డెన్నఁ పనవీఁడ నొకప్రక్క నిన్ను మెసవి

లేఁడు పొమ్మని యనకున్నవాఁడు గాన, దళితపాంథవిహార శీతలసమీర. 32

క. కడుఁ దాత్పర్యము నాపైఁ, నిడుతామరసాస్త్రితోడి యీనెయ్యంబు
న్నిడు కారింపకు మదిఁ, జెందెదుతాలిమి నొక్కవిడుత తెమ్మెరబుడుతా. 33

సీ. అనుచు నిక్కాంత వలవంతఁ బెనఁచివేఁడి, దొరలఁజెందిన కమ్మదెమ్మెరల దూఱి
ముమ్మరమ్మగు తాపమ్ము గ్రమ్మఁదమ్మి, పానుపున సొమ్మసిల్లుచు మేనుసేర్ప. 34

ఉ. ఏను మనంబులోనఁ జెలు లింద అలంతలఁ జెందిరంచు
నప్పానుపునందు నిక్కలికి ప్రక్కనె యించుక పవ్వళించు న
చ్చోనిఁక నేమి తెల్పుదు యశోధన కోలలఁ గొట్టి లేపిన
ట్లై నెఱుఁగంగనీ కొదవె నిద్దుర యిద్దురవస్థకై వెసన్. 35

ఉ. అంతట మేలుకాంచి నయనాబ్జము లొయ్యన విచ్చిచూడ ని
క్కాంతయు నేను నిక్కధరగహ్వరపట్టనరాజగేహసౌ
ధాంతమునందు నుంటిమి మహాత్మక యిప్పు డిదేమొ యంచు మే
మెంతయుఁ జింత వంత గుఱియింప భయంపడి యున్న గ్రక్కునన్. 36

క. పాతాళకేతుఁ డఁట యొక, దైతేయుఁడు చేరవచ్చి దంభోళిహటా
త్పాతాద్రిభీతహారిణీ, రీతింపగు మమ్ముఁ జూచి కృతహాసముతోన్. 37

క. లోకములన్నియు నన్నుం, గైకొనిపూజించు మీరుగా మీరానా
ళీకాంబకుఁ బూజించితి, రాకామినులార నాకరం బెఱుఁగరొకో. 38

గీ. ఇప్పు డేమయ్యె నింక నాయించువింటి, వాఁడెనుఁగు నేఁడు గూర్చి మీవాంఛదీర్ప
నేర్చునో నేరడో చూచి నెలఁతలార, యింపుపసలార నన్నుఁ బూజింపుఁడనుచు.

✓ క. ఒకహెగ్గడి దానవనా, యకుతో నేమేమొ తెలిపి యాతఁడు వికట
భ్రుకుటీపటుతరనిటల, ప్రకటీకృతరోషుఁడై సభాస్థలికరుగన్. 40

క. అవచ్చిన చెలి నాతో, నేనగల ఋతధ్వజేంద్రుఁ డితనిం జంపం
గావిడిసినాఁడు బ్రదికితి, తీవేళకుఁ దాళుఁ డనుచు నేగె న్వేగన్. 41

గీ. నాఁటనుండియు వలవంత నాట నీవ, ధూటి పడుపాటు కనుచు దోధూయమాన
మానసాంభోజనై యున్న దానవయ్య, యనఘ నా పేరు కుండల యంద్రు సురలు.

వ. మహాత్మా! యిది మదీయవృత్తాంతంబు దురంతసంతాపచింతాపరాయత్తం బగు
చిత్తంబు వివరింప భవత్కథాకథనంబున కడ్డంబుగా నింతయు విన్నవించితి నీయప
రాధంబునకుం బ్రార్థనారంజకంబగు నంజలిరచియించెద నాఁడు ఋతధ్వజవసుంధ
రాపురందరు దారునం జూచుటంజేసి నిర్ధారణాసామర్థ్యంబు లేమిం జేసి డోలా

యమానమానసనై యున్నదానఁగాని నీయందలి సౌందర్యగాంభీర్యాదిగుణంబులు సోయంప్రత్యభిజ్ఞావిధాయకంబులై యున్నయవి. అయినను మద్విలోచనచకోరికా చంద్రబింబంబగు నీమూర్తియుం బోలె యుష్మద్వృత్తాంతంబుఁ గూడ మన్మనః కమలంబునకు మార్తాండమండలంబుగా నానతీయ నవధరింపుము.

చ. అన విని యాజనానననగుణావని యావనితాశిరోమణిం
గనుఁగొని యింత నేర్పరివి గాక యయుండిన నీవధూటి కిం
పెనయు వయస్య వౌదువె భళీయిటువచ్చెను రాక్షసాధముం
దునుము ఋతధ్వజుం డనవుడున్ భవదూహకుఁ దప్పు గల్గునే. 44

క. నాకోరికతో నీక, న్యాకాంక్షిత మెల్ల సఫల మయ్యెఁ దివిష
ద్భీకరుఁ డీదనుజుఁడు ఘో, రాకారతఁ గూలె మచ్ఛరావళిచేతన్. 45

గీ. అదియు నెఱుఁగుదు వింక నేణాంకవదన, మంజువాణియు నేను నీమాటలోని
వారమైతిమి మాకు నేదారి నడువ, వలయునో యట్లు నడిపింపు పలుకులేల. 46

చ. అనవుడు నమ్మదాలస ముఖాబ్జమునం జిఱునవ్వువెన్నెలల్
నునుఁ జనుఁదోయిపైఁ బులకలున్ నిటలంబున ఘర్మబిందువుల్
మనమున సిగ్గుఁ గన్నుఁగొనలం బ్రవహించు ముదశ్రుపూరముల్
కనఁబడ నున్నఁ జూచి చెలికత్తియ యత్తఱి రాజచంద్రుతోన్. 47

చ. ఇపుడు గదా మదాళి పయి నెత్తిన వింటిపయిం జెలంగు నం
దపువిరిదమ్మికోరు దెసనా దొరకేల్ రతి నిబ్బరంపు సి
బ్బపు వలిగబ్బిగుబ్బకవపై జెదలాడఁ దొడంగె నేఁడు మా
తపము ఫలించె నింక నసుధావర తామస మేటికియ్యెడన్. 48

సీ. వేఁడిసెగల్గువేల్పు సాకిరియైన యప్పుడు గాని కేలంటరాదు
ప్రామిన్కుఱొంపలు గన్పడఁ గంటెకట్టునప్పుడుగాని గళయుక్తిఁ బొందరాదు
పొలుపుగా బ్రేలిమి బొట్టమరించునప్పుడుగాని ముంగురుల్ పొదువరాదు
మొకమోడ సేయ సన్నికలు మెట్టించునప్పుడుగాని పాదాప్తిఁ బొరయరాదు
స్నాతదంపతులకు విడెమిచ్చుమోద, మెనయునప్పుడుగాని పాన్పెక్కరాదు
నీవెఱుంగవె శాస్త్రోక్తి నిగమసూత్ర, చారము లుదారకుంభినీజంభవైరి. 49

ఉ. ఏను వచింప నీవు వినుటెప్పుడొకా యిఁకమీఁద నీదరో
జానన యొక్కవేళఁ బోలయల్కఁ బరాకున నున్న యప్పుడే
మోనముఁ బిల్లు పెద్దతనముం గనినప్పటికైన నేసుదా

దానతి నాకుఁ బోఁటియయి యప్పుడె యప్పని నేర్పకుండుదునే. 50

సీ. రాచిల్క రాయబారమున దారికిరాక చద్దింపు కోరమీసములు దువ్వి
యదిగా పనుచు నింతటంతటఁ జేరరాఁ గేడింపబిట్టుగాఁ గేకసైచి
నీ బంటు నన్న మన్నించవేయన విని వినమి సేయుచు దుంటవిల్లునంచి
దుడుకుగాఁ జెఱగంటు ముసిగొన్న బొమ్మలానించిచూచిన తెగనింపఁ దీసి
యతనుఁ డీయింతికలుక చల్లార్ప నీవు, పాదముల వ్రాల దీనబాష్పములు చూచి
యస్త్రసన్న్యాస మొనరించు నట్లుగాఁగ, నింపుసొంపారఁగా విహరింపుఁడింక.

గీ. అనిన ముదమంది యమ్మందరాద్రిధీరుఁ, డావధూటులఁ దోడ్కొని యాత్మపురికి
నరుగుటయ కాని లేదు కార్యం బటంచు, నగవుదైవాఱఁ గుండలమొగము చూచి.

క. మంచిది మనపురిఁ జేరుద, మంచు న్లేచుటయు నవ్వయస్యయుఁ గమ్మల్
మించుగ ననియాడఁగ బదుఁ, డంచుం జేఁజూపి మందహాసముతోడన్. 53

చ. చెలువుని వెంటఁబోఁ దరువుసేయు మనోజ్ఞను మాట చెల్లనీ
కలమెడు లజ్జకన్న ఘనమైన కటీతటి వ్రేఁగున న్నడ
ల్వైళకఁగ నంచబిత్తరినలె న్మరిపంబున నమ్మదాలసా
జలరుహగంధి రా నృపతిచంద్రుని వెంబడి మేడ డిగ్గినన్. 54

మ. అతఁ డచ్చోఁ దురగంబు నెక్కి హృదయాజ్ఞాపూర్ణమోదార్ణవాం
చితుఁడై వారల వెన్క నుంచుకొని యత్నీశైక్యమాణిక్య దీ
ధితిజాతావృతదిగ్వితాన మగు దైతేయాధినాథాయతా
యతనం బల్లన నిర్గమించి పురబాహ్యక్షోణి కేతెంచుచున్, 55

ఉ. అచ్చట నున్న సైన్యము బలాధిపతు ల్వెనువెంటరా సము
ద్యచ్ఛటులాచ్ఛటిం గువలయాశ్వను ధేయని చౌకుచేసినన్
బ్రోచ్చలితావనీరజము లాక్రమొగంబుగఁ బిక్కటిల్లనై
యచ్చటవీథిఁ గప్ప నదియాత్మపురాంగణసీమఁ జేరినన్. 56

గీ. ఆచటికి నెదురుగవచ్చు ధరాధిపతులు, కామినీయుక్తుఁడై చేరఁ గ్రమ మెఱింగి
దవ్వులనె నిల్వ నిజమణిధామ మొంది, రమణులును దాను సంతఃపురమున కరిగె.

ఉ. అంతట నాసురాంతకుని యర్మిలితమ్ముఁడు తాళకేతుఁ డ
త్యంతమహోగ్రహోముఖకహాకహనాదమహోగ్రహాసవి
భ్రాంతసమీకశోకపరిపాకభయాకరకైకలోకదు
ర్దాంతవిరక్తనోదరగదాశ్రితకేశవుఁ డొక్కయిమ్మునన్. 58

చ. కొలువుననుండి యింద్రుకడకు న్నను మంపినవాఁడువచ్చినా
పిలువు మటన్న వేత్రధరబృందము తోడ్కొనితెచ్చి ముంగల
న్నిలిపిన వాఁడు భీతియు వినీతియుఁ దోఁప దురాపకోపచా
పలమున హుంకరించు నిజభర్తకుఁ గేలు మొగిడ్చి యిట్లనున్. 59

క. దేవరప్రతాపగరిమకు, నేవెఱతుం గాని నిర్జరేంద్రుఁడు వెఱచం
డావంతయైన నిపుడే, మోవింతలుపుట్టె దనుజమూర్ధన్యమణీ. 60

సీ. దొర కాపులై కార్యసరణిఁ జెల్పెడి కవీశ్వరులకు లంచపంచంబు లొసఁగి ✓
సమ్ముఖమ్మననుండి చనుదెంచు సల్రావాయసమువారి కాశపాశలు ఘటించి
బోనవెచ్చము గొంచుఁబోవు శచీదేవిదాదులకును బరిధాన మిచ్చి
పిలువ నేతెంచు వేగులవారి వెంటనే యరుగు నియోగుల ననుసరించి
కినిసి వాకిటివా రడ్డగించుకతన, నేనువచ్చినమాట దేవేంద్రుతోడఁ
దెలుపు మని యొంతవేఁడినఁ దెలుపరైరి, విని వినమిచే సెనో కాని వేల్పుఱేఁడు. 61

క. మనగురు వఁట నేవచ్చుట, వినె నేమో గ్రుడ్డికంటి వేలుపుదొరతో
వినిపించి యతనియనుమతి, ననుఁ గొని చని సమ్ముఖమ్మున న్నిలుపుటయున్. 62

సీ. ననుఁ గని పాట నిల్పినతుంబురుని జూచి యాతాన మీసారి యనుమటంచుఁ ✓
గమలజోద్భవ సుమాళము చెందినాఁడవు వింతవార్తలు గలవే యటంచు
నీతని నంపరాదే యంచు సన్నగాఁ దెల్పువారలను గద్దించుకొనుచుఁ
గ్రేఁగంటఁ బల్కనుంకించు నన్నని పట్టుగద్దిగ లెస్సాయెగా యటంచు
సద్దు సేయక నిరుపమైశ్వర్యగర్వ, పటిమపడఁతులు జలకంబు పట్టియున్న
దనఁగఁ గట్టికవారిండ్లకనిపికొంద, యంచఱు వటంచు బ్రోవాయు నయ్యానసదమున. ?

గీ. మనగురుఁడు చేరి ననుఁ జూపి మనవి గాఁగ
నితని వీడ్కొల్పుఁ డన్న దేవేంద్రుఁ డొద్ద
నున్న గీష్పతిఁ గని కనుసన్న సేయ
నతఁడు నాదిక్కుఁ జూచి యనాదరమున. 64

క. ఏమోయి తాళకేతుం, డేమని పంపించె నిర్జరేంద్రుని కడకు
ద్దామక్షేమాహంతసాం, గ్రామికుఁ డాతనికి శుభమె కదయనిపలుకన్. 65

గీ. చెఱమఱను జూచి దొరనిన్నుఁ జూచువాఁడు, నంతలోననె నీవు నన్నడుగువాఁడ
వాబలా పొట్టక్రొవ్వుగాకంచు నేను, గోత్రపరిపంధితోఁ గొంకుకొనుట లేక. 66

క. తారారంభలు చక్కని, వారనఁగా మెచ్చి దనుజవల్లభుఁడు నినుం

చేసుకొని చేఁతుమన్నాఁ, డారమణుల నొప్పగింపు మటుగాకున్నన్. 67

సీ. అలవాటు చేసికొమ్మఖిలమరుత్పాలకులఁ గూడికొని నిల్వకొల్వనకును
నభ్యసింపఁగఁ జేయు మలజయంతునకు వేళ యెఱింగి వెండికాలాంచి దాల్ప
దారికిఁ దెచ్చుకొమ్మా మరూథిఁ బౌలోమి సైరంధ్రికాసదాచారమునకు
నలవడఁగా నేర్ప మచ్చరలకు మాఱువలుకని భానిసపాటులకును
దలఁపకమ్మృతంబు వైజయంతంబు మఱవు, విడువు వజ్రాయుధముతోడిగొడవ యింక
నిచటనుండక వెడలి రమ్మిపుడు దేవ, పట్టనం బేను దోఁరణకట్టినాఁడ. 68

క. అని నీల్గు నన్నుఁ దప్పకఁ, గనుఁగొనలం గొప్పనిప్పుకలు కుప్పలుగాఁ
గనుఁగొను ప్రథమకమ్మృతిఁ, గని దేవగురుండు రోషకలుషేక్షణుఁ డై 69

క. ఓరీ మీదొర గోరిన, తారారంధ్రలవిటావతంసులచేతన్
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరం జనుఁగాక యని వచించుచు నలుకన్. 70

గీ. వీని వెడలంగఁ ద్రోయుఁ డివ్వీటికోట, దాఁటునందాఁక ననుమాట నోటనుండ
నీటు వోమీటి గరువంబు మాటి యిటకుఁ, బెద్దపర్వాన నచ్చిని పెసరువుట్టి. 71

క. ధారాధరవాహను గ, ర్వారూఢియు గురునిశాప మట్టులుండేఁ గదా
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరం జనుగాక యనుటఁ జెందితి వగలన్. 72

క. పాతాళకేతుఁ డాదృష, దైతేయుఁడు వీరఁ దమ్ముదాలసకొఱకై
యేతెఱఁగున నేమయ్యెనొ, కో తెలియ దటంచుఁ జెలిసికొను నట్టియెడన్. 73

గీ. అరితిఘుటిల్లఁ గొందఱు చారవరులు, వచ్చినతిసల్పి కువలయాశ్వక్షితీంద్రు
చేత నైనట్టి పాతాళకేతు పాటు, తోఁపఁ దెల్పినఁ దాళకేతుండు కనలి. 74

చ. ఒదవినశోక మాఁచికొని యుగ్రతరాగ్రహకేళికావశం
వదుఁడయి యింద్రు గెల్చుటకు వచ్చిననే మటుమీఁదఁగాదె నేఁ
డదయత నన్నరేంద్రుఁడు మదాలసకై కద భాసమానదో
ర్మదుని మదగ్రజుం బిలుకుమార్చెను దాని హరింతు నిత్తఱిన్. 75

గీ. కపటమునఁ దెత్తునాహంసగమన నదియె, తెంగి మార్కొన్న నాతని భంగపఱతుఁ
బగయడంపక యున్న నీపగిది నెగులు, సైఁచవచ్చునె యిదియ నిశ్చయ మటంచు.

సీ. ఎదురిండ్లు పలుసాల లెనసివర్ణింపఁజాలిన మేలిపర్ణశాలికలు కొన్ని
యాగమాతంబుల యందలి యర్థము ప్రకటించు కీరశారికలు కొన్ని
హవిరన్నసంభృమద్ద్విజకోలాహలాంకములైన యాగవాటములుకొన్ని
దున్ని విత్తకపుట్టి యెన్నులవ్రేఁగున వ్రాలు నివ్వరిప్రాలచేలు కొన్ని

తోఁపులోఁ గొన్ని తెలినీటిదొనలు కొన్ని, కొలఁకులోఁ గొన్ని పెంపుడుపులులు కొన్ని
మొనపులోఁ గొన్ని చేమంతి పొదలు కొన్ని, బెరయఁగఁ దపోవనంబుఁ గల్పించి యపుడు
గీ. తోడిదైత్యులు శిష్యులై కూడి నడువఁ, బేరు ముండవృత్తిఁ దనమునఁ గల్పించుకొనుచు
గొన్నిమాయలు మదిలోన నెన్నికొనుచుఁ, గువలయాశ్వుని పట్టణ క్షోణిఁ జేరె. 78

ఉ. అంతట పౌరసారసదళాక్షు లుదారవిహారసౌధయూ
థాంతము లెక్కి కంటి రటవమ్మ మునీశ్వరుఁ డొక్కఁ డిమ్మహీ
కాంతునిఁ జేరి రాక్షసనికాయము చేత మదీయయజ్ఞమా
ద్యంతముఁ గోలు పోయితి నయా యని శోకొనిపోవుచందముల్ 79

ఉ. నిన్నఁ గదమ్మ గాలవమునిప్రభు వెంబడి నేగి రక్కసు
న్వన్నియమార్చి రాచిలుకవంటి మదాలసఁ దెచ్చి యుద్వహో
భ్యన్నతిఁ గోరి నేఁటికి ముహూర్త మటంచును నిశ్చయించె నీ
యెన్నిక చిన్నవోవఁగ ఋషీశ్వరుఁ డెక్కడవచ్చె నక్కటా. 80

సీ. తలవాంచి బెళుకుఁ జూపులు క్రేళ్లుతుళ్లంగఁ దెరమొఱంగుననిల్చు సురభ్రుఁ జూచి
చెలికత్తె చేమెచ్చవలెనన్న సిగ్గుతోఁ దలఁబ్రాలువోయు చిత్తరముఁ జూచి
వ్రేలిమిఁ జెమరించు కీలనంటెడు లాజ లందిమ్మనట్టి సోయగముఁ జూచి
కులదేవతకు మ్రొక్కుకొనువేళఁ దనపేరు వలుకఁ గొంకెడు ముద్దుబాగుఁ జూచి
ముచ్చటలు దీర్చుపూనిక వచ్చియితనిఁ, దోడుకొనిపోవుచున్నాఁడు దుష్టతపసి
యతని మాటకు మారాడఁ దయ్యె యీతఁ, డిందుముఖి రాజులకు సౌఖ్యమేపదమ్మ

క. దొర నయ్యెద నని కోరుదు, రరయఁగ జను లెవ్వరైన నాపెను బెడఁద
ల్పరికింపరు దొరతనపు, న్నరవుల్మటికత్తిమీఁది సాములు సుమ్మీ. 82

సీ. మంత్రుల మర్మకర్మము లెఱింగెడు దారి, కోటలు కాపాడుకొనెడు నేర్పు
తటికాపు చెనకుండ సరిగోరుకొనుకీలి యీతిబాధలు చెందనీని సొంపు
పరువయాలోచన ల్పరికించు గరిమంబు నర్థార్జనము మీఁది యాపరంబు
వేఁటతోఁటలమీఁద విలసిల్లు నాసక్తి యొడ్డోలగం బుండు నొప్పిదంబు
తగిలి పిసువీఁకు సేయ నుద్దండవృత్తిఁ, జెలఁగుటయె కాని మనసు వచ్చినమిటారిఁ
గూడి తమిమీఱ సయ్యాట లాడికొనుచు, నడువఁ గూడునె మేదినీనాయకులకు. 83

క. అని యాడికొనఁగ మాయా, ముని వెంబడిఁ గువలయాశ్వుమున్నాకిరమ్యం
బునఁ జని యారాకొమరుఁడు, గనియెం బత్పర్ణశాలికాప్రాంగణమున్. 84

గీ. అంత నమ్మాయతపసి యయ్యధిపవర్యుఁ, గన్మసన్నలఁ దుమ్మెదమ్మఁదోలి

మానసపుఁ బుష్పాదుల్ నెమ్మిఁ గుమ్మరించు, తెమ్మెరలుఁ గమ్మ కమలాకరమ్ముఁ జేర్చి

గీ. అధిప నీవింక వచ్చిన యపుడె తొలఁగె, రక్కసులమాయ పద్మాకరంబునందు
వరుణజపమొనరించి యేనచ్చటనుక, నిచట నుండంగవలయు నీవేమి యనక. 85

గీ. అయ్య నినునమ్మి గూడ దేవరుగుదేరఁ, దామసంబైన జరగెన వేమొ నీవు
కాకయుండిన నిమ్ము నీకంఠహార, మిష్ట దన చిన్నినవ్వుతో నిచ్చుటయును. 86

క. జలదేవతకుం బ్రాంజలి, సలుపుచు నక్కోలన మునిఁగి జనపతి నగర
స్థలమున నంతిపురంబున, నలరుం బొవచెంత డిగ్గియుం దేలుటయున్. 87

గీ. కుండలియుఁ దానునవ్వేమఁ గూడియున్న, యమ్మదాలసఁ గని మంత్రియంపమొంది
యమ్మమనరాజు మానిమాగమ్ముగాచె, రక్కసులఁ దోలి భుజబలప్రాభవమున. 88

ఉ. అమ్ముని యంత సంతసము నంది యనిందితకార్యధుర్య రా
ధమ్ముగ నీవివాహమచటం జరగింపఁగఁ గోర్కె వేఁక యీ
యిమ్మునఁ బట్టనంబు రచియించెనె నాడు తపోబలంబునం
గొమ్మను బిల్వ బంపు మిటకు న్మఱుమాటలు పల్క కేమియున్. 89

గీ. అనిన మాటాడ వెఱచి యమ్మనుజనాథుఁ, డానవాలుగ నీకంఠహార మిచ్చి
నిన్ను వేవేగఁ దోడి తెమ్మన్న నచ్చి, నాఁడ రావమ్మ కుండలతోడఁ గూడి. 90

మ. అనియామాత్రికహార మిచ్చుటయు సాంద్రానందమున్ బొంది మా
నిని మేకోలునఁ గుండలావచనము న్వీక్షింప నయ్యంబుజా
నన కానిమ్మని పల్కఁ గృత్రిమవిమానం బెక్కఁగాఁ జేసి య
ద్దనుజాధీశుఁడు తానదృశ్యుఁడయి చెంతం బోయె సంతుష్టుఁడై 91

వ. అత్తఱిం దటిత్తరుణభానువిరాజమానం బగు నమ్మాయావిమానంబు జలయంత్రంబును
పమఁ బ్రవేశంబునకుం గమకించునంచకంబురకంబునఁ బొడవుగా నెగిరి యొక్క
పరిరథంబువిధంబున మందగతిం జనుచు నొక్కసారి లక్షోరిదారి రివ్వున నిగుడు
చు నొక్కతేప బొంగరంబు రంగున బిఱబిఱం దిరుగుచు నొక్కమాఱు గాలిప
టంబునీటున నసియాడుచు నొక్కయెడఁ జుక్క తెగిపడ్డ విధంబున డిగ్గుచు నొ
క్కచోటం బుట్టచెండు పడువున నుప్పరంబునకుం బోవుచు నొక్కచంక జీమ్మది
గనైచిన కప్పలి చొప్పునఁ గదలక నిల్చుచు నొక్కపరి బైరిడేగ యొయారంబునం ది
ర్యక్ప్రచారంబుఁ జూపుచుఁ బోయి మేరుధారుణీధరంబున నిబిడాంధకారబంధు
రం బగునొక్కబిలంబున దమాలతాలతక్కోలరసాలసాల ముఖసాలవిశాలం బగు
వనంబునం బునఃపునర్వర్ధమాన గిరిఝరీవితానంబులకు నుబ్బగన్పించు పన్నీటిపిల్ల

కాలువలకుం బ్రోదిసేయు జాదివిరిదేనియవాఁకవెంబడిం బోదుకొనిన పోఁకద్రాక్షు ల కట్టకడపటనెట్టుకొనిన యిందుకాంతవేదికాబృందంబులతోడి గురివిందపందిళ్ళ నొరసికొనియున్న తిన్నని మగతాతివన్నియలఁ జెన్నగు చవికల నమ్ముడుకొన్న క న్నెసుపొన్నగున్నలఁ బెనఁగొన్న నతిబిసజాతికి సాధారణంబగు గొప్పకెంపులు బ్బ చప్పరంబులం గప్పికొన గుజ్జుమావులక్రేవలఁ బమ్మితావులకుం దావులైన తెలి నీటి కేళాకూళికంటికొనిన యావంటులవలనం దొరఁగు కప్పురంపు రవలుం బాలు కొలువుకూటంబు డిగ్గిచను మెట్లుసగ్గలు నగ్గలంబగు నీలంబు నిగ్గులు గగ్గోలుపడు కో నపాదిరింగొరిలించిన పొగడగుంపుల నట్టనడుమఁ బట్టుగఁ బొదరిండ్లఁ జుట్టఁబ డియున్న బిత్తరం బగుక్రొత్తముత్తియంపుఁబడుకటింట నపరంజిగొలుసులం జెలం గు తూఁగుటుయ్యెలచేరువకుం జని యద్దనుజవీరుండు నిజాకారంబుతో నయ్యిద్ద ఱం దద్గృహంబున నుచితియతిఘోరాకారలగు దైతేయభామలం గాపువెట్టి కృత కృత్యుంగాఁ దలంచుకొను యాక్షణంబున. 92

చ. మునుపటిపౌరికాంక్షి విభముం భజియించుచునంబుజాకర
బునఁ బడి తేలి యోనృపతిపుంగవ నీభుజసారగౌరవం
బున జపమెల్లఁ దీఱెఁ బోలివోసక నీవిఁకఁ బట్టినస్థలం
బునకయి పొమ్ము రాజునకుఁ బోలునె యాశ్రమవాసఖిన్నతల్. 93

చ. అని యనుపన్ మహాసాధని నృపాగ్రణి యమ్మునిలోకచంద్రు వీ
డ్కొని తనతేజి నెక్కి గిరికోటులుఁ గాననవాటులు న్మహా
జనపదము ల్నదంబులును జయ్యనఁ దాఁటి పురంబుఁ జేరి కాం
చనసముదారమై తగుమహాజారమువం పమవారు చేరఁగన్. 94

క. తురగంబుడిగ్గి యచ్చటి, పరిజనుల న్వీడుకొల్పి పార్థివచంద్రుం
డరిఁగి గృహాంతరమునఁ ద, త్తరుణీమణి లేమి నశ్రుసమగ్నుండై. 95

ఉ. అక్కట యెందువోయెనో మయూరపు సంచులమొప్పగుమ్మ యే
చక్కని దాఁగెనో కలికి చక్కనలెక్కనగుబ్బలాడి యే
దిక్కననున్నదో సొలపుదేఱెడిచూపుల హొంతకారి యే
యిక్కనివిల్చెనో యొరపు నీనెడు చిల్కలకొల్కి దైవమా. 96

ఉ. అనవ లామెఱుంగుఁదొడ లాకడగంటన మాచుసోయగం
బానెరు లామిటారితెరు లాముఱిపెంబునఁ బల్కుపాటవం
బానొస లామొసంబుసస లాతెలిపర్యోధచక్కఁ జేప్పసొం

పేశలినాక్షి కైనఁ గలదే కలరే యిటువంటి కామినుల్. 97

సీ. గిలుకుబంగరుమట్టియలు జాఱఁగాఁ జక్కనలవరించెద నంచునిలిచినిలిచి
బయట నున్నది చిల్కపంజరమున నుంచి మఱచివచ్చెన నటంచు మరలి మరలి
యాఁకొన్న యల్లపుఁడేమి యంటివే యేచిరాకయియుంటిఁ దెప్పనుం చడిగి యడిగి
చెమటచేఁ దిలకంబు చెదరెనో యని వింతసొలపుతో నద్దంబు చూచి చూచి
ప్రొద్దు గడపుట కని తోడి పూవుఁబోఁడు, లపరక్తైనంగఁ దనమానసానగరిమ
యినుమడింప మదీయమోహనగృహంబుఁ, జేరు నెప్పుడో యానీలచికుర నికర. 98

శా. కైజాచేసినబొండుమల్లె విరిబ్బంగాఁడాజగాజోదు తే
జీజాపం బలవాంచి బోఁటిచెఱఁగుం జేఁ గట్టిగాఁ జుట్టి ను
గ్గాజుం గరుబము చాఁటున న్నిలిచి క్రేఁగంట న్ననుంజూచు నం
భోజాతాక్షిని సెజ్జనుం దిగుచు నేర్పుల్లగ్గునే మీఁదటన్. 99

క. ఎక్కడి యాలోచన యిది, యక్కట యక్కలికి యున్నయప్పటికిఁ గదా
యిక్కోరికియని నవవి, ల్మొక్కలిదొరవిరిలకోరి మెనకుం బలఁకున్. 100

సీ. పాదకనవచ్చు నాప్తులవేళఁ గాపంచు నవసరంబులవార లడ్డగింపఁ
బనిగల్గియుండినఁ దనకు మంత్రులకు లేఁజిగురుఁ బోఁడులచేతఁ జీట్లు నడున
నిదియేమొకడువింత గపయించు నవరోధ బిసరుహాక్షులు గుసగుసలువోవఁ
గొలువుకూటమునందుఁ జెలఁగెడు సింగంపుగద్దియగవిసెన గైకొనంగ
చొక్కసంబులు పెనుబీగములు భజింప, నుడిగములవారలకు పాటవిడుపు గాఁగ
నోలమును మాని మేదినీయువతిజాని, యింతి భావించు నంతఃపురాంతరమున. 101

క. ఈకరణి నన్నృపాగ్రణి, యేకరణీయములు మాని హిమకరవిలస
ద్రాకలకు న్వాలిదమ్మెర, రాకలకుం జాలినొని విరాళిఁ బఱంగన్. 102

ఉ. ఆతనినేస్తగాండ్రు భుజగాత్మజు లవ్వగ లెల్లఁ గాంచి య
య్యో తమవంటివార లిటు లుండియు నీదొర నీ దురంతచిం
తాతనుతానితాంతవ్యాపయవ్యథఁ గూఱఁగ నూరకున్న సం
గాతులమౌదుమే యిపుడుగాక మఱెప్పటికి న్వయస్యతల్. 103

క. అని యయ్యుద్దటుఁ జని తమ, జనకుం డగునశ్వతరుని సమ్ముఖమున న
జ్జనపాలువిరహవేదన, వినిపించి తదార్తిమాన్పవే యని వేఁడన్. 104

చ. తనయులస్నేహబాంధవవిధానము లెంచి నరేంద్రుఁ డంతమా
ఘునుఁ డటువంటివాని కుపకార మొనర్చినఁ గీర్తి చెందదే

యని రజతాద్రికిం జని నగాత్మజతోఁ జదరంగ మాడు రు
ద్రుని గని మ్రొక్కి కుంభలివరుం డటు నిల్చిన నావరంబునన్. 105

గీ. అంబికయును నితం డెవ్వఁ డనుచు నడిగి, యధిపుఁ డశ్వతరుండు గాఁడా యటన్న
నీతఁడా యశ్వతరుఁడు సంగీతవిద్య దొడ్డవాఁడఁట యనిన రుద్రుండు చెలఁగి.

క. వెనుకం బురుహూతు దెసం, దనతంబురవలన గెలిచె నానాగతుల
న్మనతుంబురు నీవెన్నడు, వినవంబురుహాక్షి నేఁడు విను మనిపలుకన్. 107

గీ. మంచిది సగటుపై నిదె మంత్రికావ, లున్నదీచదరంగ మిట్లుండనిమ్ము
వెనుక నాడుదమని సతి వనజనయన, యభిముఖంబుగఁ గూర్చున్న యవసరమున. 108

గీ. శౌర నారాక ఫలియించె నంచు నెంచి, యచటఁ గూర్చుండి యయ్యురగాధినేత
గవిసెన సడల్చి తంబుర కలికిపైఁడి, బిరడలు బిగించి శ్రుతులెల్ల సరిగఁ గూర్చి. 109

క. రాకాశశాంకవదన ప, రాకా యిటు నీదు మ్రోల రహి గనిపింపన్
నాకుఁ దరమానె మైనం, గాదండిన నీకు ముద్దు గద యని యంతన్. 110

సీ. శ్రుతి తోడఁ గూడి మెచ్చులు రాసిజంబుగ సంచునందగ నాలపించుసొంపు
గడియమైనను గుక్కవిడునకహోయలుగా నవగడంబుగఁ దానమనెడు నేర్పు
పరరాగముల వింత సోరనీక వ్యాప్తిమై మించుగారాగంబుఁ బెంచు వింత
తాళంబు తప్పక తనువు గదల్పక బాగుమీర పదంబు బాడుదారి
ఎడనెడఁ బరాకు వినుడను హెచ్చరింపు, మీరు మెచ్చిన యీవిద్య మీరొసంగు
నట్టిదని గర్వపరిహార మలర నతఁడు, గాణ వవుపనశుద్ధమార్గము నటించి. 111

గీ. గోఁటి వాద్యంబు కిన్నరమీటు బడ్డి, వాద్యము రబాబు వగలుసద్వంబు మెరయ
దురుసుగతి జూపఁ బార్వతీ తరుణి మెచ్చి, జారు సరిగంచు పయ్యంటఁ జక్కఁ జేర్చి

ఉ. ఎక్కడి నారదుండు మఱి యెక్కడి తుంబురుఁ డోగిరీశ యే
దిక్కననైన నీవిధము తేటపడం గనుఁగొంట లేద యే
పెక్కున తప్పునంచుఁ గనిపెట్టుక యుండితి మెందుఁ గానమ
మ్మక్కశబాసు మేలు హవుపంచు ఫణీశ్వరుఁ జూచి యింపునన్. 113

క. పరమదుగుణునిన గంగా, సరసిజముఖి యీసుతోడ జంకెనచూపుల్
బొరసిన మొగంబుఁ ద్రిప్పెం, గిరిజకు డెందమున వింత కినుకజనింపన్. 114

ఉ. అమ్మక చెల్ల యెన్ని పగ లద్దిరనాయకుఁ డొద్ద నుండఁగా
నెమ్మొలు గాక యేను వరమిచ్చెద నంటి విదేటిమాట దో
సమ్మొసుమీ ననూటుబకు జన్వని నా గ న సుజ్ఞ లేక యే

కొమ్మని యీఁగఁ జెల్లునె యకుంఠిత చాతురి గల్గియుండినన్. 115

గీ. అని పలుక నెంత లేడామృగాక్షిమాట, వినకు మడుగుము వరమిత్తు విభుఁడుతనకు
నంతచనువిచ్చినాఁడన నవ్వుఘాటిఁ, జుఱుకు చుఱుకునఁ బార్వతిఁజూచెనపుడు. 116

చ. ఉరగవిభుండు లేచి కుధరోద్భవఁ గన్గొని యమ్మ మేదినీ
వరుఁడు ఋతధ్వజుండు భుజవైభవశాలి మదాలసాసతిం
బరిణయమాడునంచు నిజమందిరమం దిరవొందఁ జేసి త
త్తరుణి వయస్యఁ గుండల వితావితఁ గానక వంతఁ గుందెడున్. 117

గీ. వారి నిష్టరి దప్పింపవలయు ననిన, గిరిజ, కానిమ్మనంగఁ దత్సరసిజాక్షి
కాని కుండల శాపంచు గంగ పలుక, నభవుడిద్దరియందు మధ్యస్థుఁ డగుచు. 118

గీ. మంచిదహిరాజ రెండునాళ్ళించుమించు, గాఁగఁ గుండల చనుదెంచు గాకయిప్పు
డమ్మదాలస వచ్చు నీవఱుగుమనిన, నదియపదివేలుగా నెంచి యాతఁ డేఁగె. 119

ఉ. అంతటిలోననే యలమదాలస నిద్దురవోవ నయ్యుమా
కాంతుఁడు మాయచే నురగకన్యగృహంబున నల్పనాతఁ డ
త్యంతముసంతసించి తనయాత్మజగా నురరీకరించి య
య్యింతిని గొల్వ వేవురు మృగేక్షణల న్నియమించి యత్తరిన్. 120

చ. తనయులఁ బిల్చి మీరు వనితామణి వచ్చిన మాటఁ జెల్పక
జ్జనపతిఁ దోడి తెండనఁ బ్రసాదమటంచును వారలేగి గ్ర
క్కున నుడిగంపుఁ జేడియలు కొందఱు గొల్వఁగ నున్న భూవరుం
గనిన నతండు నిండు కుతుకంబునఁ జేరువ నుంచి యిట్లనున్. 121

ఉ. ఇన్ని దినంబు లంబుజవనీశుఁడు చెందొవయిండ్లలోన ర
క్కొన్న మదాళిఁ బద్మగృహకోటికిఁ బొమ్మని తీవరించు నం
తన్నముఁ జేరవత్తురుగదా యొక యామము బోవుదాక రా
కున్న తెఱంగు మాకు విన యోగ్యము యేని వచింపుఁ డింపుగన్. 122

క. పరబల ఖండన మంత్రా, చరణమొ గృహకృత్యగత విచారమొ కాకో
పరపుత్రులార మీ, రిట కరుదేరక యుండ నాఁగినది యెయ్యదియో. 123

చ. అనుడు భుజంగరాజ సుతు లట్టివి యేవియులేవు లెండు మా
జనకుఁడు మీగుణంబువిని సంతసమంది మిముం గనుంగొనన్
మనమునఁ గోరి తాన పయనంబయినన్ వలదా యిలాబలా
రిఁ దోడిఁ దెత్తునంచు వినయంబుటకై తడవుంటి మిత్తరిన్. 124

క. ఆతీసునఁ బలుకఁగరా, దో తెలియదు గాని శౌర్య ధూర్వహస్వసం
గాతముచే నీమన్ననఁ జేతం దోడి తేరఁ బ్రతినఁ జేసితిమనుఁడున్. 125

క. మాయురె తా రావలెనా, యాయెడకే నరుగుదెంతు నాయిల్లనఁగా
నీ యిల్లనగా వేఱా, వోయఁగ రా విట్టులైన భువి సఖ్యంబుల్. 126

మ. అనుచుం గట్టికయింతి దేవర పరాకయ్యా పరాకంచు బో
రన వ్రాయన్ వలెవాటుకుప్పటి చెరం గల్లాడఁగాఁ జేఁగటా
రిని లోభాగము నూఁది నిల్పఁదగు వారి న్నిల్పుచున్ మేలిసుం
దనపుం గద్దియ డిగ్గి నిల్చె సురగేంద్రప్రత్మ్మా దివ్యక్షారతిన్. 127

చ. నిలచి పరావనీప రధి నీరధి మంధనమందరాద్రి య
బ్బలి యొఁడొకంత పాప దొరపట్టులు తెన్నెఱఁగించుచుండఁగా
నలరుచుఁ నేఁగి కాంచె సికతాంచితతీరసమేతకేతకీ
తిలకగ చంచరీక యువతీ కృత గీతిక గోమతీనదిన్. 128

చ. కనుఁ గొని చిల్వరాచకవ గ్రక్కున నన్నదిఁ గ్రుంకఁ జేసి తో
డ్కొని చనఁ నేఁగి చూచె ఫణకోటి మణీఘృణి వేణి కోర్ధ్వ దీ
పనికర భ్రాత్రపాచరిత పౌష్పకేళి విధూత రత్నరు
గ్జనిత నవస్మితానన భుజంగిక మొక్కపురంబు మంపరన్. 129

చ. అచటి వియోగిభోగి జలజాత్ములు మారుని వ్రాసి కొల్చునో
నచలితభక్తిఁ జందురిని యంచ మెఱుంగమి మున్ వసుంధరా
రుచి గరుణావలోకులు వరుల్ చెలి నీ మొక మబ్జువంటిదన్
వచనము లంతలోఁ దలఁచి రాయుడు రున్ముకురాగ్ర వీక్షులై 130

క. ఈకరణిఁ జూచి డిగు నా, భూకాంతున కొక్కయింపుఁ బొడమించెను ద.
ర్వీకర నైశాకర రు, చ్యాకర ముక్తానుషక్తహర్మ్యతలంబుల్. 131

సీ. తీవయుయ్యెల లూఁగు పూవు బోఁడులవీఁగు కొప్పచీఁకటిఁ దాఁగు కోర్కె యొకటి
నును పుట్టచెండాడు వనితల యరవీడు జిలుగుపయ్యెదఁ గూడు చెలువ మొకటి
యలయంచ నడలించు చెలుల జంకెనమించు బెళుకుచూపులమూంచు బెరికి యొకటి
పూవుబంతులు రువ్వ పొలతుల తెలినవ్వు కలికి వెన్నెలక్రొవ్వుగనుట యొకటి
గాని మఱియేమి వలవని కంకణంబు, గట్టుకొని సల్పుపతి దృష్టిఁ గ్రమ్మరించి
చలిదిగట్టించి త్రిప్పె నిస్తుల సువస్తు, న [illegible] 132

చ. ఇటులనలెఁ జూచుచుం జను నరేశను శేషయబాణు [illegible]

న్నిటమగుడించెభోగి పరిణీ తరుణీ ఫణ ధోరణీ నవా
ఘటిత మణీగణీభవపకంప ఘృణీత వియత్పిశంగ మో
త్కట ఝరిణీ సరోజ మతికారి నమేరు వనీర మారుతుల్. 133

క. అవ్వనముఁ జేరి మవ్వపు, జవ్వనవున్ రాచకొమరుఁ జల్లనిమందం
దువ్వారల నివ్వటిల్లెడు, పువ్వుంబొదరింట నునుచి భుజగ కుమారుల్. 134

క. ఇట నుండు మేము నీవ, చ్చట యురగేంద్రునకుఁ దెల్పి శోభనలీలా
ఘటనాపూర్వంబుగ ని, చ్చటి కేతెంచెద మటంచుఁ జనుటయు నతఁడున్. 135

మ. వెలుఁగు ల్గ్రాఁచగు మిన్నతీవియల తీవిన్ రాయు పన్నీటికా
ల్వల తుంపుర్లకు మారు గాఁబలెఁ జలద్వాసంతికా నూన ని
ర్మల మారందకణాళి జారి తనపై వ్రాలంగ రాయంచ తె
క్కలు ఝాడించినఁ గ్రమ్ము తెమ్మెరల రాకన్ హాయి మంచున్నెడన్. 136

చ. హడపము వీణ కిన్నెర హిమాంబువు నించిన గిండి చల్వపా
వడలుఁ గురంగనాభియు జవాదియుఁ బట్టుపునుంగు వీవనల్
ముడి విరులద్దముల్ సురటులుం దెలిపంతపు దువ్వెనల్ ముదం
బడర ధరించి యాడిగపుటబ్బురపున్ వలిగుబ్బెతల్ దగన్. 137

సీ. జిగిచాలు దగుకీలు చిగురాకునకు బ్రాఁకు కలికికోయిలలకుఁ గాలు పనుప
నెలగోవగలమోము తెలిదమ్మిఁగల తుమ్మెదలకు నమ్మిక కమ్మలలవరింప
నెఱికప్పుఁగను కొప్పుఁ నెరిమబ్బునకు నుబ్బ నెమలికిఁ ద్రోవబత్యములనుప
నునుమోవిపైతీవి మను బింబ నికురుంబములకేఁగు రాచిల్కకొళవులియ్య
లేనగవు డాలు కైదండ పూనుచూపు, తళుకుచే మ్రొక్కఁగొనెడు ముత్యాలరెట్ట
పేట పాపటబొట్టు తుంపిళ్ళు గుఱియ, నచటికేతెంచె నొకచకోరాయతాక్షి. 138

సీ. కావలిఁగనునింతి కానుకిచ్చినబంతిఁ గనుసన్న నొకకన్నె గైకొనంగ
దెలిమాపు గమి తారసిలుచు నిల్చిన యంతఁ బడతులిద్దరు బరాబరులుసేయ
నగుమోము జిగితమ్మి నిగుడు ఘర్మము గ్రమ్మి నంతుకై చెలువపానడలుదుడువ
తొలఁగు బంగరురంగు జిలుగు పయ్యెదకొంగు సకియ యొక్కతె చక్కసవదరింప
కట్టిక మిటారి యొకరి చెల్కత్తెగములఁ, బొడఁగనఁగఁజేయ బంగారుపొంతమెఱుఁగు
టరిగె గుంపుల నీడ నొయ్యారమొసఁగ, వచ్చి పుష్పాపచయకేళివాంఛదేలి. 139

క. మడమఁబడు నిడుదవాలిక, జడ నడుమున జుట్టిపైట సరిగ చెఱంగుల్
బెడఁగుఁజనుదోయి పొడ లే, ర్పడ బిగియించుచు ననుంగుఁ బడతులుగొల్వన్. 140

చ. చిలుకలలోన చిక్కులయి చెల్వపుటంచల లోననంచలై
తెలివిపొసంగు తీవియలఁ దీవియలై సరసంపుఁ బల్కులన్
గులుకుననడల్ పసిండి తలుకుల్ గలమేనులు గానుపింపఁ జే
తుల కసివోవఁ దేనియలతో ననతోయములెల్ల గిల్లుమన్. 141

సీ. కలిగొట్టుఁ జేరఁబో కలి గొట్టు సేయునీ బీరమేమిటికి జంబీరమదిగో
సిందువారము తెనె సింధు వారములేని పైరుగాఁదేఁటి కింపై రుచించుఁ
జూతము పదరమ్మ చూతము మదవతీగానంబు లచ్చోట గానరావె
రమ్మ మారుని గుడారమ్మ మారు నిజమ్మ గుంపుగోటుల గుజిగుంపులేల
యీరమా యీరమానీతి యీప్రసూన, వాసనల్ వాసనల్ వంకనందికొనఁగ
పాటలాపాటలాళిచేపడియె ననుచు మాటకే మాటకేమిలేమావివిరులు. 142

క. అని జవ్వను లవ్వనిఁ గ్రొ, వ్వునఁ బువ్వులు గోసి కడు దవులొక్కను నవ్వుల్
నన రువ్వులు కొంపరు మెచ్చనిచిన్వలు నివ్వటిల్లఁ జని యవ్వలనన్. 143

సీ. కంబముల్ గాన నిల్కడఁ గన్న పోఁక బోదియలపై వడిగాగ దీటుకొన్న
యలదీన చాలు వాకిలి సొచ్చి లేమావి గుమురుల క్రీనీడఁగొప్పకెంపు
లలితంపు మెట్లఁ గేళాకూళికవ్వల జలయంత్రములవీఁగుచలువగాడ్పు
గదియంగఁ గలువ మేల్కట్టు పూవుల గప్పు సాంబ్రాణి దూపంపుజలపపాళి
నరసిఁ బురివిప్పఁజను నెమ్మి నాస గలుగు, దాని గాఁజేపికావెడి చిత్తరువుబొమ్మ
చిలువచెలువంపు జడ గుంపు సొలపు నింప, నీఁడుగాననియొకచిన్నిమేఁడమీఁద.

క. చెలువైన పసిడిగద్దియఁ, గొలువై నలువంకఁ జెలువ గుంపులుగొలువన్.
బలువైఖరి పావడ నెల, తలు వైవఁగఁ గన్నెయున్నతఱినటమున్నన్. 145

శా. ఆజన్మస్థిర ధర్మకర్మ నిపుణుం, డౌరాజు రాచిల్క మే
త్తేజీ జోత్తేదాక పొంతకాఁడయి తనుం ద్రిప్పంగ నయ్యాంతి య
య్యోజన్ వచ్చుట గొలెఁ బూఁపొదలలో నున్నట్లువీక్షించి యా
రాజీవేక్షణ వెంటనంటఁ జని గారామార సౌధస్థలిన్. 146

క. వలభిన్మణిగణగుంభిత, వలభిం దద్రుచి తమంబు వలఁగొని పొదువన్
జలదాచ్ఛాదితుఁడగుత, మ్మలదాయ యనంగ నిలిచి ముదితం జూడన్. 147

శా. ఏకైకాంగవిలోకనాకల నతుష్టైకాంతసామంత భా
వాకూతంబులు తద్విధాత్మరచనా త్యాశ్చర్య గాథాప్త మూ
ర్ధాకంపంబులఁ దత్సమానకృత మానాధీన నానావచ

శ్రీకంబుల్ మహిపావలోకములు నారీమౌళిపై వ్రాలుచున్. 148

చ. అలికచ కావిమోవి బెడఁగానెడు తేనియ సోనవానలన్
నిలిచి శరీరకాంతి ఝరిణీ పరిణీతమౌలై కుచాచలం
బులఁదప మాచరించుచును మున్ను వరోరువిలాసిరంభతో
గలసిన కొంకుపో విభుముఖంబుఁ గనుక్ నృపవీక్షణావళుల్. 149

క. మినుకు చను గుబ్బగుబ్బలి, కొననుండియు గాఢనాభికూపంబునఁ గ్ర
క్కున దుమికి నెలవుమఱిఁ గనుఁ, గొనమి న్నృపుచూపులుడ్డుకుడుచు చు వెడలెన్.

గీ. కలికిలేగౌను నిలువెల్ల కల్లయగుట
వెస నపశ్యాంజనంబు సెవించెనేమొ
నెగడపటులయ్యుఁ బతిదృష్టి సెనుకఁ దోడఁగ
వెఱచువారలఁ గనుఁగొన్న వెంటఁ బడరె. 151

క. ఈనటవఁ జూచి నివ్వెర, గానఁ బడెన్ రాజహంస గమనాదృతిచే
మానసము మానసముగా, నానరపతి యతిశయప్రియంబు వగంగన్. 152

సీ. శాబాసు ననచెండు జిగిఁ జెండుచనులొందు గబ్బిగుబ్బలిచాలు గొబ్బఁ జాలు
హాయిసరే నెఱిమించు నచలించుకనుమించు కమ్మనమ్ముల మేలు గ్రుమ్మఁ జాలు
చాగురే విరిపువ్వు సరిరవ్వు చిరునవ్వు తొగరాచ జిగిజాలుఁ ద్రోవఁజాలు
మాయురే యళిపెంపు మరపింపు నెరిగుంపు మేలినీలపుడాలు నేలజాలు.
మెలుసంపంగి డంపలు డీలుపఱచు, కెలును నుపూలతీగెల ప్రీలజాలు
వాలుగల డాలు దొరచేతి వాలుకలువ, వాలుగాబోలుఁ దలఁప నీవాలుగంటి. 153

చ. అనికొని యాడి చేడియ నొయారపు రాశిని జేసినట్టి య
వ్వనజజుచేతికిం బిరుదు వైవఁగవచ్చుఁ గదయ్య దీనిప్రా
పున ముదమొందు కెందలిరు బొందవళీపుందొర మాచు వారలన్.
వెనుకొని పూవుటంపరలఁ బెంపరలాడఁడు మన్నమానసే. 154

శా. ఔనేకా మునుపెన్నఁడో చెలియ చాయంజూచి నట్టయ్యెడున్
గాన స్వచ్ఛ మదాలసావయవ రేఖావైభవం బింత యే
లా! నామాన సమీలతాంగి పయి లీలాడోలికాకేళికా
శ్రీనైపుణ్యముఁ జూపఁగా హవణుఁగాంచెం దద్గుణాలంబమై. 155

మ. వరభామాంగము మించుఁగా నితరముం బాటించకే మన్మనః
స్థిరహంసం బది మానసంబుగను రీతిన్ నాతి నీక్షింపుచోఁ

గరముత్సాహముఁ జెందిపొంగెడు నదేకాదా మహాచిత్రమై
యిరవొందెన్ మదినాకు నాకెవెరగయ్యెంగంటివే యిచ్చటన్. 156

క. ఐనప్పుడే మదాలస, గానోపుఁ జుమీ లతాంగి కాకుండినచోఁ
గానీ కాకుండు బలా, యీనిగనిగజిగులు గందుమే యెందైనన్. 157

సీ.* మోముచాయయెకాదు ముద్దుపల్కులలోని తటితీపు మెడగుల్కు దానిపగయె
మోవి కావియకాదు మఱిపెంపు పెంపుతో నాను జంకెన చూపు దానిపగయె
పలుసోయగమె కాదు పచ్చిదేరఁగనాఁడు తరుణిపైబొమముడి దానిపగయె
* మోముచాయయెకాదు ముగ్ధమాటకుఁ జెక్కులోనిండు లేనవ్వు దానిపగయె
అన్నియును నాయెఁగా యీమృగాయతాక్షి, యదిగొగూర్చున్న రుంద్రలీలాంబుజంబు
నలరి యొల్లమి మూర్కొన్న చెలువుదాని, పగయె కానలె బాపురే వనజజన్మ.

క. అని సమవస్తు నిరీక్షణ, మునసరిసేయంగ బుద్ధి పొడమితలఁచి యా
జనపతి రతివిపరీస్పృత. మనమతిచంచలముగాఁగ మఱియుందనలోన్. 159

గీ. ఇది మదాలస యగునేనియిచట కెట్టు, లఱుగుదెంచెనొ దీనిప్రాణంబులైన
యల్లకుండల యిప్పుడే మయ్యెనొక్కొ, వీరికెడఁబాయవలసెనో విధికృతమున 160

సీ. అలనాఁడు మందరాహార్యకందరభాగమునఁ గుంపఁగాఁ బలాశనకులాగ్ర
జాతుమాయాతి విఖ్యాతు భీతామరవ్రాతుని బాతాళకేతుఁ గూల్చి
ప్రమదంబుతోఁ దేజిపైకిరమ్మన నాలుగడుగులు పిఱుదన నఱుగుదెంచి
యటునిల్చి మురిపెంపు టల్లికసిగ్గుతో గొరలు కొంకునఁ బైట కొంగునేల
నలమి యీకాంత వింతదైన్యంబు నెట్టి, కొనఁగ ననుఁజూచి దానిఁ జూచిన నెఱింగి
వనితతోఁ గూడ దానినావెనుకనుంచి, తోడితెచ్చితిఁగాదె మత్పురమునకును. 161

ఉ. అంబరవీథిపైఁ గువలయాశ్వము మీరి చకోరి కొలవే
గంబునఁ బోవ వెన్నువెనుకందగుదాని వశంబుగాక రాఁగ
గంబునదాని మోవిపలుగంటొనరింపక దానిపాలభా
గంబునఁ జిందులాఁడు నలకంబులు దీర్పక మోసపోదునే. 162

చ. విడివడిరువ్వనన్ గగనవీథికిగుఱ్ఱము చౌకళించినన్
వడకుచు గబ్బిగుబ్బల మొనల్ వెసవెన్నునదాఁటి రొమ్మునన్
వెడలఁగ గోలతుంగ భయవిహ్వలమై ననుఁ గాగిలింప న
ప్పడతి మదీయ వేగ రసభంగ మొనర్చె భయంబుఁ దెల్పుమన్. 163

సీ. ఎదురుదోపలెనంచు నేతెంచు మున్నెవారలఁ జూచి చవ్వునవ్వులనెతియగ ✓

దొరలు వచ్చిరటంచుఁ దిరుగు త్రొక్కుళ్ళ నియోగు లొక్కొకచోట నొదిగినిల్వ
నలయమాత్యులునిల్చి టరసి ప్రాభ్విలను గంచుకిముక్కు మొకముఁజూడకయెతెఱుమ
గట్టికవాని యాగ్రహస్మృత్తిఁగని పౌరు లంతంత సన్నఁగ నణుఁగుదేర
నభ్రయానంబు వీడి హయంబు పురముఁ, జేర నీనారి తిరిగియాచెలువ నడుగ
యదియు నావల్లఁ దెలిసి యియ్యధిపవర్య, కటకమని తెల్పనలిగితిగాడెమున్న.

క. అటువంటి కూర్మికత్తియ, కుటిలాలక నెడసె నేమొకో యదివిధిసం
ఘటనము గావలె నీవలఁ, గటకట యీకార్యమెట్లు గాఁతినఁ బడెనో 165

క. ఆనిపతితలపోయఁగ నం, పున వీణియలందు గీతముల్ వడిఁ బలికిం
చినగతి వినఁబడె నిద్దఱ, వనితల యన్యోన్యకలహ వాచాప్రౌఢుల్ 166

సీ. చనవరినలె నెందుఁజనెదు వద్దములేక మాకును నొకయడ్డమా మృగాక్షి
యంతటి దొరసాని వగుదు వెవ్వతెవీవు, తెలియదే యింద్రునికొలువుదాన
నతనిఁ గొల్చిన వారలరయ నెంపరులేరు వారిలో నెంచఁగ తారగానె
యిటు నిల్వ మెవ్వతె నైన నేమిభయంబు నిలునదీరదు పోవనలయుమాకు
యెంతవేగిర కత్తివే యింతికాన, మామగువగొల్వ వచ్చితి మో మిటారి
యేరిఁ బోలుదు కొలిచినవారిలోన, సుదతి యాకారగరిమంబు చూచిపల్కు. 167

క. అనుకలకలంబు చెవి బడఁ, గనుసన్నసె యవసరంపుఁ గల్కిమిటారిన్
వినిరమ్మని చెలి పంపినఁ, బనివిని యదివచ్చి వినయపరవశయగుచున్. 168

చ. సముఖమువారిఁ ద్రోచి బురుసాపని చీరజరీచెరంగు వ
క్త్రిమునకు మాటుసేయుచుఁ బరాకు లతాంగి సురేంద్రు కొల్వుబో
గము వఁట పేరుతార యనఁగా నుతిఁగన్న మిటారి యెంతగ
ర్వమొ యిటుచొచ్చి రానచటి వాకిటి కావలి చెల్వ నిల్పినన్. 169

క. వారల జగడపుమాటల, తీరిది వేఱేమిలేదు దేవి యనఁగఁగ
న్యారత్నంబును విస్మయ, మారంగను గొమ్మనిక్కమంతయు వినుచున్, 170

గీ. ఎదురుగా నేఁగి యానెకా యచట నిలిచి యెంతవింతనటించితి విందువదన
చాలురావక్కయనుచుఁ గొంగేలు వట్టి, తోడుగొని పోయిబంగారు మేడమీఁద.

చ. కలప మలందుచో నొలుకు కస్తురి చిందులచేత ఘుమ్మనన్.
వలపు నెఱుంగు బంగరు తివాసిపయిన్ దగునొక్క రంగుకే
ల్సలువు పరంగిలాగి జిగిచొక్కపుఁ గద్దిగ మీఁద నిద్దరల్
డలగొడుఁ జేతులూఁది చిఱునవ్వులతో వసియించు యున్నెడన్. 172

గీ. రాజముఖి కొంతవడికి దారావఘూటి, సొగసు నెమ్మోము( దప్పక చూచి పేర్మి
నువిద నీ వెంత కొంచకత్తెవె జయంతు, గాపు( జేసిన గరితవు కావె నీవు. 173

క. అనిపల్కు నందులకు( బ, కు్కన( దారయు నవ్వ నచట హరజూటవనీ
వనితామర లోకఘనీ, వినుత ఘనీభూత రుచుల వెన్నెల గురిసెన్. 174

ఉ. ఆవనజాక్షి యంత దివిజాంగన కేలు దెమల్చి యిట్లనెన్
యావిధమేమొ లెస్స విననైతి పరాకున మున్ను నీకథల్
నీవె వచింప(గా వినవలెన్ వివరింపుమటన్న నేమి లే
దే; వినవే యటంచు నది తెల్ప(దొడంగె నుదంతమంతయున్. 175

చ. కమలపత్రేక్షణా యమరకాంత్రు జయంతు(డు నేను గూడి యుం
టి మి కప నా(డు వాని నెఱనీటులవెక్కుడె వాని వింతయం
దములకు వాని యిచ్చకపు( దల్కులకున్ మఱి వానిమేనిడాల్
కొమరున కేను మేలువడి గుత్తకు నిచ్చితి నేమిచెప్పుదున్. 176

సీ. ఇంద్రుకట్టెదుట నేనృత్య మాడెడు వేళ బుడుతలచే నాకు మడుపులంపు
అమ్మతో నొకకొని నలుక గడింపుచు నెటులనో నాయింట నేవసించు
తో(డితొలొత్త మాదులు వచ్చిపోవ(గన్న నను(జూచి కనుగీ(టి నవ్వ(జూచు
నెవ్వరు వినిపించి రేనియు విననట్టి మనవి నే తెల్పినంతనె ఘటించు
ప్రొద్దుపో(కకు( గస్తూరి బొట్టు( బెట్టి, కీలుజడయల్లి సురతావిపూలు జుట్టి
సొగసు(జేసి యెగాదిగ(జూచి సిగ్గు,మురిపెమును బొందు నను(జేరి ముద్దు వెట్టి. 177

చ. సవసవ( గానెఱింగి తనుజాతు(డు నేనును నుండ( గొల్వులో
దివిజవిభుండు లే(గవు( దెచ్చికొనున్ శచియల్కు( జూడ( దై
తవమున( బిల్వనంపి నను పస్పకజూచుచు సొమ్ములెల్ల మ
క్కువనొస(గుం చురుక్కురని కోపలి(జుంకెవచే నపల్కుచున్. 178

క. ఈకరణి న్నాతోడిదె, లోకంబైయుండ నేను లోనగుచు( బురీ
రాకేందు వదనలాకద, నీకడ ననుకొన(గ నత(డె నేనైయుంటిన్. 189

సీ. పనియుండి యెడ(బాసి చని రాకయున్న నే బిలువ నంపింతు నెచ్చెలులచేత
వనిత యెవ్వతె హత్తు కొనునొ వీని నటంచు వెంటనే బుడుతల వే(బనుతు
నతని నెవ్వరు దూరనాడిన వారితో( జలపట్టి నట్టివాదులకు( బోదు
దవిపాదపస్మృత నత(డొనర్చిన మోవిగంటి పిమ్మట నొవ్వ(గా నపల్కు
జాడు నవ్వుదు నింటికి వచ్చెనేని ప్రేమ నాల్గింప, నే దెబ్బదేగ యుందు

రిచ్చవడుమోముతోఁ జేర వచ్చెనేని, గుండె నెగ్గున నేమనుకొందు నబల. 180
చ. వలచుట జాతిలోనఁ దలవంపగు నే కద యింకఁ దాఁచఁగా
గలిగెడి దేమి నానపుకాంత్రను దొల్లిటి వారి వీధిలోఁ
పలఁ గనినంత వెచ్చనగు బాటున కోరిచి యన్నదమ్ములన్
బిలిచి వరీతిఁ బిల్వ వలపించెఁ జుమీ యతఁడంబుజాననా. 181
గీ. అట్లు వలపించి లోనయ్యె నంచుఁ దెలిసి, తరుమ కావళ్లు పెట్టి మాయిరుగుపొరుగు
చెలులతోనైన ముచ్చటఁ బలుక నీక, త్రాడు గట్టిన వాని చందాన నేలె. 182
సీ. పలుక నియ్యడు కమ్మవలపు హెచ్చిన నాసనములు దెచ్చిన యింద్రవనితతోడ
జూడ నీడొకవేళ జోగునకై వచ్చి మేలు దెల్పెడు జోగురాలి నైన
గూడఁగానీడు కొక్కోకంబు చదువుకోఁ జేరు వేలుపు రాచ చిన్నపడుచు
సరసమాడఁగనీడు వరుసఁ దప్పక తెచ్చి విరులిచ్చు పుష్పలావికలతోడ
అకట యేమందు తల్లి యిల్లాలికైనఁ జెపఁగలదు గాని వానిలోనదచుబాని
కుబుసు పోకడ నేని వేఱొక్కదారి, మిసుక కూడదు మేరకు మేరగాక. 183
సీ. తారానఘూటి బందాకోరుగాఁ జేసె మనజయంతుఁడె జాణయనెడు వారు
నదిగాక మోహింపఁ డతని బొటుగ నేలుకొనుటకై యట్లున్న దనెడువారు
దీనికేమాయెనే వానిఁగాక మఱెవ్వరిని బిల్వఁదఁట చూడు మనెడువారు
నది బుంతవాని మాయలకు లోగునె యెంపరిని జక్కఁ బెట్టునో యనెడువారు
నన్నుచు నచ్చర నెచ్చెలు లాడుకొంద్రు, నిగళముల తోడ మదహస్తి నిగుడు పగిది
వెంటఁ గావలి మాష్టీలు వేగిరింప, భూధరారాతి నగరికిఁ బోవువేళ. 184
కం. అతఁ డెంత యెంచినను సం, మతమై మదిఁ దోఁచుఁ గాని మఱి యితరవిటా
యతనానావిధలోక, స్థితి గొంపల మొంప వలపు చెడ్డది సుమ్మా. 185
చ. అడకువగాని పేరిమి జయంతుని పట్టున నొక్కతీరుగా
నడతునెకాని మున్నె నెర నమ్మిన నెచ్చెలి కాంద్రుఁ వచ్చినా
కడపయ మెట్టిరేనిఁ జక్షుకాపడ నిత్తు విరుల్ దుకూలముల్
విడెములు నాదిఁ గాగ నను వేఁడక మున్న ప్రియంబుఁ జెప్పుమన్. 186
క. మిన్నక తతదీయసఖు తే, కన్నియగా వలెనటన్నఁ గానీ దానిన్
చిన్నారి నగవు మాపుఁ, సన్నగ రప్పించి కూర్తు సమ్మద మొదవన్. 187
సీ. ఒరపుగా విరులతో నెరికొప్పు ఘటియింతు నదిమాసగిజ్జఫయుల్లి కొంగు
గిలుదము సుస్మితి గాజునామము చిత్తు నదిమాని జిల్లి బొట్టుఘటింతు

వలిపన్నుఁదోయి గొప్పుపైఁ జడగీలింతు నదిమాని ముత్యాల హారముంతు
మినుకు పైకపు బ్రాతపని చీరఁ గట్టెదాల్తు నదిమాని తెలిచల్వ యలవరింతు
రవిక బిగియింతు నదియును నవలవైచి, కుంకుమపుఁబూత చిమ చిమఁగొనెడు దిన్ని
పచ్చికొనగోటితాఁకులు రచ్చసేయ, గుబ్బయరగానరాఁ బైటకొంగువైతు. 188

చ. వినుమిటులుండఁగాఁ దిమిరవేణి కుబేరుఁడు కమ్మపంపఁగా
దిన చిరి చీటులందు గడిదేసు జయంతుని వర్తమానముల్
వినినలకూబరుం డదిర వేలుపు ఱేని కుమారునిన్ మూవం
బెనయఁ గనింత పేసెనిది యెంతటిదో యని విస్మయంబునన్. 189

సీ. తిరుగఁడే కొన్నాళ్లు సరసీతిలోత్తమా పుంభావ సంభోగములకుఁ జొచ్చి
చెలఁగఁడే కొన్నాళ్లు చిత్రసేనాకంతు పారావతారావ పటిమఁ దగిలి
నడవఁడే కొన్నాళ్లు నవమేనకాధరాధర సుధాపాన విస్ఫురణకలరి
మెలఁగడే కొన్నాళ్లు కలితోర్వశీవశీకరుణాకరోక్తి వైఖరికిమెచ్చి
కెరలి దెరగంటి దొరసూతి కేళులందుఁ, జొచ్చిచూడక మానినచోటుగలదె
నన్నుఁబలె యొత్తుపైఁబడియున్నవాఁడె, సుకరముగమేలువడెనె వాఁడొక తెకేని.

గీ. చదివికొన్నాఁడు మదనశాస్త్రంబులెల్లఁ, దెలిసికొన్నాఁడు వెలమిటారుల బెడంగు
కొసరు వగలెల్ల నటువంటి క్రొవ్వెడుకాని, వలచి వలపించుకొనియె నే వనరుహాక్షి.

సీ. అతఁడింటి కల్లంత నరుదేరఁ దావచ్చి మించుచూపులనె తేలించునేమొ
యతఁడు కీల్జడకేల నదిమిన మేనోసరించి కోపమున గద్దించునేమొ
యతఁడించుక పెనంగి యలయఁ దానదలించి మించి పైకొని పచారించునేమొ
యతఁడు చక్కెర మోవి యానఁ దా గుల్కు టెల్గించి బిగ్గఁలఁ గౌగలించునేమొ
బెడఁగు మొనపంట నగమొకు మడుపులిచ్చి, కొసరుమాటల మఱియును గూడ నెచ్చ
రించి యాతని కాసపుట్టించునేమొ, బాల సురతాంతమందు బాగాలొసంగి 192

క. ఇదిగంటివి యీనరకున్, మదనక్రీడారహస్య మతికోవిదయై
ముదమునఁ దేలింపుచునను, చదురాలై యిపుడుచాల జోక యొనర్చెన్. 193

సీ. నేనచ్చువేళఁ దానింట నుండకపోయి పొరుగింట నిరుగింటఁ బ్రొద్దుగడపు
నలవాడు నీచుట్టు మరుడెంచె ననిన నేమాయెలే వచ్చుఁ గాకంచు బిగియు
నిలలేక స్వయముగాఁ బిలువఁబోయినఁగాని బెదరించు నిదిగొ వచ్చెదనటంచు
వలసినప్పుడువచ్చి యలిగియున్నట్టినే పలికించుదాక దవ్వుల నెనిల్చు
నంతటను నేనె పైటకొంగలమి బలిమి, సెజ్జపై జార్చి యలుకలచిక్కుఁదీర్చి

మ్రొక్కుచు నపల్చి నను పోకముడి వదల్చి, కరఁగఁ జేసిన యటుమీఁదఁ గౌఁగిలించు.

చ. పరిపరికేతులం బ్రసవబాణుని కేళి యొనర్చి తొంటివై
ఖరి నెర పాయతంపు రొదగా నఁబడం దలయెత్తి నామనో
హర దవునీవ యంటి నవురాయను నంతటి పారవశ్యముం
బొరయుదు నున్సరించుఁ గను మోడ్చుట లేదిపు డించుకేనియున్. 195

క. నెనరైన దాఁకిటులవలె, గనరైనను వీడ చూచెఁ గడుమాలిమిచే
దనరంగ స్మృతులు నెయ్యోడ, పనవ వెయతి పరిచయావజ్ఞాయనఁగన్ 196

గీ. దీనిపాగరార్చ నెరనేర్చు దిట్టతనము, మురువు హరువును గల జగన్మోహనాంగి
లేమగా యంచు దివిని గాలింతు నేఁడు, కలిగెఁ గా తార నవకాంతి చలితతార. 197

చ. అని చెలికాంత్రతోడ నతఁడాడిన ముచ్చటలెల్ల వారనన్
గనుఁగొనివచ్చి యిచ్చకముగా వినిపించిన నెంత మాట చ
క్కని జవరాలు రంభ యదిగాక జయంతుఁడు తామునుండు వ
తక్షన కిదిమెరె తామెరుగరాయని చీటిని బుచ్చి పంపుదున్. 198

ఉ. అంతట నొక్కనాఁడల ధనాధిపుఁ డశ్వము వాఘ వెక్కసిన్
రంతులు మీర నెక్కి పెనురౌతప జోడన చెల్వఁ జూపుచుం
బంతము మీర వీథుల దుమారము రేఁగ సవారిఁ జేసి ప్రా
గ్దంతయు నెక్కఁగా నడుమ యించుక మేఁ శ్రమంబు పూనఁగన్. 199

చ. హరిగెలనీడ వేత్రధరు లయ్యెడ నామములుగ్గడించి హె
చ్చరికె యొనర్చ మ్రొక్కు భటజాలము వీడ్కొని యాస్యపద్మముం
బరిజనులంప పుంజలువ బావడలందుడునంగ నాత్మసుం
దిరమున కేగి యందు నొక తిన్నని కెంపుల తిన్నె నిల్చుచున్. 200

ఉ. జెట్టులు చేరిలేత విడి చెందొవ పాతరుమాలువున్ సిగం
జుట్టి యలందు కుంకుమపు సోకుల బంగరు తీగె రంగుని
ట్టట్టిన నీని జందెము భుజాగ్రమునం బడవైచి సీతకృతుల్
దట్టముగాఁగ వింతవగలన్ మెయిమర్దన సేయునత్తరిన్. 201

చ. చెలువపు వెన్నతోఁ జలిదిదిక్కములున్ మెడత్రాఁడు చీఁకటుల్
గులికెడు నీలివట్టి పొరలోపల కమ్మచెరంగు వెన్నునం
దొలకెడు నెత్తి జుట్టు తెలిదుప్పటి వీనుల మానికంపు నా
గుల పడగల్ దహిజ్ఞ దగనొకొండగు యొంటరి బోయఁడు పతిన్. 202

గీ. వచ్చి యనఘాయ కువలయాశ్వక్షితీంద్రుఁ, డల్లపాతాళకేతుఁ గీటడఁచె ననుచు
నవటికి నగుదమనుండి సురాధినేత, మిమ్ము రమ్మనియెడి యుత్తరమ్ము ననిచె. 203

క. అని వినిపించు కుబేరుని, కని చెంద్రిక మీఁదవ్రాసి యంచు శిఖావే
సిన కమ్మ గద్దె చేరుచు, ననిచిరఁ జూచుకొని చుట్టి యున్ముఖుఁడగుచున్. 204

సీ. హరినీలములమేడ యవలకెంపుల సజ్జ కడమకట్టఁగ నూతనర యొసంగి
పెరవోట పడిదాఁచిపెట్టిన నవనిధానములు దేవాప్తసంఘములఁ బనిచి
కారుకు లెత్తి చక్కఁగఁ జేయుఁడలచైత్రరథమని తన భటప్రతతిఁ బనిచి
యరయమిచే డొక్కలంటి పెట్టుకయున్న యిభకోటులకు మేపులిడ ఘటించి
పుడమిఁ బాతాళకేతుండు గూడసినపుడె, నిత్యముగ నిల్చె నలకాధిపత్యమను మ
ననిమిషాధీశ్వరుని చెంతకనుపఁదలఁచి1 పుత్రుఁ బిలుమన్న నూడిగంపుభటులపుడు.

గీ. తోడి యక్షకుమారుల తోడఁ గోడి, పడవగొడవలఁ బడి యరపతిసుతుండు
గాడమైల శిలాయస్త్ర కాకినన్నె, మొదలుగాఁగల కుక్కుటంబులను దెచ్చి 206

ఉ. పట్టెపు జుట్టునిక్కు మెడ బాగునఁ జివ్వనయారె పొంకమున్
రెట్టల బల్మి నెమ్మిఁ బురణించిన యీకల జోకులున్ దగల్
గొట్టక యుండ మేపు పలు కోయపుమందులు గల్లు పుంజుఁ జే
పట్టి గ్రహంబు వెన్కఁగనుపట్టఁగ నల్లలు దీసి యంతటన్. 207

గీ. ఎదుటిదానిని విడుమంచు హెచ్చరించి. యతఁడు తన వేగిరింప మ్మల్లాడికొనుచుఁ
గినిసి యొండొంటిఁబిట్టుదాకించి యీసు, బోడము రెంటెనిగదియించి విడుచుటయును.

వ. అప్పుడనిర్వార గర్వధామంబులగు నత్తామ్రచూడ సార్వభౌమంబు లతి రూక్ష వీ
క్షా పరంపరలఁ జురం జురంజూచి పవరంజుకొని జుంజురించిన మెడలు నిగుడింపు
కొని సాటిలేని యీసునం గాటియ్యక తియపులుగట్టిన యొరపునందిరుగుచు నింపు
సొంపుల గుంపులు గొని నిజవిజయపరాజయంబులు గోరుచునొకళ్ళొకళ్ళ త్రొక్కు
ళ్ళఁ బోడము జగడంబుల జరాలుమనంగటూములు దుస్సుకొని పెద్దలు వారింపం దే
రి యచ్చటికింజేరి మూఁచుకొను కొంచెపుగాండ్రు పెడమోము వెట్టినటేంక వెంటను
ట్టినడువ గోడి నెత్తికొను పోవుచు నెట్టికొనిపగలు తొట్టినం బట్టి యీకలం దె
మడ వెడలించి పన్నీటితేటల రెట్టలకుం జలున పుట్టించిన కట్టలుకరబట్టి తప్పించు
కొని యొండొంటి నంటి నొప్పించుచు నేవమీరి గౌతమమునిపుంగవాంగనా మా
న భంగకరణాది కారణారవ నిర్జర చరణాయుధలోకపట్టభద్ర గెలిచితివనుచు
నుతింపఁ బంచె పన్నెపావడలు వైచుచు మచ్చరంబున నిరువాగును నెచ్చరించి

న నిలిచి తన్నుఁ బోయి నెపఁగు జేరకుమారుని కుక్కుట కంఠీరవంబు వెనుక నడని
కేడించి చుట్టుకొని చురుక్కునం జుట్టు నొక్కినఁ గ్రక్కున నది లేవనిపించి యె
దిరి చరణాయుధంబునకు నడ్డంబుగా నడచి యారె విరుగంపన్నిన నంజక యక్షకుం
జరుని పుంజు బిరబిరంజుట్టి రెట్టలోపలంపలసానిపి గిలిగింతలుగొనినం బ్రతిపక్షియు
నెగిరి తప్పించుకొని గుప్పున నవ్వాలం గుప్పించి యెదురై యులికి కరము వంగురిన
నలకూబరుని కోడియు సమంపరయంబునం గ్రిందికిఁ వగ్గి నెత్తుయ జొత్తిల్లఁ గుప్పక
కఱచి వెనుకకు మ్రొగ్గి యీడిగిలంబడిననరాతియు మెప ముడివిడిపించుకొని త
రిమిన గ్రమ్మికొను చెమ్మటనపయ మున్నెయోడెననుచు నెల్లవారలు గొల్లుగొల్లున
నవ్వుచు నెన్నుకొనం గిన్నరరాజకుమారుని చరణాయుధంబు సేవదేరి యడియాస
లంపన్నికొని పచ్చ నభియాతినలయించి సిలువంబడు నెడం జేరి పారిపో
వంపన్నిన. 209

గీ. కేరితోడఁ దట్టికొని బిట్టుకేక వైచి, మీసములు దీటి యెదిరికిరోస మొదవ
డవిణ వాయింపఁ జేయుచు డాసి పుంజు, నట్టె మాచుచు నున్నట్టి యతనిఁ గాంచి.

చ. ఉడిగపువారు చేరి సమయోచిత మేతగఁ దెల్పుసుద్దులే
నుడువుచు నొగదా యని కనుంగొన దేవర సంతరించు నె
క్కుడువగపుంజుతోడ నొకకోఁడి యెదుర్చెనె యంచుఁ జెంతకుం
వడిఁజని యయ్యగారుపిలువంబనుపం బని వింటి మంచనన్. 211

సీ. ఒక్కఁడు చెంపకై యొరఁగుపువ్వులతోడి దసిలీరుమాలు నందముగఁ జుట్ట
జేరి యొక్కండయ్యగారిచ్చుకట్టు వర్గములకు ముల్లెలు గైకొనంగ
నొక్కండు దరహాసమొదవంగ నేటికుక్కుటము కేడించిన గొడవఁ దెల్ప
నొక్కండు రంభాపయోజాక్షి పడవగెల్చినమాట వినిసంతసించుననఁగ
వఱిగి తండ్రికిఁ బ్రణమిల్లి యతఁడుకమ్మ,నచ్చుటలు దెల్పి తేజీదు వాలి నోలి
నలసియున్నాడ నీవేగు మనుచు ననుప, నగుమొగంబున వీయని నగరువెడలి. 212

సీ. సానిపటాణి తేజీని ముందరనిల్పి సామి యటంచు సలాముసేయ
మావటీఁడు గజోత్తమముఁ దెచ్చి యంకుశంబు దనర్చు కేళితో మ్రొక్కువేయ
సారథి రథముకన్ చాయను బోనిచ్చి యటునిల్పివచ్చి జోహారుసేయ
దాక్షాధినాదు డంపళము ముందరనిల్పి తమిపపాత్తులతోడ దండమొసఁగ
పావలటు మీటి కొల్లాయ బండియెక్కి, దురదురన రంభ యింటికినరిగితనదు
పలుకన మెచ్చింపి సమ్మనపనిదాని, గుస్తరించుచు ననిపించుకొని యాతండు. 213

చ. స్ఫురితవిభాసమానమగు పుష్పకనామ విమానమెక్కి ని
ర్జర తతి తోడ వేఁగి దితిజక్షణ శిక్షణ దక్షరూక్షభా
స్వరశర సాంద్రు నానృపతి చంద్రు నుతించుచు సురేంద్రు వెంబడిం
జరిగి శుభాకరంబగు తపేయపురంబును జేరి యందులన్. 214

క. అల యదితి విప్రపూజలు, సలుపంగను గోనఁగఁ బాకశాసనుఁడుతనున్
నిలుపంగ నులుపానించిన, చెలువొందెడు విడిదెలో వసించెనతండున్. 215

గీ. అనమదాలస తారామృగాంకవదన, తెల్లముగ మీఁది కతలెల్లఁ దెలుపు మనియె
ననిన జైమిని ముని యావిహంగములన, నంతరకథావిధం బెట్టిదని యడిగిన. 216

అశ్వాసాంతపద్యములు

శా. సంధ్యాతాండవ చండ ఖండపరశుస్ఫాయ జ్జటా మండలీ
సంధ్యాహిండితగాంగ భంగజ మిథస్స్వాఘుర్ణి పుంజీకృతా
వంధ్యారావ ఘుమం ఘుమోన్నతి సప్రగ్వాజ్ఞాల పుణ్యాకృతీ
వింధ్యక్ష్మాధర కూట కోటి విచరద్విద్వేషి యోషిత్తతీ. 217

క. అమిత ప్రతాప తాపని. సమదాన విభావభావ జన్మాకారా
నుతగోత్ర గోత్రభిష్టుత, హిమకరనిభకీర్తికాండ హిమకరగండా. 218

మాలిని. ధరణిపకులసోమా, దర్పితారాతిభీమా పరిహృతకవిభూమా భానుసంకాశధామా
సరసకవన భోజా సాధు సంతానభూజా, మురరిపునుతి తేజా మూర్తిమాంబాతనూజా.




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయాభరణ నారాయణభూపాలతనూభవ శత్రుగోపతాప సేంద్రచరణారవింద సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజితచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము.

సమాప్తము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## పంచమాశ్వాసము.

---

క. శ్రీకర సదనము తిమ్మధ, రాకాముకగర్భజలధిరాకాచంద్రా
లోకనుత దానగుణ సం, ధాకర్ణసమాన సారణ నరేంద్రమణీ. 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
నమ్మదాలసతో మనోహర సుధా, విధానధాన వచోరీతిఁ దారపలికె. 2

వ. అవ్విధంబున నమరావతీపురంబుఁ జేరి నలకూబరుండు. 3

మ. తననీటుల్ మెఱయించు జేన పొదవుం దాల్మింటి యందంపుఁ గుం
దనపుంవల్కులుఁ గుమ్మరించు చిరుసానాకత్తిచిమ్ముం గళిం
బున గోరొత్తుల పేరి యారజపు సొమ్ముల్ మోవిపైఁ గెంపు ని
గ్గను మీసంబులు దిద్దినాడికొను జగ్గుల్ మీర నావీనులన్. 4

సీ. చూచి దిగ్గన లేచు సుదతిఁ గూర్చుండవే యనుచోట మొగమున నలరుకులుకు
రంభ సేమము వేఁడు రమణీమణి మొగంబుఁ జూచుచో నవ్వులో సోలయు హొయలు
నెదురుగాఁ జనుదెంచు నింతి మ్రొక్కులనందికొను చోటఁ జూపులోఁ గులుకు సొగసు
కనియంపలము డిగ్గు వనితతోఁ బరిహాస మాడుచో మాటలో నందగింపు
బుడత లందిచ్చు తెలనాకు మడపు పంట, నందికొనునీటు నుడువులో నారజంపు
బిత్తరపుపాట రొమ్ములో బిగువు నెగడ, నేఁగు నాకారి వెంటనయ్యెమ్మెకాడు. 5

ఉ. చక్కదనాలకేమి నెఱజాణవునే కద తప్పగాదు లే
చెక్కుల రంభ భాగ్యము కడింది సుమీ యిటువంటి నాయకున్
దక్కఁ బెనంగెఁ జూడు మనినం బిగువెత్తెదు నీకురోసమా
యొక్కడిదో యటంచుఁ గలహింతురు నాథులతోడ నచ్చరల్. 6

చ. అలిగెడుతీరు వేడికొను నందముఁ బొందికలోని పొరువా
పలుకుల భేదముల్ సురతబంధములుం గళలంటు వైఖరుల్
వలపులు రేఁచు నేర్పు నెరవాదులతో వివదించు కట్టుఁ గొంగు
లముడివీఁడ నచ్చరలు సంపయి పొందు వినన్ ముదంబునన్. 7

చ. వెలుపలిదప్పు నొక్కయెడ వేలుపుసానికి వన్నెకానికిం

గిలుహాము కత్తైనేని జతనంబునఁ జేరఁగవచ్చి రోసపుం
బలుకుల వాదు రేపి శిగపట్లకు డగ్గరఁ జేసి క్రొవ్వునం
గలకల నవ్వువాఁడు చవుకట్లసియాడ రుమాలు వీడఁగన్. 8

సీ. సంగీత మేళముప్పాంగఁ దేదీ నెక్కి కంప మంటుచు రవగాలు చూపు ✓
పగటుపావలు మెట్టి బట్టు కైవారముల్ జోడింప హురిగెల నీడకేగు
విచ్చుకత్తులవారు వెంటరా నంపలంబును నిబ్బరంబుగాఁ బోవనిచ్చు ✓
జేగను బూని మాష్టీని సుద్దులు చెప్పికొనుచు నెచ్చెలికాండ్రఁ గూడి యరుగు
పికిలిపిట్టల కోట్లాటఁ బెట్టి చూచు, దిట్టతనమునఁ జెఱకు పందెంబు లాడు
డీకొనఁగఁజేసి యనికిఁ బొట్టేళ్ళవిడుచు, రంభచుట్టంబు వైభవప్రాభవమున. 9

సీ. అమ్మకచెల్ల చోద్యముగాక నామీఁద మనసు పుట్టునె వానికను మృగాక్షి
యెన్ని మాయలు గుత్తకున్న దానిదొరంగి యసల మాటాడునే యనుల తాంగి
కాక మరేమి రంభాకాంతతోడి కయ్యాన కివ్వతె యోర్చు ననువఘాటి ✓
అనువుకాదయి తన యక్కరదీరిన నవటికే చనుగదా యను మిటారి
యైరి గుజగుజలాడుచు నాత్మవిటులు, కొసరుఁబల్కులతోఁ గుచ్చిగుచ్చియడుగ
నేమి లేదని మాటి సారేందువదన, లాతఁడడిగింప నిజగృహాభ్యంతరముల. 10

ఉ. నంటున నొక్కవేళ సురనాథకుమారునిఁ దోడికొంచు మా
యింటికి వచ్చి సిగ్గుపడి యేఁ జన నానలు పెట్టి పిల్చి క్రేఁ
గంటనె నన్నుఁ జూచి యరుగుంగవ యేమిటికో యలంతు చొ
క్కుంటఁగ మోవి నొక్కికొని యాపల యూచు నొయార మేర్పడన్. 11

ఉ. అంతట మేళవించిన యొయారపుతంబుర చేతికిచ్చి యే
వింత పదంబుఁ బాడఁ బదివేల విధంబుల మెచ్చికొంచు మే
మింతటఁ బోయి రా వలసదే యని దుప్పటిఁ దెచ్చి కప్పుచోఁ
✓ గొంత కరంబుగీరుఁ గొనగోర ననున్ మను మేను జుమ్మనన్. 12

క. అది మొదలుగ నితరవధూ, హృదయంబులఁ దన్ను నిలువనీయనికతనన్
సుదనుఁడు నామదిలోపల, సుదతీమణి తనబలంబుఁ జూపందొడఁగెన్. 13

క. నానాటఁ బాటలాధర, యేనాటలు పాట లుడిగి యినుమడికోర్కుల్
లోనాటఁగఁ బ్రమావ, ధ్యానాట మనోంబుజాతమై నర్తిలుచున్. 14

ఉ. నెలికితనంబుఁ జేసి సయగారము [illegible] యంత యేమిరా
పలుకవు చింత[illegible] మనసు పా[illegible]నొ యేమిటఁ బ్రొ[illegible]పోదురా

యల నలకూబరుం బిఱువరంపర యంచును బిల్వఁబంచి సొం
పులఁ గడకంటిచూపులనె ముచ్చట తీరఁగఁ జూతు నాతనిన్. 15

ఉ. జవ్వని యించుకే మొగము చాటున నుండఁ గుబేర సూతి యా
పువ్వులనుండి నాపెదవి తప్పక కన్గొన నే నెఱింగి లో
నువ్విలుఱూర ముద్దుమొగి యూరక తాబయలానినందుకే
నవ్వఁగఁ దానునవ్వి సురనాథకుమారునిఁ బిల్తునాయనున్. 16

సీ. వానిఁ యొయ్యారంపుఁ బావలు తెప్పించి సిబ్బెంపుఁ జనుఁదోయిఁ జేర్చుకొందు
క్రేవఁ దప్పక చూచి కీవిగా వాడంత ననుఁ జూడఁ జూపు గ్రక్కున మరల్తు
వానిపైఁ బద్యమెవ్వరు లేనివేళఁ బాంచాల శయ్యఁ బొసంగఁ జదివికొందుఁ
బరులతో నర్మోక్తిపలుక నే నెఱిఁగి లేనగవుతో వానినెమ్మొగముఁ జూతు
మఱియునొక్కొక వేళ సుమాళి మొరవఁ, బరిమళంబుల బాగాలు పలకనుల్చి
నే నొసంగఁగఁ గొంకిన దాని కరణిఁ, బ్రియునిచేతనె వాని కిప్పింతునమ్మ. 17

చ. అలికచ జోలి తప్పనటు లయ్యెడు నాదువికార మంతయున్
దెలుపఁగ వచ్చినన్ వినఁగదే మఱియంతట నొక్క నాడు నె
చ్చెలులమొరంగి కేళిగృహసీమ జయంతుఁడు లేనివేళ గు
బ్బలపయిఁ బైటజారఁ బువుపాన్పు పయింబడినెమ్మనంబునన్. 18

సీ. ఇది యేమిచోద్యము మదిలో వితావితా నలకూబరుని మీఁద నా పెంప్రేమ
దొర కుమారుండును దురుసు కటారిగా డీ జయంతుఁడు బాయనీఁడునన్ను
వాడైన మఱిఁ గొంచెకాఁడు మాష్టిని జోకలు జూపఁదగు పగకాఁడు కాని
యంపఱిలో మున్నె యగడాట చాలదే యింక గొహోరు వాడేల తనకు
నేటికి గొహోరు తనకు నాకేల వెఱవ, నౌర యిల్లాలనా వారివారికరణి
కంటికింపైన వానితోఁ గలసి మెలఁగ, నన్నుఁ గన్నాఁడు మావారి నాయకుండు. 19

ఉ. ఒక్కటి రంభ యేమను నొకోయని లోఁగుట యంతె కాక నా
కెక్కడి యాజ్ఞ యాసరసిజేక్షణకైనఁ బనేమి యొమ్మొకా
డొక్కతె సొమ్ముగా నిలుచునే యది యేలిక సానియే యిదే
మక్కట మైన దాని నిలయంబున నుండఁగ హత్తుకొంటినో. 20

ఉ. అందులకేమి యప్పటికి నైనటు లయ్యెడుగాని నేను వా
రింపరు గానకుండఁగ ధనాధిపపుత్రుసఁ దెచ్చి కూర్చి నా
రెందు మహేశ్వరోక్తి ఎని యొప్పరితో నెఱింగింతుఁ గూడ దీ

యంపము లెస్స యంచొక యుపాయముఁ గాంచి సునిశ్చయంబుగన్. 21

ఉ. అంగజసన్నిభుండగు ధనాధిప సూతికిఁ దార మ్రొక్కి చే
యాఁగల విన్నపంబు మదనాతుర నైతి మదీయమందిర
ప్రాంగణ వృక్షవాటికి రయంబున రావలె రాకయున్న నీ
యంగన నైన రంభ పదమాన యటంచొకచీటి వ్రాయుచున్. 22

గీ. ఒక్కసంపంగి బంతిలోఁ జెక్కి వింత, యంపమిది లెస్స చూచి కొమ్మని కుబేర
పుత్రునకు నిచ్చిరమ్మన్న బోఁటిపైఁట, బొదివికొని ముద్దునడలతో బోవునపుడు. 23

ఉ. చెక్కిటఁ జేయిఁ జేర్చి నను జెందెడు కోర్కుల నూడిగంపు వా
డొక్కఁడుఁ దాను నుండి యతఁడో చెలి రమ్మనరేంద్రనందనుం
డెక్కడనుండెఁ దార యిపుడేమి యొనర్చుచు నున్నవంచు పె
న్మక్కువ నాదరించి బహుమానము సేయఁగ డాయ నేఁగుచున్. 24

గీ. అయ్య మాబావ తమయవ్వయాచరించు, విష్ణుపూజలకతిగ నెవ్వేళ రాడు.
వనితయీబంతి మీచెంత కనిచె వింత, చెలువు గూర్పంగ గలవని చేతికొసఁగ. 25

చ. కమఁగొని మోవిఁ గ్రోల్గతి మొగంబునఁ జేర్చుచుఁ బల్చకుం బలెం
గనుఁగవఁ దార్చుచుం జెలికిఁ గప్రపువీడె మొసంగి పంచి యి
చ్చిన తమి చెండుఁ విచ్చి యటఁ జెక్కిన చీటి పఠించి చూచి యే
మని కొనియాడెనో తెలియ దంతట నిచ్చల నేను గ్రక్కునన్. 26

ఉ. ఇంతకు నచ్చునో యతని కీపనికిన్ మనసొగ్గదో శచీ
కాంతుని యొద్దకీ యశుకగాంచునో చూతమటంచు వెంటనే
కాంతయుఁ రాక యుండఁ దిరుగందిరుగం గనుఁగొంచు మవ్వన
ప్రాంతముఁ జేరి యందొక లతాంత నికుంజముఁ జేరబోయినన్. 27

క. మొలవంక పెద్దకత్తియు, చెలువగు చేలమ్ము ధట్టి చెరగులు బుడసా
తళుకు రుమాలువు మించఁగ, నలకూబరుఁ దద్గృహంబునం గనుఁగొంటిన్. 28

గీ. అప్పుడేమందు నాదు సిగ్గమ్మలార, వెనుకడుగుగాఁగఁ దలవంచికొనఁగఁ జేసె
కాంచి వాడును నిలువునఁ గౌగలింపఁ, బొంగిపైఁబడితిని పైడిబొమ్మవోలె. 29

మ. అకృతానందనివాస దీనవచనం బప్రాప్త చేషావిధా
నకమజ్ఞాత నఖక్షతాంకుర మసందష్టాధరోష్ఠంబ పే
తకపోతారవ మప్రయుక్త గురు బంధప్రౌఢిమం బైన ప
ద్పక జన్యంబున నేస్తురాల నయితిం బ్రావీణ్యహైన్యంబునన్. 30

ఉ. విడువని కౌఁగిలింత పురికొల్పని మచ్చిక తన్పులేని సం
దడి కోసవింత చూపుమరునాటికి నమ్మనిక్రొమ్మొక్కు తోడిత్రో
క్కుడు నగ మాట నీటులయు గూడని నెమ్మది గల్గి యొక్కక్కై
వడిఁ జెనఁ బాసి యింటికిని వచ్చితి నాతఁడు నేఁగునంతటన్. 31

క. దినదినమున్ వనమున ముం, పనజనముం గనుమొరంగి ధనరాట్సుతుతో
ఘనరాగము దనరారఁగ, ననరాశిక్రీడ నోలి లాడుచునుందున్. 32

ఉ. అక్క యిదేమొ కాని తెలియం బడదాతఁడు వీధివెంట బల్
టక్కులతోడ రాఁ బొడగిటన్ నిలునంబడి తొంగి చూచునో
దక్కిన చేష్టలున్న వెకదా మఱి యెక్కడనుండి వచ్చునో
పక్కన వచ్చునమ్మ చలపాది మిటారపు నవ్వుతోక్కటన్. 33

క. తనువు జయంతుని పక్కన్, మనసాధనరాజవరకుమారుని చెంతన్.
జొనుపుదుఁ గోరక పశనా, ననదసెనాజోదు దురమునం బెనఁగునెడన్. 34

సీ. చెలరేఁగి పలరాచ చెలువుల పెనుకతల్ వినిపించునప్పు డూకొనెడుదారి
ఎటుఁ బోయి తన నిట్టి యొపకంచుఁ బొసగింపఁ బోవుచోఁ దపఁబడుబొంకుమాట
ప్రేకఁటి యలుక కల్పించి మంచముకోఁడు గాఁగలించుచో కమ్మగాని వింత
యల్లయా చెలిమంచిదని మెచ్చుచోఁ గోపగించక మైకోలుగాంచు సేర్పు
నించువిలుకాని జగడాన నెంతతడవు, చాలువనుపల్కు నిన్నాళ్ళసరణిరాజ
రాజతనుజాతుఁదలప కూరకయ యుంటఁ, దెలిసిదేవేంద్రసుతుడు సందియముఁ జెందె,

గీ. అంత నచ్చట రంభాంవృగాయతాక్షి, యేమొ నలకూబరుం డంటి యిచవుకొనియె
నౌర యంటేఁ గన్నకు మారుకమ్మ, యంపఁ డెంతటి వారతనంబను చుఁ బలికె. 36

సీ. విననింపుగా మేళవించి యుంచినయట్టి యల్లవీణియ యుంచి నట్లెయుంప
వెరబొంత గొనెన వేసి మూసినయట్టి యరలపెట్టియ మూసినట్లెయుంప
నెఱికగాఁ బెట్టి దండెము వ్రాఁవవైచిన యంగవస్త్రము వైచినట్లెయుంప
నెరవుగా నూరి గిన్నియల నించినయట్టి యరిదికుంకుమ నించినట్లెయుంప
నెందుపై నిచ్చలేక యేమేమొ తలఁచు, కొనుచుఁ జెలులను జంకించుకొనుచుఁ బలుక
కొసరుమాటకుఁ గట్టిగాఁ గసరుకొనుచుఁ, దాళ గూడనివింత విరాళియొత్తె. 37

గీ. చికిలిలోపలనే చీమచిటుకుమన్నఁ గనకననకూయు బకదారి కవలకడన
మరుని వెరళించు మల్లంటు విరులకడనఁ, బడుకయిలుమాని విరహతాపంబుబూని. 38

సీ. నీనాయకుఁడు వచ్చెనేయన్న విసువుగా నతఁడేమిటికి వచ్చునమ్మ యనుచు

పొలఁతి యదిగొ వచ్చెనటంచుఁ బోలి వాఁడిటువచ్చె నెంత రాకెంతయనుచు
రాకున్నవాని గోరకుమన్న నయ్యెఁబో నవ్వానిఁ గోరనాకేల యనుచు
యదివచ్చెననలేచి యంపరానానఁ జిక్కెను బిల్వనచ్చితినటంచు
చెలుల కార్తీయవిరహంబు తెలియనీక, మాటిమాటికి నిలిచిన చోట నిలువ
కాలతా తన్వి మది జాలిమాలికొనుచు, నతనికడకేగు తమి నున్నయవసరమున. 39

సీ. కైటభాదినిశాట ఝాట ఖండనపాట వాటోప కపట విరాఁది పాటలవర
రాజతాచల రాజ రాజహంస విరాజి, తంబగు తనుకాంతి యోజమెరయ
తోయజినీ ప్రాణనాయకరుచి ధాయ కాయతంబగు జటా చ్ఛాయవెలయ
సామజ ఘనసారసోమ కల్పకభూమ ధామకంబగు నక్షదామ మొలయ
ఆలములు లేమి డొక్క వెన్నంటికొనఁగ, దెలివిగల కన్నుఁదోయి గుంటలుపడంగ
బొంచికొని జెట్టిమాట లాలించుకొనుచు, నచ్చటికి వచ్చె వేలుపు గచ్చకాడు. 40

గీ. వచ్చి యచ్చరప్రోయాల వచ్చివెనుక, ప్రమొక్కుదువుగాని కొమ్మనీముద్దుమగని
యొద్దనుండినదని వీణె యొరగులోని, చీటివడి నిచ్చి చనిన నచ్చోరువుదోఁప. 41

క. అది చదివి కొంతసేపా, మదవతి నివ్వెరఁగుకలన బ్రమన్పడి మఱియుం
జదివికొని యదిర తారా, మదిరేక్షణ కింతభోగమా కావలెనే. 42

సీ. మఱచెనో సంగీత మర్మకర్మములు నావలన నొక్కొక వేళఁ దెలిసికొనుట
యెఱుగదో తాను నాయింటికి వచ్చి నే నీదాన జుమ్మ మన్నించు మనుట
కానదో యూర్వసీ కాంతకుఁ దనకు వాఁడెచ్చిన నేను వహించుకొనుట
తలఁపదో సురరాజు కొలువులోఁ దన పాటవినిపించుమని నన్ను వేఁడికొనుట
యేటికీపని తనచెల్మి వీటివోవ, నిన్నఁగ దవమ్మ వింతవన్నియలవంచు
సురటులు లంతలఁ బల్లటీ జోడులనిపె, నింతలోనన యీగర్వమేల వచ్చె. 43

సీ. దేవేంద్రుఁ గనఁ బోవుచో వాని చెంగటఁ జెలుల నమ్మక దాని నిలిపిపోను
వాఁడు నేనును వింతవగలఁ గూడిన పొందికల దారి దానితోఁ బలికికొందు
దీని నేటికి నిందుఁ దెచ్చితి వన వానిదిక్కు వీక్షించి గద్దించి నైతు
వాఁడు నామది మెచ్చవలసి తెచ్చినమంచికానుకల్ వెసదాఁచి దానికిత్తుఁ
గపట మింతేనిఁ దెలియదుకనుక మేక, వన్నెపులియయి యిందరమ్మనఁగనిల్లు
నైకొనుట గానలేక యాకాపురాలఁ, గారవింతునె నమ్మి నే వీరిదైతి. 44

గీ. అప్పుడేవాని బావ బావనుచు మేర, మీరినదువంగఁ గని మందెమేలమనుచు
నోర్చుకొని యుంటిఁ గాక యీయుత్పలాక్షి, గురువులకు బొమ్మ వెట్టుటయరయ నైతి,

గీ. ఇపుడు నైతము దానిపై నీసు లేదు, నమ్మికయె గాని యాతంపనాల తపసి
కడుపు సాకంగవలసి యీకరణిఁ జీటి, నేనుగిని యంగ గల్పించె నేమొకాని. 46

మ. అకటా కాదిది తారవ్రాలవును జుమ్మీ కన్నె యావన్నెకా
నికిఁ దానంపిన దేమొ చీటి మఱి వానిం జూడఁగాఁ బోయి మా
నికులాగ్రేసరుఁ డేమరించి వడిదీనిం గైకొనం బోలుఁ గా
నుకగాఁ దెచ్చెనె కానిచో నతఁడు నన్నుం జౌకగాఁ జూచునే. 47

శా. ఔనే తార శబాసు మెచ్చవలె నాహా నీగుణం బింకిటన్
వానిం జూచిన నీకు నిన్నుఁ గనుఁగొన్నన్ వానికిన్ శోకసం
ధానం బొందఁగఁ జేసినప్పుడుగదా, నా కూచి లేకున్నచో
నేనేరంభనె యచ్చరల్ వొగడఁగా, నీపేరునం బిల్వవే. 48

క. అని నిశ్చయించి రోషం, బినుమడిగాఁ జీటి యిచ్చి యేమేమో మం
తనమాడి పొమ్ము పొమ్మని, తనబోటిం బనుపఁ ఘనపపస్ఫుటగతిన్నై. 49

చ. అది చనుదెంచి నందన వనావనిఁ జప్పుడు కాకయుండఁ గొం
- పొదవిన చూడ్కితోఁ బరిజనోత్కరముం జవ మల్లి చూచుచున్
గుడిగొన నూటి గాగఁ గనుఁ గొంచు మెఱుంగుల నంట వింట బె
ట్టిదముగ గువ్వతంపము వడిం బడ వేయు జయంతు చెంతకున్. 50

గీ. చేరి మారంభ వనిచె నీచీటిఁ జూచి, కొమ్ము నీవంటివానికిఁ గొదవగాదె
యాట దానికి నింతమత్తా యిదేటి, మోహమయ్యె యటంచు నమ్మదితవలుక. 51

క. ఆచీటిఁ జూచి వేలుపు రాచూలి మెఱుంగు కలకరాఁ జేటి దెసన్
జూచి వినుమింతె విటులకు, మీచెలికిన్ జూడు నేఁడు మెచ్చునుటెంతుక్. 52

గీ. అనిగిఱుకున్కఁ దిరిగి యయ్యమరనాథ, పుత్రుఁ డంపఱి నిండ్లకుఁ బోవబనిచి
సురగ దురదుర నాయింటి కరుగుదెంచి, యేమిచెప్పదుఁ బొవరింటికేగుదెంచె. 53

మ. అపుడే గ్రొవ్విరులంది యా[illegible] ధనరాజాపత్య మచ్చంపు ని
క్కపుఁ బ్రేమన్ జడయల్ల నేమడు వొసంగం బట్టి చేనొక్కి నే
రుపుతో నిచ్చినఁ గాని యొల్లనని మార్మోమైన నేనంతఁ బ
ల్కుపరాకింప మటంచు మర్లయొసగం గోపంబు దీపింపఁగన్. 54

క. ఔనన్నా నరకూబర కానీమన్నా యటంచు గ్రక్కునఁ దిరిగెన్
దానుం జనె నర్థేంద్రజుఁ. డేనుక్ భయమొదవ నింటికేగితి నంతన్. 55

క సూరెలను నిద్రజుఁడు క్రో, లారికమందిన నతండు లలితోల్లాసం

బోరంగఁ గోపపడెనా యీరీతియు మంచిదని ప్రియంబునఁ బలుకెన్. 55

సీ. ముడిపువ్వుటొత్తులు మూఁడువేళలఁ దెచ్చియిచ్చువారలయిష్టమెల్ల గలిగెఁ
జనువుతో దారికట్టును మొనకట్టును దెలుపు వారల మనువులు ఫలించె
నింత మాత్రమునకు నీవేల నేబూనికొనియెదవనివారి కోర్కెలొదవె
కైసంట వింతగా గైసేయు నాడిగంబుల వారి యాప్తవిస్ఫురణమించె
దొర దాతలరాయ బ్రహ్మయు వసెన, వారికెల్లను ధనములవ్వారియయ్యె
నొంటిపోటాట తత్తరంబునన మేని, వాంఛయంజక పర్తించు వారివలన. 56

సీ. బొక్కసంబుల బీగములు దెచ్చి సొమ్మెల్ల వెత్తి యెత్తినరీతి వెచ్చపెట్టి
గెలిచిన నానెకా తలఁప వేఱొకటైన పయ యుంచుఁడనుచుఁ బెద్దలకుఁ దెలిపి
వడిరోసమెత్తి పైఁ బడకెచ్చరించి చెంగట నిల్వఁడని నేస్తకాండ్రఁబలికి
చెల్లుగా మనసువచ్చిన పదార్థములెల్ల నరతఃవ్రతీరంగ ననుభవించి
యోర్వకీడ్తు తమలోన యెవనికొక్క, యీ చెలి యటంచుమదిలోన హెచ్చరించె
పొగలపెట్టెలు నునుధట్టిపారల వరల, తెల్లవారక మును బయల్ దేరుటయును. 57

వ. అప్పుడత్యాశ్చర్య చర్యాధుర్యంబగు నక్కార్యంబు చారణు విని కిన్నరు లాలించి విద్యాధరులు చెవినిడి కిన్నరులాకర్ణించి వెరగుపడెం దదాప్త పరంపరానువాక్యంబుల నెక్కడెక్కడ యని తత్తరంబునఁ బరువెత్తువారును నేమేమి యని యడిగిన విస్తరింపక జయంతనల కూబరులఁట యనుచుం బరుచు వారును తారనిమిత్తంబున నెంత పుట్టెంగంటిరే యెంత గయ్యాళి యనుచుం జనువారును నింద్రనందనునకు బందాకోసైన యీరాజసదన కుబేరకుమారునకు లోనైన యప్పుడే వివాదంబు సిద్ధంబను వారును వెలకొమ్మలమనంబులు నమ్మవచ్చునే యనుచు నవ్వువారును, నిట్టి యెడంబుట్టిన రోసంబులు వారింప నెవ్వరి తరంబనుచుఁ దమ యేలికలకు నెప్పటి సమాచారంబులప్పటికిఁ జీటులు వ్రాయుచుఁ గక్కసంజనవలెఁ జామీ యనుచు వేగులవారి నెచ్చరించుచుఁ బోవు నియోగులును, ఘొల్లునఁ గేకలునైచి కేరుచుఁ జంగునఁ దాటుచు నేఁడుగదా వేఁడుక చూడఁ గలిగెఁ గదా యనుచు గమకించు కోడెకాండ్రును గాయంబులు గట్టుటకు మందు సంచులు బుజంబుల వ్రేలాడ బొజ్జలపరంజను జేలుపు వెజ్జులును, జేటికావిదిత తదీయవృత్తాంతంబు విని యమ్మక్క యీచక్కనివారలకెక్కడ నుండి వచ్చెనే యనుచు మేడలెక్కి కనుంగొను నవరోధగిరి పరిచారికలును గన్నుంగని యెంతసిగ్గరిదీ తలయెత్తదే సంగనాచియనుచు మాటులు పాడుచువారును నింకి మీఁదమికి పెంబులు చెల్లునే యనుచు మదలఁ బంకించు న

ప్పాటమెఱుంగుబోడులను నైయమురావతీపురంబువాటంపుటును సంపడింపసేఁ బుట్టిఁ
చమండు హెగ్గడికత్తియల బలసిని డిగ్గున లేచి శచీమత్తకాశిని దుఃఖాయత్త
చిత్తంబుతో నచ్చటికి నత్తునను దుఃపత్తరింప బోటుముడితో నతిరూక్షంబగు వీ
క్షణంబున నిలువరించి నగరు వెలువడి తమకంబునఁ బైటికిం జనుచెంచెనంత సంత
యము విని యఖిలదిక్పాలకులును బ్రహ్మాదిదేవతలు నేతెంచిరట్టియెడ. 58

సీ. మనకేమి పని మాచికొని యుండ మీరేమి యనఁబోకుమీ యనియనుసరించి
నీపుణ్ణ మిచ్చట నీపగ్గె సేరయించి బోయి దీప్పకుమంచుఁ బొందుపఱచి
మనచేతఁ గాదు వీరిని శాంతుల నొనర్ప నారదుండెపమంచు నొద్దనిలచి
నానోటి కడికి విఘ్నముఁ జేసినపుడె శపింతుఁ జామ్మీయని బెదరఁజేసి
వారి వైరంబుఁ బురికొల్పఁ జేరి నారదుండు వీణగవిశనను దొలఁగఁ జేసి
మెల్లుతపఁబడఁ దుడుకుగా మేళవించి, నిలువవారిద్దరును రణోన్ముద్రులైన. 59

క. హరిహయుఁడుఁ గుబేరుఁడు ని, ద్దరునొగి నన్నలువ యహిగుఁ దమ్ముత్రవాలన్
గనిరించి సకలదేవో, త్కరములతో నతఁడు నిలచి తన్మధ్యమునన్. 60

సీ. వలపనిన వారిలో దుష్టి నైచి నట్టి, క్రైగువులజూచి బలికె నే కన్నారంగ
నౌరుల నైతురెయంచు నొందొడ్డికొనుచు, నవునెకద యంచునతఁడుండు నపనమున

శా. అయ్యా కావరె యాడుదాన నబలన్ హా యెవ్వరింగాననా
కుయ్యాలింపరె నన్ను నెత్తికొని దిక్కుల్ చూచుచుం బారెడిన్
దయ్యం బీతని నెవ్వరేని నిజభక్త ప్రోచ్చదుగ్రాగ్నికిం
బాయ్యంజేయక యాడుదీవెనలఁ బొందం లేరనేప్రొక్కుచున్ 62

క. అని యెడు నాడుమొరల్ విని, వనజాఁ డిది తాళికేతు వర్తన మరయన్
మునుదేవ గురుఁడుశపియిం, చినచందము నిట్టిదనుచుఁ జింతించునెడన్. 63

క. ధనరాజసుతుజయంతుం, గనుఁగొని యాచాయ వచ్చు కరివ్యాధుని వ్రే
లునఁ జూపి వీని నిద్దరు, దునుముఁడు పొందనినఁ జండదోర్దండులై. 64

క. చేగవెరచూపు నిగుడెడు, వేగంబున నిగుడు దనుజ వీరుని బుజముల్
ప్రోగువడఁ బంచికొనుచువి, భాగించిరి తనువుతోడఁ బాసిచనంగన్. 65

వ. అంత

సీ. నిగనిగనిగని పెన్నెరిగెంపు మడిపీడి తనదీప్తరీతి యుంపతికి దెలుప
ననరుపాటునఁ జూచు చదువు చూపులవల్లఁ గలువ వసంతంబు గలయఁగుల్లు
నుపొంగ నుండెనుఁ బడఁపడమనుడఁ గెవ్వుల పంప ననుదోయి పుటము లెత్త

గడ గడ మను మేను గలిగెఁ దోడుగనంచు నసియాడు కౌను సంతసము జెంద
వీడుపయ్యెద వసివాళ్ళువాఁడుమోము, నడుగు దడఁబాటు నెమ్మేనఁబొడము చెమట
మెఱయ రక్కసుచే వీడి మీననయన, యచ్చరలగుంపుఁ జేరంగ ననుసరించె. 67
గీ. అంత దేవతలెల్ల జయంతధనద, పుత్రకులనొక్కటిగఁ జేసి పొంకపఱచి
నెల్లవులకు నేగఁ జాలు నానింపతప్పె, ననుచు నేదానిఁ దోడ్కొని యరుగుదెంచి.
క. నాయింటనునిచి మఱియ, త్తోయజముఖి తనకునాఁడుఁ దోడుగఁ జెలిమిం
జేయుచునుండఁగ నొకనాఁ, డాయమ ననుఁజూచి వికసితాననయగుచున్ 69
సీ. వినవమ్మ కుండల యనుదాన నలవిభావసుకుమారిక మదాలసయు నేను
క్రీడింపఁ బాతాళకేతుండు గొనిపోయి మందరభూధరంబందు నిల్ప
నాటికిఁ గువలయాశ్వాధీశుఁ డేతెంచి దనుజేంద్రు ఘోరయుద్ధమునఁ ద్రుంచి
తమ్ముఁ దోడికొనిపోవ మఱివానియనుజుండు తాళకేతుఁడు మహోత్తాలలీల
మాయచే మమ్ముఁ దోకొనిపోయి మేరు, మందిరములందునునుప నమ్మందగమన
గాన కొకనాఁటిరాత్రి నక్కాంతఁ దలఁచి, తలఁచి పొగులుచునున్న నద్దనుజుఁ డెఱిఁగి.
గీ. వెనుకవచ్చిన నీవేగు మనుచు దాని, మున్నుగానంపఁబోలు నీవన్నెలాఁడి
మోసపోయిన నిదియును మొరఁగిపోవు, ననుచు నొకయాగ్రహముఁ దెచ్చుకొనియతండు.
క. వేఱొకతావున నుంచెం, గోరికమై నన్ను నెత్తికొని చనుదేఱన్
మీరల్ చూడఁగ నైనది, మీ తెఱఁగుదు రింక నేల మీపటివార్తల్. 72
క. నాకత యిత్తెఱఁగయ్యెన్, వ్యాకులమున నింత కమ్మగాలస నెటకుం
దోకొనిపోయెనొ దనుజా, నీకంబులచేత నెంత నెగులొందునొకో. 73
చ. తనువులె రెండుగాని వనితా మఱి ప్రాణములొక్కటమ్మ మా
కని పలుకంగ సిగ్గుపొకయ్యెడు నట్టిప్రియాళిఁ బాసి యీ
యనువునఁ బ్రాణముల్ నిలిపినట్టి కతంబున దానిఁజూడ కుం
డిన నిమిషంబు తాళఁగలనే! మఱియెప్పటికేని నేగదన్. 74
గీ. అనిన నూరార్చి యవ్వార్త నరసివత్తు, నుండుమని దాని నాయింట నునిచి యేను
బుడమిపై డిగ్గివచ్చినాఁ నఖముఁగంటి, నారదుని చేత నీను చందంబులెల్ల. 75
క. విని యిప్పటి కరుదెంచితి, మనమచ్చట నెల్లఁదీర మనకుండలసుం
గొనివచ్చెద నని తా నా, వనజేక్షణ చనియె నిజనివాసంబునకున్. 76
ఉ. ఆసమయంబునం దొక ప్రియస్య [illegible]
త్కౌ [illegible] [illegible]

యాసముతో వశీకృతికినై రజమెత్తఁగఁ బూజవెంబడిం
జేసిన రీతి మించి యతిచిత్రజవంబున వచ్చిమచ్చికన్. 77

క. అక్కఋతధ్వజుఁ డట యతఁ, డిక్కడికే తెంచెనఁట ఫణీశ్వరుఁడతనిం
గ్రక్కున నెదుర్కొనంజనె, ఢక్కాపటుపటహతమ్మటధ్వనులాలయన్. 78

క. నగరికిఁ జని కెంపులపని సొగసులుగల మేడయెక్కి చూతమె యనినన్
మగువ సిగ మిన్న యరిగెన్, మొగమలరం జేటికాసమూహము గొలువన్ 79

ఉ. అంత భుజంగపుంగవుఁ డుదారతురంగశతాంగకోటితో
దంతిఘటాఘటాగ్రబహుధావిగళన్మదధార మార్గసీ
మాంతరమందు జల్లు కలయంపులకుం బునరుక్తి నింప న
త్యంతముదంతరంగుల నిజాత్మజులం గనుఁగొంచు వచ్చినన్. 80

గీ. అచట మున్నె తరుచ్ఛాయ నాశ్రయించి
యున్న యానరలోకమాన్యుండు నప్పు
డెదురుగాఁ జని తోడ్కొని యేఁగి యచట
నుచితకృత్యంబు నడుప నయ్యురగ విభుఁడు. 81

సీ. లేచి నిలుచున్న మంత్రులఁ జూచి రాజు, వారి గుణకథనంబు లవ్వారిగాఁగఁ
దెలుప విన్నందులకు మేము పిలువనంపి, నపుడె వచ్చినయందుల కనుగుణంబు. 82

క. అని సన్నుతించి విడిదికిఁ జనుఁ దెంచని కుంభినీంద్రజం భూరిం దో
డ్కొని చని యట నలుపా నిం, డినయొక గేహమున విడిది నియమించె వెసన్. 83

చ. అతనికి నమ్మదాలస యుదారకథాభ్యుదయంబుఁ దెల్పి యో
క్షితివర పెండ్లి యిచ్చుటనె చేయుతలంపున నిన్నుఁ బిల్వఁబం
చితినని సంబరం బొదవఁజేసి ఫణీంద్రుఁడు పట్టనం బలం
కృతముగఁ జేయఁబంచె బహురీతి ముహూర్తము నిశ్చయించుచున్. 84

క. అంతఁ గుండలఁ దోడ్కొని యరుగుదెంచి, తార యంతయు వినిమోదవారిరాశి
మగ్నయై తద్వివాహసంభ్రమముఁ జూచు, తలఁపు బొడమిన నచ్చోటనిలిచెనంత.

క. ఎలమి నల చిలువరాజు, చెలిచెల్వుఁడు పెండ్లికొడుకు సింగారింపన్
జెలులను బనిచిన ననిచిన, తలఁపుల వారరిగి వసుకొతు లింపాసఁగన్. 86

చ. పసిహారువుం బెనంగొనిన బంగరునిద్దఁపుఁ బెంజిపీఁటపై
జవసతి నుంచి యొక్క యెలజవ్వని మేల్ బురుసా రుమాలు గం
పనప్పు మెఱుఁగు నైఁ గవఁగొఁ బాయెతుచేరుల నింపఁ చాపి ఘు

మ్మను విరిపువ్వుకెత్తుల నొయ్యారముగా సవరించు నంతటన్. 87

మ. తెలుపుం బాపటబొట్టు చందమున నృత్యంబాడు నాసామణిం
బలె నర్తింము సరంబురీతి నటనప్రావీణ్యముం జూపు గు
బ్బల హాస ద్వయ కంకణధ్వనుల సేబాసంచు మెచ్చింపమిం
పలయం బెం వరశాక్షి యొక్కతె ధరానాథాన్వయస్వామికిన్. 88

క. ముందుగ నిగ్గులనీలము, లొందింపక చిక్కువడక యుండ న్నెఱులన్
గందపుటటక లిడియె నొక, యందపు నెఱవన్నెలాఁడి యన్నరపతికిన్. 89

మ. జలముల్ తెచ్చిన పైఁడిబిందియల మెచ్చం బోని ఘర్మాంబుకం
పళిపుం జన్నులమిన్న లీయ లతలానంచమ్మనం దేనెపో
సలువంచన్ నలువొందు తుమ్మెదలనన్ రాజిల్లఁగాఁ బెన్నెఱుల్
జలకం బార్చిరి కొందఱిందుముఖులాసర్వంసహానేతకున్. 90

చ. చలువలొసంగి వేడుక పొసంగ మెఱుంగుపరంగిపీఁట న
న్నెలఁతలు రాచ కేమగని నిల్పి కురుల్ తడియార్చి గోరులం
గలయఁగ దువ్వుచున్ హాయిలుగా సిగవైచి మెఱుంగుముత్యమున్
గులికెడు బాసికంబు పగఁగుట్టి రుమాలువు గట్టిరంతటన్. 91

గీ. కలికి యొక్కతె పెద్ద చొక్కట్లు పెట్టె, ముదిత యొక్కతె నీలంపుమురువు నిలిపె
రమణి యొక్కతె పచ్చతురాయ మర్చెఁ, గాంత యొక్కతె తెలిపతకంబు లిడియె. 92

క. ఈరీతిఁ జెలులు నృపుసిం, గారించి యనంతభుజగకాంతుపనుపున
దార మొదలైన వారొ, య్యారిం గైసేయ నిర్ఝరానందమునన్. 93

వ. భుజంగపుంగవుం డభంగురత్వరాయత్తచిత్తంబుతో బడిబడిం బనుపఁ బుడిబుడిం
జనుదెంచి యమాత్యులు ముహూర్తక్షణం బాసన్నం బయ్యెనంచుఁ విన్నవించినం బ్ర
సన్నవదనంబుతోఁ జిన్నివెన్నెలతో సరిమన్నెఱకం బుప్పళించు కప్పురంబులతోడి
విడియంబు లొసఁగి గద్దియ డిగ్గి ముద్దియలొసంగు కైదండఁ గొని విడిది వెలువడి
యుద్దండగండమదధారావిభ్రమద్భ్రమరీ మండలంబగు వేదండంబు నెక్కి వామ
హస్తంబునం బ్రశస్తమణిగణోత్కీర్ణంబగు నంకుశంబునం గుంభంబులూఁది వెనుకం
దగు నూడిగంపుఁ జేడియ లందియిచ్చు పానపడుం దెలనాకుమడుపులకుం జాచు ద
క్షిణకరంబునం బొసంగు నుంగరంబులం జెలంగు మగతాల డాలు పరిచారకులపై
వెలిపావడలతో వీడఁజోడాడ నిజప్రకల్పితతరంగతురంగవొన్ని గ్రుంమగుటను
మెచ్చి తరణియనిపిన కిరణసహస్రంబులనం బెంపుఁగను కరదీపనికాయంబులు తే

లతలనం బ్రతిఫలించి గజాంబుధిరాజపుత్రికారాత్రికంబు సవరింపంబడం బరఁగెబా రు దీప ప్రతాపాంకురంబులనం బరఁగు బురుసలతోఁ గురుజులపైఁ దిరుగు సురగ కరిగమనల వలయాకారపరిభ్రమచ్ఛిరోమణీనికాయంబులకు సంగడీలైతురంగ లింప రంగదుత్తుంగభర్మ్యహర్మ్యాగ్రంగనావికీర్ణలాజాసమాజంబులు భానుకల్పితం బులగు ముత్తెంపుఁ దలఁబ్రాలునకు స్మారకంబులై రకంబుఁజూప వింతకోపుల నాఁడు వెలచేడియల మైసిరియెడం బళుకుతళుక్కుమనం బిక్కటిల్లిన వెన్నెల ల క్ష్మీణమణిగవాక్షంబుల వలనంజూము నవరోధగిరి పయోధరల మొగంబుల ముట్టు బట్టబయలు చేయ సర్వసన్నాహంబు మెఱసి యరుగుదెంచిన కువలయాశ్వనశ్వత రోరగేశ్వరుం డెదుర్కొని నీరాజనాద్యుపచారంబులు నడిపించి తోడ్కొని చని వివాహవేదికాంతరంబున సుఖసమాసీనుం జేసిన యనంతరమున. 94

చ. వరుస మెఱుంగు బాసికపు వజ్రపుఁ గుచ్చుల గచ్చుపైఁ బరా
బరి యొనరించు ముత్తియపు బ్రావిలినిగ్గు పరాకుఁ దెల్పని
బ్బరముగఁ గొంకుఁజూపు దొరపాదనఖద్యుతి మీఁదినేరమే
యరయ వివాహవేదికడ కల్లమదాలస వచ్చినిల్చినన్. 95

సీ. తరుణులు వెలిపట్టు తెరవట్టఁగా నశ్వతరుఁడు దేవిపసిండి తళుకుగిండిఁ
బన్నీరువంప భూపాలు పాదాబ్జముల్ కడిఁగికన్నియమాట్కు కరణిఁదనరు
మొనగ్రిక్కొంజిగికట్టు బ్రాలపుట్టికలపైఁ జలియుసలియు
నిలిచిన ముద్దుగుమ్మలసోబనపుఁ బాట నిజపురోహితవేదనినదముఖిల
వాద్యఘోషంబు ఘనవైభవంబు మెఱయ, దారవోసెను పదపడివారుకొంకు
సిగ్గు తమకంబుఁ జిఱునవ్వుఁదొంగలింప, నొండొరులమాట వీక్షింప నుచితరీతి. 96

మ. కులుకున్ సందిటఁ జెందు మైలతిక కొంగుల్ రంగులీనంగఁ గ
మ్మలడాల్ చెక్కుటఁ జల్లుకీలుగొనఁ గొమ్మల్ చేరిపోయించఁగా
బలు కీవుల్ పచరించు చూపుజిగితో వాదించు ముత్తెంబులం
దలఁబ్రాల్వోసె వధూటి భూధవసుధాధామోత్తమాంగంబునన్. 97

క. అంగాంగసంగతిని దన, ముంగై చెమరింపఁ గంపమున సతికిన్ రా
జాంగజుఁడు కట్టె మణిమయ, మంగళసూత్రంబు జాయమానోత్సుకుఁడై. 98

క. తాలిమిఁ బురోహితుఁడు మం, త్రాళుల్ చదువంగ నిర్భరానందమ్మునం
గెలిఁదగ దంపతుల్ మఱి, వేలిమి గావించి రుచితవిధమున నంతన్ 99

గీ. మంత్రతము లెసంగ సన్నికల్ మెట్టఁ జేసి, రప్పుడు పురోహితచయంబులంతనుపగ

కాంతు లందఱుఁ గట్టువర్గములగములు, వరుసఁ జదివించి రవ్వధూవరుల కెలమి. 100

ఇవ్విధంబున వివాహమహోత్సవంబు ప్రవర్తిల్లినం దినచతుష్టయానంతరంబునం బ్ర
తిప్రయాణోన్ముఖుండైన కువలయాశ్వునకు నశ్వతరుం డనేకవస్తువులరణంబొసంగి
మదాలసావిలాసవతికిఁ బుద్ధులు గఱపి కుమారద్వయంబును దాదాకుంపలాదివేదం
డగమనలను వెంటం గూర్చి యనిపిన రథారూఢులై వారు గోమతీనదీముఖంబునఁ
బాతాళలోకంబు నిర్గమించి శోభనాలంకారాకారంబగు నయోధ్యాపురంబుం బ్ర
వేశించి గృహప్రవేశంబు గావించి యున్నమఱునాఁడు దినాంతసమయంబున. 101

ముంగల నుబ్బుచప్పరము ముత్తెపు ముగ్గులుఁ బూలమేలుక
ట్టుం గొదలేని చిత్తరువులున్ బురసోపనితోడిమంచముం
జెంగట బీసవాగముల చెల్వము గల్గిన కేళిగేహసీ
మం గమనీయవేషమున మానవనాయకుఁడుండు నయ్యెడన్. 102

తార కుండల మొదలైన తలిరుఁబోఁడు, లమ్మదాలసఁ జూచి రావమ్మ నీకు
వరశుభప్రాప్తి చేకూర వలయు ననుచు, ననుచు వేడుకఁ దమలోన నవ్వుకొనుచు.

జలకముఁ దీర్చి పావడ కళల్ వడిమార్మడివైచి జాలువా
వలిపెముఁ గట్టి గుబ్బల జవాదియలంది తురాయిరీతిగా
నలరులు గొప్పునందుఱిమి హారములుంచి పిసాలికస్తురిం
దిలకము ముద్దుగా నుదుట దిద్ది గుముల్ గొని వారలత్తఱిన్. 104

అన్నియుఁ దెలిసిన వన్నెలాఁడికి నీకు దెలిపెడిదేమమ్మ కలువకంటి
వినవమ్మ మగవాని మనసు చూడఁగఁ గంటఁబడను వంటిదిసుమీ పద్మగంధి
యిన్నాళ్ళవలెఁ దోడి యింతులతోడి యాటలు గావు గద యిదితలిరుఁబోఁడి
యిదిపతి మనమెట్టు లెనయించెదో నేఁడు నీ నేర్పుచూతము నీరజాక్షి
యిక్కడనె యింత సిగ్గైన హృదయనాథు, నెట్లు గరఁగింప నేర్చెదే యిందువదన
భావ మెఱిఁగిన జాణవు గావె సఖియ, మెఱిఁగి తఱితీపు నేయుమీ యిగురుబోణి. 105

అనుచుఁ దోతేఱ నప్పడవ్వనజవదన, సిగ్గు వెనుకకుఁ దిగువ నెచ్చెలులఁ జూఱుచు
మాటముందఱికీడ్వంగ మందగమన, మినుమడింపఁగఁ జనికేళిగృహముఁ జేర 106

వనజాక్షులందఱొక్కొక, పనినెపమున జరుగ సరసఁ బగడపుఁ గంబం
బును జాఁటుగాఁ గొనుచు ని, ల్చినతరుణిం జూచి విభుఁడు చిఱునవ్వొలయన్. 107

లేచి నిలువుననే కౌఁగిలించుకొనుచు, విరులపాన్పుననుంచి పెన్నెఱులు దువ్వి
కప్పురపుఁదావి గుప్పు బాగాలొసంగి, పాదలి తమకమ్ములు రెట్టింపఁ బుజ్జగించి.
అలరులానిన తుమ్మెదలా నిక్కుపున్నంగొ తరుణిచూతమటంచుఁ గురులు దువ్వి

కమ్మబంగరు సిగ్గు కలిగినపలుదాలా చెలువమాతమటంచుఁ జెక్కునొక్కి
ముక్కుఁజూ ముత్తియంపు మెఱుంగులేన వ్వె ముదితమాతమటంచు మోవిపుడికి
కుంకుమ జిగియొ సెక్కెను గుంపుదండయో కొమ్మమాతమటంచు గుబ్బలంటి
తెలివిదైయెమీరు నూగారు దీప్తియొక్కె, మేలి మొలనూలి నీలమో మెఱుఁగుబోఁడ
చూతమని పోకముడివిప్పి సుదతిఁ గరఁచి, యింపువిలుకాని సామ్రాజ్యమేలి విభుఁడు.

క. అంతట వేఁగిన ధరణీ, కాంతుఁడు సంధ్యాదికములు గావించి ప్రజన్
సంతసమునఁ బాలింపుచు, నింతింగవఁ గూడి సౌఖ్యమొనయుచు నుండెన్. 110

వ. మునీంద్రా! మార్తాండదత్తంబగు కువలయాశ్వంబు వలనం జయంబందుటం జేసి ఋ
తధ్వజుండు కువలయాశ్వంబను నామంబరఁగెనని సంతోషభరితుండై జైమినిముని యవ్వి
హంగమములం బూజించి సుఖంబుండెనంత. 111

క. ఈకువలయాశ్వచరితముఁ, జైకొని చదివినను వినినఁ గారుణ్యసుధా
శ్రీకరుఁడు కృష్ణుఁడొసఁగున్, శ్రీకరముగఁ బుత్రపౌత్రచిరవిభవంబుల్. 112

శా. పూర్వగ్రస్తవినిర్మలత్వ బహిరుద్యద్ధారకీర్త్యంకురా
ఖర్వచ్ఛాయ కరస్థఖడ్గ, సబలాకారేఖ మేఘోల్లస
త్సర్వాశౌఘతమిస్రఘస్మరమహాసౌదామినీసూతికా
గుర్వర్ధార్పణ హృష్టయాచకజనా కోదండలీలార్జునా. 113

క. ధాటీకరటి ఘటారథ, కోటీక్షిత్యారికుంభికుంభతటమణీ
కోటీవైవాహికము, క్తాటీకనవిజయమాశ్రితకరాంబురుహా. 114

మాలిని—పరిభృతభుజతేజా భానుమద్బింబభానూ
ద్భవహారిదబలాంగ స్థాయిఘుర్మోదబిందూ
భవదనభిముఖారి భ్రామ్యదైభాగ్రహస్తా
ప్రవివృతబలతేజా ప్రౌఢకీర్తిప్రకాశా. 115




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయాభరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహరరూపరేఖావిజితచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివాతాఽకవిజనామోదసంధాయక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబను మహాప్రబంధమునందు సర్వంబును బంచమాశ్వాసము.



సమాప్తము.